# శ్యామల

## ( చరిత్రాత్మక నవల )

రచన

కవిరాజహంస — కవికులాలంకార
శ్రీవేంకట పార్వతీశ్వర కవులు

ప్రకాశకులు
కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్
సంస్కృతాంధ్ర బుక్‌డిపో ( స్థా. 1882 ) రాజమండ్రి.

పునర్ముద్రణము

ముఖచిత్రము : : :

శ్రీ వడ్డాది పాపయ్య

ముద్రణ : : : : : :

రాజేశ్వరి ప్రెస్,

రాజమహేంద్రవరం.

మూల్యం 4 రూపాయలు

# శ్యామల

## పరిణామము

భూతభవ్యభవద్భావ • బోధ్యమైన
కాలమున కించుకయు మార్పు • గలుగఁబోదు
గాని దానిగర్భంబులోఁ • గలసిపోవు
వివిధపరిణామసంతతుల్ • వేనవేలు.

రక్తవాహినిలోపల • రాజ్యలక్ష్మి
రాజ్యశాసనములలోన • రక్తవృష్టి
విమలరాగాంకురమున వి • ద్వేషరేఖ
ద్వేషతమసంబునను రాగ • దీపకళిక
అమృతవారాశిలోపల • హాలహలము
నీలమేఘంబులోపల • మేలిమెఱపు
పుట్టి పొడసూపుచుండు ట • బ్బురమె కాని
యేవియేవిచేతఁ బుట్టునో • యెవ్వఁడెఱుఁగు ?

వెనుక నేమున్నదో కనుం • గొనఁగలేము
ఎదుట నేమి కానున్ననో • యెఱుఁగలేము
కార్యకారణ రూపసం • ఘటనములకు
మూలసూత్రంబు కనుఁగొనఁ • జాలఁగలమె ?

తలఁపుఁదరఁగలఁ దిరుగుర • త్నాలనౌక
యబ్ధిగర్భంబులో భగ్న • మైనయపుడు
మేలిసొబఁగులఁదూఁగుము • త్యాలపేరు
ప్రాయ మెదలంగఁ ద్రుటితమై • పోయినపుడు
పూవుగుత్తుల విలసిల్లు • తీవచెలువ
భూరిదావాగ్నిపాలయి • పోయినపుడు
గాంచి యొకసారి విశ్రాంతిఁ • గాంచుకంటె
వేఁడినిట్టూర్పు నొకసారి • విడుచుకంటె
నూర్చి యొకసారి కంటినీ • రొత్తుకంటెఁ
జింతిలుటకంటె నెవరేమి • చేయఁగలరు ?

## అనుక్రమణిక

ఎప్పటి మాటయో యిప్పుడు చెప్పుచున్నాము. నాఁడు మార్గశిర బహుళాష్టమి. రాత్రి పదిగడియ లయ్యెను. భూనభోంతరము నిబిడాంధకారబంధురమై యుండెను. అజ్ఞాన హృదయంబున నాలోచనాంకురములవలె నీలాకాశమున, జుక్కలు మినుకుమినుకు మనుచుండెను. నిరవధికంబును నిశ్శబ్దంబు నగు నయ్యంధకార మధ్యంబునఁ బ్రవహించిపోవుచున్న గోదావరీ తరంగ కలకల స్వరముతక్క మఱి యెట్టిశబ్దమును వినవచ్చుటలేదు. దూరము నందున్న చెల్లసందులనుండి వ్రాలియున్న నక్షత్రములో మిణుఁగురు పురువులో, మినుకుమినుకుమని మెఱయుచుండెను. కాళరాత్రి గభీ రాకారమును ధరియించియుండెను. అడుగుదాఁటి యవ్వల నేమున్నదియో గుర్తించుట కవకాశములేదు. ఆ తమస్సామ్రాజ్యమున నశుభసూచకంబు లగు సృగాలధ్వను లప్పుడప్పు డా నిశానిశ్శబ్ద భావమునకు భంగము గలిగించుచుఁ గ్రూరసత్వములకుఁ బారాకులు దెలుపుచున్నట్లుండెను. ఆ భయంకరధ్వనులు దూరమునఁ గ్రిక్కిరిసియున్న పాపికొండలలోఁ బ్రతిధ్వనితము లగుచుండెను. ఏది యెట్లయినను వెనుదిరిగి చూడకుండ స్వచ్ఛందవిహారిణి యగు గోదావరీ స్రవంతి యొక్కటే గతితో ముందటికిఁ జారిపోవుచుండెను.

అప్పుడు జనసంచార శూన్యంబగు నా సమీపవిపినాంతరాళము నుండి స్త్రీకంఠస్వరముతో "హా! నాథా!" అనునొక యార్తనాదము బయలువెడలి యా గభీరాంధకార సముద్రమును నిశ్శబ్ద తరంగితముగఁ జేసివైచెను. కరుణరస స్వరూపిణియగు గౌతమీమాత నిలువనీరై తరంగహస్తముల నెత్తి ప్రశ్నించినది—ఎవ్వరామె? అనంతవ్యాపిని యగు నాకాశమూర్తి వికలహృదయయై తన కోటినయనములం దెఱచి పరికించినది—విపదంధకారమున మునిఁగియున్న యా యార్తమూర్తి యెవ్వరు?—కరుణమయంబగు నయ్యార్తస్వరము వాయుతరంగ సంచాలనంబున దశదిశా వ్యాప్తమై కరుణాకరంబగు ప్రకృతియం దంతట నస్పష్టముగఁ బ్రతిధ్వనించుచునే యున్నది. కాని, బోధపడుటలేదు. ఆమె యెవ్వరు?—

ఆ శబ్ద మంధకారమున విలీనమై పోయినది. మరల నంతయు విశ్శబ్దము. అనంతరము కొంతసేపటి కస్ఫుటము నతికరుణము నగు నొక శిశురోదనము వినవచ్చెను. అప్పుడు మహీరుహ పత్రములనుండి జాలువాఱుమంచుబిందువుల నెపంబునఁ దమఃప్రకృతియగు రజనీరమణి కూడఁ గన్నీరు విడిచెను. ప్రకృతి కరుణామయ మైనదియే. కావి, పరమేశ్వరుఁడు మాత్రము విశ్చలుఁడు!—ఆ భయంకర సమయమున— ఆ యర్ధరాత్రమున—అతికఠినహృదయంబులనైన నీరుగాఁ జేయఁజాలు నా శిశురోదన మట్లే వినవచ్చుచుండెను. ఆ యంధకారమునం దేమియు నగపడుటలేదు.

క్రమముగాఁ జంద్రోదయ మయ్యెను. ఆ బయలంతయు నతి భయంకరముగ నుండెను. అచ్చట మహారణము జరగిపోయినది ఇంకను నెత్తుటితడి యాఱనేలేదు. మృత్యుదేవత పదచిహ్నము లింకను గ్రొత్తగ నగపడుచునే యున్నవి. విరంతర మహారణవార్త శ్రవణమునఁ జాల కాలమునుండి హృదయములు చెదరిపోవుచున్న యీ సమయమున రణ క్షేత్రముం గూర్చి వర్ణించుట మా కిష్టములేదు.

ఆ రణక్షేత్రమున కనతి దూరమునంగల వృక్షాంతరాళమున నొక్కచో నొక పురుషవ్యక్తియును, స్త్రీవ్యక్తియును బడియుండిరి. పురుషుఁడు యోధవేషముతో నుండెను. వేషభూషణములంబట్టి మండ లాధి పతివలె నగపడుచుండెను. అతని దుస్తులన్నియును రక్తసిక్తములై యున్నవి. అతని సమీపమునం బడియున్న యువతియు రాజ్ఞీమణివలెఁ గానవచ్చుచుండెను. ఆయిరువురినడుమ నొకపసిబిడ్డ యేడ్చుచు నేడ్చుచు నప్పుడే యుదయించుచున్న చంద్రునిం గాంచి యించుక యూఱడిల్లి వెన్నెల వెలుఁగునఁ దల్లిమొగముం జూచి యవ్యక్తముగ నేమేమియో మాటలాడుచుఁ బ్రత్యుత్తరముం గానక మరల నేడువనారంభించెను.

పాపమేమియు నెఱుంగని యీ పసిబిడ్డ తల్లిమొగముపై మొగ ముంచి తన చిన్నిచేతులతోఁ జందమామం జూపుచు; వక్షముపై వ్రాలి చేతులతోఁ దట్టి లేపుచు, అచ్చట నెట్టి ప్రతిక్రియయును లేకుండు టచే రోదనము చేయుచుఁ దండ్రియొద్దకు, బోయి యాతని వక్షముపైఁ

గూరుచుండి మొగముపై ప్రాలుచుండును ; చేతులుచాచి తల్లివైపునకుఁ జూపుచుండును. ఆ యిరువురునుగూడ మరణించిరనుమాట పాపమా పసిపాపకెట్లు తెలియును ? ఆ యర్ధరాత్రమున దిక్కుమాలిన యవస్థలో విలపించుచున్న యా చిన్నబిడ్డ నూఅడించువా రెవ్వరున్నారు ? ఆ బిడ్డ రోదనమునందును జేష్టలయందు నేమేమి భావములు ప్రదర్శింపఁబడు చుండెనో యెవ్వరు గ్రహింపఁగలరు ? చంద్రుఁడు దన చల్లని కరములఁ జూఁచి యెన్నియో విధముల నూఅట కలిగింపఁజూచెను గాని లాభము లేకపోయెను.

ఇంతలో దేవదూతవలె నొక మహాపురుషుఁ డచ్చటికి వచ్చి యా భయంకర దృశ్యముం గాంచి స్తంభితుఁడై పోయెను. ఆ పురుషునిం జూచినతోడనే శిశువేడుపు మానివైచెను. ఒక్కింత సేపటిలో నా పురుషుఁడు నిలువునఁ గూలఁబడిపోయెను. అప్పుడా శిశువు మరల రోదనము చేయుచు నా పురుషునిపైఁ బడియెను. ఆ మృదుస్పర్శమున నాతనికి మరలఁ జైతన్యోదయ మయ్యెను. తోడనే యాతఁడు లేచి యా బిడ్డ నక్కునఁ జేర్చికొని గద్గదస్వరముతో "హా ! దైవమా ! తుదకు మిగిల్చిన దిదియా ! అంతయు వింతయైనదా ?" అని యొక్క వేఁడి విట్టూర్పు విడిచెను. అతని నయనములు శుష్కములై పోయెను. మొగము కందిపోయెను. సర్వాంగములు కంపించిపోవుచుండెను. ఆ బిడ్డ వెఱ్ఱిదానివలె నాతనివంకఁ దెల్లపోయి చూచుచుండెను. పురుషుఁడు మరి యేమియు మాటాడలేదు. ఆ శిశువు నెత్తికొని యా వృక్షాంతరాళమునం బడి పోయెను.

కొంఁదిసేపటిలో నా నిశ్శబ్దార్ధరాత్రమున నా యపరిస్ఫుట చంద్ర లోకమునఁ బ్రతివాయు తరంగమునుండియు నీ దివ్యగానము వెలువడి దిగంతముల విలీనమై పోవుచుండెను.

'త్వ మేవ కారణం కార్యం క్రియా జ్ఞానం త్వ మేవ చ'

'త్వా మంబ ననినా కించి త్త్వయి సర్వం ప్రతిష్ఠితమ్'

'నమస్తుభ్యం జగద్ధాత్రి నమ స్తుభ్యం నమో నమః'

'ధర్మాధారే నమ స్తుభ్యం నమ స్సంపత్తిదాయినీ'

# శ్యామల

## మొదటి ప్రకరణము

గోదావరి తరంగిణికి వాయవ్యము నందున్న భద్రారణ్యమునందలి ప్రశాంతస్థలంబున నొక చిన్న మందిరముండెను. శ్రీరామచంద్రుఁడు సీతాలక్ష్మణులతో నరణ్యావాసము చేయుచున్న కాలమునాఁటికా మందిరము నిర్మింపఁబడి యుండలేదు. అది యెవ్వరిచే నెప్పుడు నిర్మింపఁబడినదో చెప్పుటకుఁ దగిన యాధారములు లేవు. కాని మన కథాకాలమునాఁటికా మందిర మొక మహాయోగి కాశ్రయస్థానముగా నుండెను. ఆరణ్యకులు దానికి వనరాజ దుర్గమని పేరు పెట్టుకొనిరి.

ఇప్పటికి నాలుగువందల సంవత్సరములకుఁ బూర్వము వైశాఖ మాసమునం దొకనాఁడు రెండుయామములవేళ నొక యాశ్వికుఁడు పరిశ్రాంతుఁడై యలసిపోయిన తన గుఱ్ఱము నా మందిర సమ్ముఖమున నిలిపి లోపలఁ బూజాసన్నివిష్టుఁడై యున్న సన్యాసింజూచి "ఆర్యా! నాకు మిగుల దాహమగుచున్నది. దయయుంచి యించుక జలమొసంగినచో మహోపకారము చేసినవారగుదురు" అని కోరెను.

సన్యాసి యా యోధుని మాటలను వినియు విననట్లు యథాపూర్వకముగఁ బూజానియుక్తుడై యుండెను, అప్పుడా యోధుఁ డతిశీఘ్రముగ గుఱ్ఱమునుండి దిగి సమీపమందున్న వృక్షమునకా యశ్వమును గట్టివైచి క్రమముగ సోపానముల నధిరోహించి యా మందిరద్వారము నొద్దకుఁ బోయెను. కాని, యాతఁడు దాహముచే నెంతగఁ బీడింపఁబడుచున్నను సాహసించి లోపలికిఁ బోఁజాలక గౌరవపూర్వకముగ

మరల నా సన్యాసింగూర్చి యించుక జలము నొసంగుమని ప్రార్థించెను. అప్పటికిని సన్యాసి యాతని మాటలను వినిపించుకొనలేదు. అప్పుడా యోధుఁడు విరక్తుఁడై సన్యాసి మూర్ఖుఁడుగా భావించి క్రోధాతిరేకంబున నాగృహము నలువంకలను బరీక్షించెను. సన్యాసియొద్దనున్న కమండలువు తక్క నాయింట నిఁక నెచ్చటను జలమున్నజాడ యగపడలేదు.

దాహముచే నోరెండిపోవుచున్నది. ప్రాణమే పోవుచున్నట్లుండెను. ఉదకదర్శనముచే నాతని దాహము వేయిరెట్లధిక మయ్యెను, ఆ యోధుఁడిఁక సహింపఁజాలక యా సన్యాసియొద్దనున్న జలపాత్రమును దీసికొని యా జలమును బానము సేయుట కుద్యుక్తుఁడయ్యెను.

ఆ మందిరమున సన్యాసికెదురుగఁ గపాలమాలికాలంకృతయుఁ బ్రస్తరవినిర్మితయు నగునొక దేవీమూర్తి విరాజిల్లుచుండెను. ఆకస్మికముగ నా దేవీమూర్తినుండి యావిర్భవించినదియుం బోలెఁ బరమరూపలావణ్యమయి యగునొక బాలికామూర్తి వెలుపలికి వచ్చి యొక్క నిమిషములో నా యోధుని హస్తమును బట్టుకొనియెను. అంతమాత్రమున నా యోధుఁడు భయపడలేదు—అతఁడు భయమను మాటకూడ నెఱుంగని యోధుఁడు. కాని, యా యువకుఁడు విస్మితుఁ డయ్యెను. నిమిషములో నా బాలికామూర్తి—ఆ దేవీమూర్తి—ఎచ్చటనుండి యెట్లు వచ్చి తన హస్తమును బట్టుకొనియెనో యాతనికి బోధపడలేదు. అతఁడా ప్రాంతమునందలి యుదకమును ద్రాగుచుండఁగా నా బాలికామూర్తి యాతనిఁ ద్రాగనీయకుండ నడ్డగించినది, మొదటనే వలదనినచో నాతఁడా జలపాత్రమును విడిచిపోయియే యుండును. కాని యాతఁడా జలమును గొంచెము ద్రాగిన పిమ్మటఁ దన దాహము పూర్ణముగ శాంతింపకుండ నెట్లు విడువఁగలఁడు?

నిశ్శబ్దముగ నా బాలిక యాతని జలపానమున కభ్యంతరము కల్పించుచుండుటం జూచి సన్యాసి యా బాలిక నచ్చటినుండి కదలి పొమ్మని సంజ్ఞచేసెను. సంజ్ఞామాత్రముననే బాలిక నిమిషములో నటనుండి యంతర్హితయై పోయెను, ఆమె యదృశ్యయైనంత మాత్రమున నా మందిర మంతయు గంభీరమాంధకారబంధురమై పోయెను. ఆ దేవీ

మూర్తికి సరిగ వెనుకభాగమునందొక చిన్న ద్వారముండెను. ఆ బాలికా మూర్తి యా ద్వారమునుండియే యావలికిఁ బోయి తలుపులను మూసివైచెను. ఆ యువకుఁడు తానుగూడ నా బాలికననుసరించి పోవలయునని తలంచెనుగాని సాహసింపఁజాలక పోయెను. ఇఁక నచ్చట నూరక నిలిచి యుండుట మంచిది కాదని యాలోచించుకొని యా యువకుఁ డచ్చట నుండి వెడలిపోవుట కుద్యుక్తుఁ డయ్యెను.

అంతలో సన్యాసి యేదియో సంజ్ఞ చేసెను. తానచ్చట నిలిచి యుండుటకు సన్యాసి యాజ్ఞాపించెనని భావించి యా యోధుఁ డచ్చటనే నిశ్చలభావముతో నిలిచియుండి పూజచేయుచున్న యా తపస్విని తదేక దృష్టితోఁ దిలకించుచుండెను.

## రెండవ ప్రకరణము

ఆయువకుఁడొక గడియ సేపటివరకు నా మందిరమున నట్లే నిలిచియుండెను. అయినను సన్యాసి పూజాపీఠమునుండి యింకను లేవలేదు. అతఁడింకను యెంత సేపు కను పెట్టుకొని యుండవలయును? ఈ విధముగా నింకను నచ్చటనే వేచి యున్నందువలన లాభమేమున్నది? రెండుజాములు తిరిగిపోయెను. ఇంకను నాలస్యముచేసినచో నీ విజనారణ్యమధ్యమునందే యీ రాత్రి గడపవలసివచ్చును. కాని యిదివఱ కాకస్మికముగఁ గన్నులఁబడి నిమిషములో మాయమైపోయిన యా బాలికామూర్తిని మరల నొకసారి చూడవలయునని యా యువకుని హృదయము వ్యాకులపడుచుండెను. సన్యాసి పూజనుండి లేచులోపలఁబోయి యాబాలికను జూచిరావలయునని యాతఁడు భావించుకొనియెను.

అతఁడా మందిరమునుండి వెలుపలికి వచ్చుట కుద్యుక్తుడయ్యెను. కాని యాతని పాదము లేకారణముననో గాని ముందటికిఁ జాఁగలేదు. యవయవము లేవియు నెందుచేతనో యాతని యాజ్ఞను బాలించుటకు సంపూర్ణముగ నంగీకరింపకుండెను. ఇంతలో వెలుపలనున్న యాతని గుఱ్ఱము తృష్ణార్తిచే వికలస్వరముతో సకిలింపఁదొడఁగెను. మందిరమునఁ బ్రవేశించినప్పటినుండియు నా యువకుఁడు తన గుఱ్ఱముమాటయే మరచి

యుండెను. ఇప్పటి యాహేషారవమువలన నాతని కా యశ్వముమాట జ్ఞప్తికి వచ్చెను. అప్పుడాతఁ డుచ్చస్వరముతో " ఈ సమీపమునం దెవ్వరైన నున్నచో దయయుంచి దాహపీడితంబగు నా యశ్వము కించుక జలప్రదానము చేయుఁడు " అని కేకవైచెను.

ఆ మందిరమధ్యమునం దాతని గంభీరస్వర మతిగంభీరముగఁ బ్రతిధ్వనిత మయ్యెను. ఆ ప్రతిశబ్దము నాలకించి యాతఁడు విస్మితుఁడై నలుతంకలఁ దిలకించెను. సన్యాసికూడఁ జకితుఁడై నేత్రోన్మీలనముం గావించెను. కన్నులుదెఱచిన సన్యాసింగాంచి యువకుఁ డాతనితో సంభాషించుట కుద్యుక్తుఁడయ్యెను. కాని సన్యాసి హస్తసంజ్ఞచే మాటాడ వలదని సూచించుచు " ఓయీ! నీవు ధర్మవిరుద్ధముగ నిప్పుడిట్టి యసమ సాహసకార్యముం గావించితివి. ఇందువలన నీకు విశేషముగ విపత్తు కలుగఁగలదు. ఏమైన నేమి? నీ వొకప్పుడీ విశాలరాజ్యమున కధిపతి వయ్యెదవు. కాని నీవు నీ ప్రాణరక్షణ విషయంబున జాగరూకుఁడవై యుండవలయును—ఇఁక నింటికిఁ బొమ్ము! ఈ రాజ్యము నీదియే యగును—ఇది జగన్మాత యనుజ్ఞ—ఇచ్ఛాలీల—" అనియెను. తరువాత నా సన్యాసి రెండుమూఁడు మాటలతో హస్తసంజ్ఞచేయుచు నా యువకుని మందిరమునుండి వెడలిపొమ్మని యాజ్ఞాపించెను. ఆ యువకుఁడు సన్యాసి నెన్నియో ప్రశ్నము లడుగవలయునని తలంచెను గాని యట్లు చేయఁజాలకపోయెను—ఎవ్వరో యాతని నా మందిరమునుండి త్రోసి వేయుచున్నట్లయ్యెను. అతఁడు మందిరమునుండి వెలుపలికి వచ్చెను. అప్పటికినిగూడ నాతని కర్ణములయందు " అనుజ్ఞ, ఇచ్ఛ, లీల " అను మాటలు మూఁడును బ్రతిధ్వనితము లగుచుండెను.

అతఁడిఁక నేమిచేయుటకుఁ దోఁపక సోపానములపై నిలిచియుండి యొక దీర్ఘనిశ్వాసమును విడిచి తన గుఱ్ఱమువంకఁ దిలకించెను. కాని, యదియేమి! అదిగో! ఆ పరమరూప లావణ్యమయియగు దేవీమూర్తి ఆజానులంబిత, నీలకుటిల కుంతల విరాజితయు, విశాలతరళ నయన యుగళయు. మనోహరగైరికవసన సుశోభితయు, శృంగార చిత్ర ప్రతిమయునగు నా బాలికామూర్తి యదియే! ప్రయత్నపూర్వకముగఁ

దన యశ్వమునకు జలప్రదానముం జేయుచున్న యా దివ్యమూర్తి నాతఁడు కనుఁగొనియెను. ఆమెను జూచినతోడనే యా యువకుని హృదయమున నానందోదయ మయ్యెను. అతఁ డామె నింకొకసారి చూడవలయునని యిదివరకే తలంచుకొని యుండెను. కాని యశ్రుత పూర్వంబులగు సన్యాసి వచనములవలన నాతని హృదయంబున మఱి యొక యభినవభావోదయమైనది. సన్యాసి నింకను బ్రశ్నింపవలయునను నుద్దేశము కలిగియున్నను నాతఁడు మఱిమాటాడఁ జాలకపోయెను. కాని యిప్పు డాతఁడా బాలికంజూచి యామె మూలమున విశేషములం దెలిసికొనవచ్చునని భావించుకొనియెను.

అప్పుడాతఁ డతిత్వరితముగ నా బాలికయొద్దకుఁ బోయి సమీప మున నిలువఁబడి "నీవెవ్వరు? ఈ సన్యాసి యెవ్వరు? మీ నివాస మెక్కడ? ఈ మందిరమునం దెంతకాలముండెదరు? మీవారింక నెవ్వ రును లేరా? మరల నీ సన్యాసిని సందర్శించుటకు సమయమెప్పుడు?" అని యీ విధముగా నాతఁ డొకదాని వెనుక నొకటిగ ననేకసంగతులం గూర్చి యాబాలిక నడిగెను. కాని యాబాలిక యాతని యొక్కప్రశ్న కైనఁ బ్రత్యుత్తర మీయలేదు. ఆమె యుదాసీనభావముతో నా యశ్వమునకు నీళ్లు పోయుచుండెను. జలప్రదానానంతరమున నామె తన జలపాత్రముం దీసికొని మందగమనముతోఁ దన యింటివైపునకు వెడలిపోయెను. అప్పు డాతని కామె నడ్డగించుటకుఁ దగిన సాహసము లేకపోయెను.

ఆ బాలిక యట్లే తన మందిరమునొద్దకుఁ బోయి యా యువకుని వంకఁ దిరిగిచూచి మెల్లమెల్లగఁ దన దక్షిణహస్తము నూఁచుచు నాతనిఁ దన దక్షిణాంగుళికి లక్ష్యముచేసి మిగుల మెల్లగ, మిగుల గంభీరముగ, మిగుల భయంకరమగు స్వరముతో "ఓ యువకుఁడా! జాగరూకుడవై యుండుము? ఎప్పటికైన నేనే నిన్నుఁజంపి తీరుదును! ఇదియే జగన్మాత యనుజ్ఞ—ఇచ్ఛ—లీల!" అనియెను.

ఆ యువకుఁ డున్మత్తునివలె నా బాలికవైపునకుఁ బరుగెత్తుకొని పోయెను. కాని కేవల మా మందిరప్రాచీర మాతని తలకుఁ దగులుట

మాత్రమైనది. ఒక్కనిమిషములో నా బాలిక మందిరమునఁ బ్రవేశించి గుభాలునఁ దలుపులను మూసివై చెను. ఇఁక నా యువకుఁడా బాలికను జూడఁజాలకపోయెను.

అప్పుడాతఁడు బలముగఁ దన చేతులతో నా తలుపులను గొట్ట నారంభించెను. కాని యెవ్వరు నాతని శబ్దములకుఁ బ్రతివచనము నీయ లేదు. ఆ యువకుఁ డప్పుడా ద్వారసోపానముల నవరోహించి క్రమముగ సన్న్యాసియుండు చోటికిఁ బోయెను. అప్పటికా ద్వారముకూడ మూయఁ బడియే యుండెను. అచ్చటఁగూడ నాతఁడు తలుపులపై గరాఘాతములఁ గావించి చూచెను. కాని యెవ్వరు నెట్టి ప్రత్యుత్తరము నీయలేదు. ఏదియో యొక యట్టహాసధ్వనిమాత్ర మాతని కర్ణకుహరములఁ బ్రతి ధ్వనిత మగుచుండెను. ఏ హృదయము భయమనుమాట నెఱుంగదో, యట్టి వీరపురుషుని పాషాణ హృదయమునఁ గూడ నాకస్మికముగ నిప్పుడేదో యొకవిధమగు భయము సహస్రమూర్తులం దాల్చి విజృం భింపఁ దొడంగెను. అతఁడు తడఁబడుచున్న యడుగులతోఁ, గొట్టుకొను చున్న గుండెలతో మెల్లగఁ దన యశ్వమునొద్దకుఁ బోయి నిమిషములో నా గుఱ్ఱము నధిరోహించి దారుణకశాఘాతముం గావించెను. ఆ దెబ్బతో నా యశ్వ మతిశీఘ్రముగ నా స్థానమును విడిచి యంతర్హిత మయ్యెను.

## మూఁడవ ప్రకరణము

విజయరాయలు నిడుఁబ్రోలు మండలమునకు సేనానాయకుఁడు. అతని వయసు ముప్పది యైదు వత్సరములకు మించియుండదు. అప్పటి కాతఁడు మహావీరుడని దక్షిణహిందూస్థానమునం దంతటను బేరుమోచి యుండెను. అతని బాహు బలము మూలముననే నిడుఁబ్రోలు రాజ్యనామము సుప్రసిద్ధమై పరజన భయంకరమై యుండెను. అతని గౌరవము దక్షిణహిందూదేశ మంతటను వ్యాపించి యుండెను.

ఆ కాలమున మన్నెరాజుల విద్రోహములు ప్రబలి యుండుటచే వారియున్నతుల నడఁగించి రాజ్యమునకు సుఖముం గూర్చుభారము మహారాజగు మాధవరాయనిపై నుండెను. మాధవరాయఁడు కడు

వృద్ధుఁడు. అంతియకాక యనేకకారణములచే నాతఁడు రోగశోకోప హతుఁడై యుండెను. నిడుఁద్రోలుమండల విఖ్యాతిని నిలుపుటకును, క్షత్రియోచితగౌరవమును బ్రకాశింపఁజేయుటకును నాతని కింక సామర్థ్యము లేక యుండెను. కాని యంతమాత్రమున నిడుఁద్రోలుమండల కీర్తిసౌరభము ప్రభావహీనము కాలేదు. రాజకుమారుఁ డగువిజయరాయలు సర్వసేనానాయకుఁ డగుటయే యందులకుఁ గారణము.

మహారాజకుమారుఁడగు విజయరాయలు నిడుఁద్రోలుమండలమునకు సర్వసేనానాయకుఁడు. అంతియకాని యువరాజు మాత్రముకాఁడు. అతఁడు తండ్రికి జ్యేష్ఠపుత్రుఁడు కాఁడు. అతని జ్యేష్ఠభ్రాతయగు దేవరాయలొక కుమారునింగని యకాలమున లోకాంతరగతుఁ డయ్యెను. ఆ కుమారుని పేరు రామరాయలు. అతఁడే యీ నిడుఁద్రోలు మండలమునకు యువరాజు. అతఁడే మహారాజగు మాధవరాయని యనంతరమున నొకప్పుడు మహారాజు కాఁగలఁడు. రామరాయని కిరువది రెండేండ్ల వయసుండెను. కాని యాతఁడు వీరపురుషుఁడు కాఁడు, అతఁ డాయుధవిద్యను బాగుగ నభ్యసించెను. సుక్షత్రియ పరాక్రమమును, తేజమును గూడ నాతని ప్రతిరక్తనాళమునందును వ్యాపించియున్నమాట నిజమే. కాని యాతనికి యుద్ధమనిన నంతగాఁ బ్రియములేదు.

రామరాయలు నిరంతరము నేకాకియైయుండుట కిష్టపడుచుండును. పుస్తకమును జదువుకొనుచున్నప్పు డాతఁడు సర్వకార్యములను మఱచిపోవుచుండును. అతఁ డెల్లప్పుడు నాలోచనా నిమగ్నుఁడై యుండును, ఎప్పుడును విషణ్ణహృదయుఁడై యుండును. కాని యాతని హృదయం మాత్రము మహోదారమైనది. దీనులదుఃఖములయం దాతని హృదయము వ్యాకులపడుచుండును. దుఃఖాత్ముల దుఃఖముల నివారించు విషయమున నాతఁ డెల్లప్పుడును బ్రయత్నించుచుండును. అతఁడు యువరాజే, కాని రాజభవనమునందలి వైభవాడంబరముల నాతఁడు ప్రేమించువాఁడు కాఁడు. అతనికి మనోహర యానాదులును, సర్వాంగ సుందరంబులగు నశ్వంబులును, సర్వాభరణ భూషితంబులగు భద్రగజంబులు ననేకము లున్నవి. అతని మనోరంజనముకొఱ కెన్నియో యమూల్య వేషభూష

ణము లున్నవి. కాని యాతఁడు వాని నెన్నఁడు నుపయోగించుటలేదు. సామాన్యునివలె నాతఁ డొంటరిగ నా నగరమునం దిరుగుచు నవసర మైనప్పుడు దీనుల దుఃఖముల నివారించుటకుఁ దగినకార్యములం జేయు చుండును.

కుమార రామరాయలు తన పినతండ్రియగు విజయరాయల నెంతయో గౌరవించుచుండెను. అంతియకాక విశేషముగఁ బ్రేమించు చుండెను. అతఁడు పినతండ్రిని జనకునివలెఁ జూచుకొనుచుండెను. విజయరాయలు కూడఁ దన యన్నకుమారుఁడగు రామరాయలను గన్న కుమారునికంటె నెక్కుడుగఁ బ్రేమించుచుండెను. అంతటి ప్రేమ యెచ్చటను లేదు. అంతటి వాత్సల్య మెచ్చటను లేదు. వృద్ధుఁడగు మాధవరాయనికిఁ జాలమంది బిడ్డలు పుట్టిరి. కాని వారందఱు నాతని సకాలముననే విడిచి లోకాంతరమున కేఁగిరి. కేవలము గనిష్ఠకుమారుఁ డగు విజయరాయలు మాత్రము జీవించియుండెను. కావున మహారాజగు మాధవరాయలు తన చిన్నకుమారుఁడగు విజయరాయని దన ప్రాణము కంటె నధికముగఁ బ్రేమించుచుండెనని విశేషముగ, జెప్పనక్కఱలేదు. మొత్తముమీఁదఁ దన కుమారుఁడగు విజయరాయనికి మనుమఁడగు రామరాయనికిని గల పరస్పర ప్రేమభావముం గాంచి యా మాధవ రాయలు తన వార్ధక్యమున సకలకష్టములను మఱచి సుఖియై యుండెను. ఆ కారణముచే రాజ్యప్రజలందరుగూడ వృద్ధమహారాజు ననంతరము నీ రాజ్యవైభవమున కించుకంతయు లాఘవము కలుగఁబోదని తలంచు కొనుచు నానందింపఁ దొడంగిరి.

విజయరాయనివంటి సదాశయసంపన్నుఁడగు మహాపురుషుఁడా రాజ్యమునందు మఱి యెవ్వఁడునులేఁడు. దురభిమాన మనునదియెట్టిదో యాతఁ డెన్నఁడు నెఱిఁగియుండలేదు. అతని హృదయమునం దెట్టి కోరికయును లేదు. అతని కేవిషయమునందు నెట్టియభావమును లేదు. యుద్ధమే యాతని జీవితమునందలి ప్రధానోద్దేశము. వీర్యశౌర్యములే యాతని మూలమంత్రములు. వీరుఁడనిపించు కొనుటయే యాతని జీవితమునకుఁ బరమావధి అపరాధులను శిక్షించుటయే కాని క్షమించుట

యాతని స్వభావము కాదు. ఎల్లప్పుడు నెల్లవారిని సంతుష్టులుగాఁ జేయుటయందే యాతఁడు సంతోషంతోఁ బ్రయత్నించు చుండును. సామాన్య సైనికుఁడు మొదలు సేనాపతివరకు నాతని దమ ప్రాణముల కంటె నెక్కుడుగఁ బ్రేమించుచుండిరి. అందుచే వారెల్లరు నిర్భయముగ నాతని కొరకుఁ దమ ప్రాణములనైన నర్పించుటకు సిద్ధముగా నుందురు. కావుననే విజయరాయ లజేయుఁడని ప్రఖ్యాతినొందుటకు సమర్థుఁ డయ్యెను.

మన్నె రాజులందరును దుర్వృత్తులై ప్రజోపద్రవములం గల్పించు చుండుటచే నట్టివిద్రోహుల దుండగముల నడఁగించు భారమును విజయ రాయలు సహింపవలసి వచ్చెను. విజయరాయ లెన్నఁడును దన విధా యక కృత్యములయందు వెనుకంజ వేయువాఁడు కాఁడు. తండ్రిచే ననుజ్ఞాతుఁడై యాతఁడు పదివేల సైన్యముతో నుత్తరారణ్య రాజన్య దుర్గములపై దాడివెడలెను. అతఁడట్లు మహాసంరంభముతోఁ బోయి యా వనదుర్గములనెల్ల సాధించి స్వాధీనము చేసికొనియెను. ఆ ప్రాంత ములయందెల్ల విజయరాయుని విజయకీర్తులు విఖ్యాతము లయ్యెను. అరణ్యకదస్యు పీడుతులగు ప్రజలెల్లరును నాతని దివ్యకీర్తి గానము చేయుచుండిరి. వనదుర్గముల యందలి మన్నెదొరల హృదయములయం దాతని వీరనామము భయంకరముగఁ బ్రతిధ్వనించుచుండెను.

విజయరాయునిదాడికి వెఱచి పారిపోయిన వనదుర్గనాయకులలోఁ గొంద అప్పుడప్పుడు మరల విజృంభించుచుండుటచేఁ బ్రచ్ఛన్నముగ నట్టివారిని బట్టి దండించుటకై యాతఁ డొంటరిగ నరణ్యములం బ్రవేశించి తిరుగుచుండును. అతని ననుసరించి సైనికులుగూడఁ బ్రచ్ఛన్నముగ వచ్చుచుందురు. ఇట్టి ప్రయత్నమునందే తిరుగుచు నాతఁ డానాఁడు భద్రారణ్యమునందలి మందిరప్రాంతమునకు వచ్చియుండెను. అప్పుడేమేమి జరిగెనో యంతయు మా పాఠకులకుఁ దెలిసియేయున్నది.

## నాల్గవ ప్రకరణము

అరణ్యమును దాఁటిపోవునంతవరకును విజయ రాయలు గుఱ్ఱమునుగొట్టి ప్రబలవేగమునఁ బరుగెత్తింపఁ దొడంగెను. అంతవరకుఁ దానేమి చేయుచుండెనో యేమేమి భావించుచుండెనో యెంతమాత్రము నాతనికిఁ దెలియుటలేదు. ఆ విశాలారణ్య మధ్యమునుండి పరుగెత్తి పోవుచున్న యాతని యశ్వపద శబ్దము దిగంతములఁ బ్రతిధ్వనించు చున్నకొలదిని, తీవ్రవేగమువలనం బొడమిన యెదురుగాలి యాతని తలను దిమ్మెత్తించుచున్న కొలది నాతఁడు మఱింత వేగముగ గుఱ్ఱమును బరుగెత్తింప నారంభించెను. అంతవఱకు నాతని హృదయమునం దెట్టి భావమును, మఱి యెట్టి కోరికయు నుదయింపలేదు. ఇప్పుడాతని కిష్టము లేకపోయినను నాతని హృదయమునందా యిచ్ఛయు, నా భావమును బ్రవేశించుటకు విశేష పరిశ్రమ నందెను. ఆతడా యశ్వము నతివేగముగ బరుగెత్తించుచు నా తీవ్రవేగ సాహాయ్యమున దన హృదయమునుండి యట్టి భయంకర భావములను దొలగించివైచుటకై విశేషముగ బ్రయాసపడుచుండెను. కాని యా ప్రయత్నము కొనసాగుట లేదు. అప్పుడాతడు హతాశుడై యశ్వగమనవేగమును శాంతింపజేసి తనలో నేమేమియో భావించుకొనుచు మెల్లమెల్లగా నుత్తరారణ్యాభిముఖుడై పోవుచుండెను.

"నేను రాజునగుదునా? ఇదియెట్లు తటస్థించును? నా ప్రాణమగు కుమారరాయ లకాలమునఁ గాలాధీనుడై పోవునా? ఏమో? ఎవ్వరు చెప్పగలుగుదురు? అతని కేమైన నాపత్తు కలుగగూడదా? అతడు మరణించునేమో యెవ్వరెఱుంగుదురు? ఈ ప్రపంచమున జీవితముకంటె నశాశ్వతమగు వస్తువు మఱియొకటి యేమున్నది?" ఇట్టి యాలోచనములతో నాతని హృదయము కొట్టుకొని పోవుచుండెను. ఆతడు సహజముగనే కుమారుని మిగుల బ్రేమించుచుండెను. కాని యప్పుడాతనికా దుఃఖసమయమున దెలియకుండగ నేదియో యానంద భావముకూడ నుత్పన్న మగుచుండెను. ఆతడు మహారాజగును— ఈ విశాల రాజ్యమునకంతకు నాతడే ప్రభువగును—ఇది సత్యమే యగునా? రాజగుటవలన

నేమి సుఖము ? మానవుడు రాజు కావలయునని యంతగ బ్రయాస పడుట యెందుకో ? అందువలన నాతని కెంతమాత్రమును సుఖములేదే? రాజ జీవనము సర్వదా చింతాకరమైనదనియు, దుఃఖావాసమైనదనియు ననుభవజ్ఞుల సిద్ధాంతమైయున్నది. ఇట్టిస్థితిలో విజయరాయని హృదయమున వట్టియానంద మెందుల కుదయించినది ? అయినను నాతని హృదయమునుండి విచారమెందులకు బోయినది కాదు ?

దుఃఖతరంగములును, సుఖతరంగములునుగూడ నాతని హృదయమును భేదించివైచు చుండెను. వీనితో గూడ భయ తరంగములును సమ్మిశ్రితము లగుచుండెను. కాని యిందేదిసత్యము ? అతడు నిజముగా జంపబడునా ? అతని కకాలమరణము తటస్థించునా ? ఇది జరగితీర వలసినదే యగునా? ముఖసందర్శన మాత్రముననే సకలజీవుల మోహింపజేయజాలు పరమ రూపలావణ్యవతి యగు నా దేవీమూర్తి, ఆ బాలికా మూర్తి—నిష్కారణముగ నాతని విశాలవక్షమున నిశిత చంద్రాయుధము బ్రయోగించునా ?

అట్లుకాదు. ఇది యంతయు నాతని మానసిక దౌర్బల్యము. ఆతనికి భయముకలిగించి మందిరమునుండి వెడలగొట్టుట కా సన్యాసి యిట్టి కృత్రిమ కల్పనమును గావించి యుండును. మానవజీవితమునందలి భవిష్యద్రంగమును దర్శింపజేయుటకు మనుష్య డెప్పటికైన సమర్థుడు కాజాలునా ? కపటాత్ములగువారు మూర్ఖులను మోసము చేయుటకై యిట్లే జ్యోతిర్విద్య యను నెపంబున భవిష్యత్ఫలంబులను సూచించు చుందురు. విజయరాయుడు బాలుడు కాడు, మూర్ఖుడును గాడు. అట్టివాడింతలో నింత యవ్యక్తుడై పోయినాడేమి ? ఇంత యేల ? రక్తప్రవాహినియగు రణక్షేత్రమునగూడ నొక్కనిమిషమైన నెవ్వని హృదయము చలింపకుండెనో, యెవ్వని ఖడ్గబలంబున సమస్త శత్రుమండలమును బ్రకంపితమై పోవుచుండెనో యట్టి ప్రతాపశాలియగు విజయరాయుని హృదయముకూడ నొక సామాన్య సన్యాసి వాక్యములవలనను, నంతకంటె నధిక మాయావినియగు నొక బాలిక పలుకుల వలనను నొక్కసారిగ నిప్పుడు ప్రచలితమై పోవుచున్నదేమి ? అయ్యో ! విజయరాయుడు నిమిషమున కిట్లధఃపతితుడై పోవుచున్నాడేమి ?

అతఁ డొక్కసారి బిగ్గరగ నవ్వెను. హృదయభావములను దూరీభూతములుగ జేయుటకై యట్లు నవ్వెను. తోడనే యాతడు తన యశ్వమును జబుకుతోఁగొట్టి యతివేగముగ బరుగెత్తించెను. ఎట్లో యొక విధముగ నానాభావ సమ్మిశ్రితంబగు తన హృదయవిచారమును బోఁగొట్టుటకు బ్రయత్నించెను. కాని యెంతమాత్రము నట్లు చేయజాలకపోయెను.

సంధ్యాకాలమునకు బూర్వమే యాతడు తన శిబిరమున బ్రవేశించెను. అతని యాకారముం గాంచి సైనికు లెల్లరును విస్మితులైరి. కాని యెవ్వరు నాతనింగూర్చి యా విషయమున బ్రశ్నించుటకు సాహసింపలేకపోయిరి. కాని యా రాత్రి సేనానాయకు లందఱు నచ్చటచ్చట గలిసికొని విజయరాయని మనోవికారముం గూర్చి యాలోచించుకొనిరి. ఆ రాత్రి విజయరాయ డెవ్వరితోడను మాటాడలేదు.

## అయిదవ ప్రకరణము

మఱునాటి యుదయమున లేచినతోడనే సైనికు లందఱకు విజయరాయలు విడుబ్రోలు దుర్గమునకు బ్రయాణము చేయుచున్నాడను సంగతి తెలియవచ్చెను. ఆత్మబంధుడును మంత్రికుమారుడును నగు విద్యాధరునకు సమస్త సైన్యము నొప్పగించి యాతడు రాజధానికి బోవనెంచెను. ఇంత తొందరగా విజయరాయుఁడు రాజధానికేల పోవలసివచ్చెనో యెవ్వరికిని దెలియుటలేదు. అందఱును విస్మితులగుచుండిరి. కాని యీ సంగతి విజయరాయని నడుగుట కొక్కరికిని సాహసము కలుగలేదు.

మఱునాఁడు సమస్తసైనికుల నొక్కచోఁజేర్చి విజయరాయలు " నేనొకవిశేషకారణముచే రాజధానికిఁ బోవుచున్నాను. నా ప్రియబంధువగు విద్యాధరుని నాస్థానమునందు నిలపి పోవుచున్నాను. నేను శీఘ్రముగనే మరలి వచ్చెదను. అంతవఱకును మీరందఱు నీనూతన సేనాధిపతిని నావలెనే భావించి గౌరవించుచుండవలయును. ఇదియే నా కోరిక. నేను పోయెదను. నా గౌరవమును, నా కీర్తిని, విడుబ్రోలు రాజ్య గౌరవమును మీ చేతులయం దుంచి పోవుచున్నాఁడను. ఇటు

చూడుఁడు ! నా గౌరవమును దక్కించి నిడుద్రోలు రాజ్యవైభవోన్నతులను శతగుణాధికములుగ వర్ధిల్లజేయుడు " అని యాజ్ఞాపించెను. సైనికు లామాటలకు ప్రత్యుత్తరముగ జయజయధ్వనులను జేసిరి.

ఒకశుభముహూర్తమున నాటిమధ్యాహ్నమే విజయరాయలు రాజధానికి ప్రయాణమయ్యెను. ఇంతయాకస్మికముగ నిట్లు చేయుట కేమికారణము ? విజయరాయ లిప్పుడే రాజగుటకు గుతూహలపడుచుండెనాయేమి ? లేదు. అట్లు త్వరపడుట లేదు. ఆకోరిక యాతని హృదయమునం దొకనిమిషమైన నిలిచియుండలేదు. అట్లయినచో గుమారుని క్షేమసమాచారముం దెలిసికొనుట కాతడు వ్యాకులపడుచుండెనాయేమి ? లేదు. అట్లును దలంచుటలేదు. అట్టియుద్దేశమే యున్నయెడల నొకదూతను బంపి యనాయాసముగ నా సమాచారమును దెలిసికొనవచ్చునుగదా ! ఇక నింతశీఘ్రముగ శిబిరమును విడిచి రాజధానికి బోవుటకు గారణ మేమైయుండును ? విజయరాయడు రాత్రి యొకనిమిషమైనను నిద్రింపజాలకపోయెను. ఒక్కనిమిషము మాత్రము కన్నుమూసెను. కాని యా నిమిషములోనే యాతఁ డొక భయంకర స్వప్నముం గాంచెను. ఆ బాలిక తన హృదయతలంబున వాడికత్తితో బొడిచినట్లును, విశాల వక్షోభాగమంతయు రక్తసిక్తమై పోయినట్లును, మర్మభేదనంబగు బాధచే దాను దారుణవ్యధ నందుచున్నట్లును, నా వనసుందరి రాక్షసీమూర్తిందాల్చి తన వక్షముపైఁ గూరుచుండి వెచ్చనిరక్తమును బానముచేయుచున్నట్లును నాతడు కలలో గనుగొనియెను,

అప్పుడాతనికి నిద్రాభంగ మయ్యెను, తోడనే యా భయంకర స్వప్నముకూడ నంతర్హిత మైపోయెను. కాని యాతదేవిధముచేనైన నా చింతాశల్యమును దన హృదయమునుండి తీసివేయజాలక పోయెను. భయమన నెఱుంగని యాతని హృదయమప్పుడు భయప్రకంపితమై పోవుచుండెను. అతడు జాగ్రదవస్థలో గూడ నన్నివైపులను రక్తమయ శరీరిణియగు నా దేవీమూర్తినే చూడదొడంగెను. ఇచ్చట నున్నచో సత్యముగ దనకా బాలికచేతులలో మరణింపవలసి వచ్చునను భయ

మాతని హృదయమును గళవళపెట్ట దొడంగెను. ఏది మొట్టమొదట గేవల సందేహముగను ననుమానముగను మాత్రము తోచియుండెనో యదియే యిప్పుడు సత్యముగను విధాయకమైనదిగను బరివర్తిత మయ్యెను ఘాతుకురాలగు బాలికచేతులలోఁ దనకు మరణము తటస్థించు నని యాతని హృదయమున దృఢవిశ్వాసము కలిగెను. యుద్ధమునం దెవ్వఁడు పరమానందముతో బ్రాణదానము చేయుటకు సిద్ధపడియుండునో యట్టివానికి ఘాతుకుల చేతులలో బశువువలె హింసింపబడుట తటస్థించి నప్పుడించుక మనుష్యము కలుగకమానదు. విజయరాయుడు సరిగ నట్లే యయ్యెను.

ఆతఁడు చచ్చుటకు సిద్ధపడియుండలేదు. ఇంకను నీ ప్రదేశము నందే యున్నదో నా నరఘాతినికి సమీపమునందే యున్నట్లగును. ఇంకను నెన్నిసారులిట్టి భయంకర స్వప్నములు వచ్చునో యెవ్వరెఱుంగుదురు? ఏదేనొక సమయమున నేదేనొక మిషచే నా దారుణబాలిక యెప్పుడువచ్చి తన హృదయ రక్తము పానముచేయునో యెవ్వరు చెప్పగలరు? ఈయాలోచనా పరంపరలచే నాతడు పరాభూతుడై పోయెను. ఇట్టి భయముచేతనే యాతడొకసారి యప్రతివిభుడై యేమిచేయుటకుం దోపక యా యరణ్యమధ్యమునందలి దేవీమందిరమును బరిత్యజించి పలాయితుఁ డయ్యెను. మరల నిప్పుడిట్టి భయముచేతనే యాతడు శిబిరమును వదలి పలాయితుఁ డగుచుండెను.

## ఆఱవ ప్రకరణము

విజయరాయలు రాజధానిని సమీపించి యాలోచించుకొనఁ జొచ్చెను—"నేను మహారాజు నొద్దకు బోయి యేమని చెప్పుదును? ఇంత యాకస్మికముగ శిబిరమును విడిచివచ్చినందుల కేమికారణమును జూపింతును! ఒక సామాన్య సన్యాసబాలికా భయంబున సేనలను విడిచి రాజధానికిఁ బాఱిపోయి వచ్చితి నని యేవిధముగనైన బయటపడినచో నప్పుడు నా కెంత తల వంపులుగ నుండును? ఎవ్వని భయముచే సమస్త శత్రుమండలమును బ్రకంపితమై పోవుచుండెనో యట్టి నేనొక బాలికకై భయపడుచుంటినా?

ఈ యవమానము ప్రచారితమగుటకు బూర్వమునందే నేను మరణించుట మేలుగనుండును" అని యాలోచించుకొనియెను.

రాజధాని సమీపమునకు వచ్చియు విజయరాయులు నగరమునఁ బ్రవేశించుటకు సాహసింపలేకపోయెను. అతడు మరల శిబిరమునొద్దకు బోవుటకు గుఱ్ఱమును మరలించెను. అతని పార్శ్వవర్తులాతని భావముం గాంచి విస్మయాక్రాంత హృదయులైరి. విజయరాయుని బుద్ధి చెదరి పోయినదని యందఱకును దెలిసిపోయెను. వారుకూడ నిశ్శబ్దముగఁ దమ గుఱ్ఱములను మరలించి సేనాపతివెనుకనే మెల్లగ నడపించుచుండిరి. కాని విజయరాయులు కొన్ని యడుగులుమాత్రముపోయి యతివేగముగ మరల నశ్వమును ద్రిప్పి చబుకుతో బలముగ గొట్టెను. మర్మయాతనచే నాతని యశ్వమతివేగముగ రాజధానివైపునకు బరుగెత్తుకొని పోయెను. పార్శ్వవర్తులు కొయ్యబొమ్మలవలె విజయరాయుని వెనువెంటనే బయలుదేరిరి.

విజయరాయు లొక్కసారిగ రాజప్రసాదమునం బ్రవేశించి మహారాజును దర్శించుటకై పోయెను. ఆకస్మికముగ నాతనిం గాంచి నగరివారందరు నాశ్చర్యమందిరి. అతని ముఖలక్షణములం గాంచి మఱియు నధికాశ్చర్య నిమగ్నహృదయులైపోయిరి. కాని యెవ్వరు నాతని మాటాడించుటకు సాహసింప లేకపోయిరి. విజయరాయులు తండ్రిని దర్శించి యాతని పాదధూళిని శిరంబునం దాల్చి "తండ్రీ! మీ యాశీర్వాద ప్రభావమువలన శత్రువుల నందఱను బాఱద్రోలి వచ్చితిని. ఇక నచ్చట మఱి యెట్టియావశ్య కార్యములును లేకుండుటచే నీ యానంద వృత్తాంతమును మహారాజునకు స్వయముగా నివేదించుటకై నేనే బయలుదేఱి వచ్చితిని. చాలదినములనుండి దేవర శ్రీపాదదర్శనము లభింపకుండుటచే నా హృదయము మిగుల వ్యాకులపడుచున్నది." అని విన్నపముం గావించెను.

మహారాజు పరమానందముతో విజయరాయుని నాలింగనము చేసికొని యాతని మస్తకమును మూర్కొనియెను. అనంతర మీ శుభ సమాచారము నగరమం దంతటను వాద్యోత్సవములతోఁ బ్రచురింప

జేయుట కాఙ్క్ష యొసంగెను. ఇంతమాత్రముచేతనే యా వృద్ధమహారాజు సంతుష్టుడై యూరకుండలేదు. అప్పుడే యొకపెద్ద సభచేయుటకు నిశ్చయించెను. పూజ్యులును, మాన్యులునగు సభ్యులు సభకు వచ్చు నంతవరకును మహారాజు కుమారునివలన యుద్ధ సమాచారములను వినుచుండెను.

రెండుగంటలు దాటకుండగనే పెద్దసభ కూడెను. ఆ సభామధ్యమున సర్వజనసమక్షమునందును, మహారాజగు మాధవరాయలు తన పుత్రుడగు విజయరాయుని రాజబిరుదముచే నలంకృతినిం గావించెను. సైనికులు జయజయధ్వనులం గావించిరి. దుర్గమునందు విజయభేరులు మ్రోగింపబడియెను. ప్రతిముఖద్వారముునను వాద్యోత్సవములు గావింపబడియెను. నగరమంతయు నానందోత్సవములతో నిండిపోయెను.

అప్పుడు సభామధ్యమున యువరాజగు కుమారరాయలు నిలువబడి పినతండ్రియగు విజయరాయల నుద్దేశించి "మీ వలన నీ వీర క్షత్రియ వంశము గౌరవాన్వితమైనది. అందులకుఁ బ్రతిఫలముగఁ బూజ్యుఁడగు పితామహుఁడు రాజబిరుదముచే మిమ్ముల నలంకరించి యున్నాడు. క్షత్రియవీరులును, సైనికులును మీ విజయమును గొని యాడి మీయొద్దఁ దమ కృతజ్ఞతను వెల్లడించుకొని యున్నారు. ప్రజలందఱు నానందోత్సవములతో నగరమంతయు నలంకరించి మిమ్ము సన్మానించుచున్నారు. ఇప్పటి నా హృదయములోని యానందమును నేనేమూలముగా దెలియజేయ గలుగుదును? నాకుఁగల సర్వస్వమును నేనిప్పుడు మీకు సమర్పించుచున్నాడను. ఇది మొదలుగ మీరే యీ విద్యున్నగరి రాజ్యమునకు యువరాజులును భావి మహారాజులును. ఏమనిన—మీరే యీ రాజ్యసింహాసనము నధిరోహించుట కర్హులై యున్నారు" అనియెను.

సభవారందఱును లేచి నిలువబడి "యువరాజునకు జయమగు గాక!" అని కీర్తింప నారంభించిరి. వృద్ధమహారాజానందభాష్పముల నాపుకొనఁజాలకపోయెను. రామరాయుని యౌదార్యముచే విజయరాయని హృదయ మానందరసప్రవాహమున దేలిపోయెను. అతడు సాదరంబుగ

సస్నేహముగఁ కుమారు నాలింగనము చేసికొని "వత్సా! నిజముగ నీవే మహారాజ వగుటకుఁ దగిన గుణనిధివి. ఇట్టి యుదారహృదయునకు, నిట్టి మధురస్వభావునకు దాసానుదాసుఁడనై యీ జీవయాత్రనిర్వహణము చేయఁగలిగినచో నేను ధన్యుఁడ నగుదును" అనియెను.

మహానందముతో నానాఁటి రాజసభ ముగిసింది. యువరాజగు రామరాయనిం గూర్చియు, సర్వసేనాపతియగు విజయరాయనిం గూర్చియుఁ గావింపబడుచున్న జయజయ ధ్వనులచే నగరమంతయు నాందోళితమయ్యెను; గగనభాగము విదీర్ణము కాఁజొచ్చెను. ఆ యానందోత్సవమునందు విజయరాయలు తనయుత్తరారణ్య వృత్తాంతము, భద్రారణ్య మధ్యస్థంబగు దేవీమందిరవృత్తాంతము, సన్యాసివృత్తాంతము, బాలికావృత్తాంతము నంతయు నొక్కసారిగ మరఁచిపోయెను.

మనుష్యహృదయమువంటి రహస్యస్థాన మీ ప్రపంచమునం దేదియును లేదు. మనస్సునం దెప్పు డెట్టిభావ ముదయించునో, కొన్ని సామాన్యకారణములచే మనస్సునం దెప్పు డెట్టియభూతపూర్వ పరివర్తనము కలుగునో యా సంగతి పరీక్షించి యెవ్వరు చెప్పఁగలుగుదురు? విజయరాయ లెట్టి యభూతపూర్వహృదయ పరివర్తనముచే రాజధానికి మరలివచ్చెనో, యా మూలకారణము నాతని మనఃప్రపంచమునఁ గలిగిన యీ యానందపరివర్తనముచే నిమిషములో మఱచిపోయెను.

## ఏడవ ప్రకరణము

రాజసభారంగమున మహారాజు కొలువుదీర్చి యున్న కాలమునకు సరిగ రాజప్రసాదమునకు వెనుకనున్న మందిరోద్యాన మధ్యమునందలి యొక విలాసమందిరమునం దిరువురు రమణీమణులు కూర్చుండి యాడుకొనుచుండిరి. వారి సమీపమునకు పార్శ్వములందును మఱికొందఱు సుందరులు నివసించియుండిరి. ఆ యిరువురు రమణులలో నొక యువతి వయ సిరువదియైదు వత్సరములు; రెండవకాంతకుఁ బదియాఱేండ్ల ప్రాయము. ఇరువురు నతిలోకసుందరులే. ఎట్టి సౌందర్యముండినఁ బరమరూపవతు లగుదురో యట్టి

సౌందర్యము వారిరువురకును గలిగియుండెను. కాని యా యిరువురి యందమునకును విశేషభేద మున్నది.

అందొక యువతిపేరు మురళ. రెండవయామె పేరు సరళ. మురళ సర్వసైన్యాధిపతియగు విజయరాయని పత్ని. సరళ యువరాజగు కుమారరామరాయల యర్ధాంగలక్ష్మి. విడుగ్రోలు రాజ్యమునకు భావి మహారాజ్ఞి. మురళ ప్రధానమంత్రి తనయ. సరళ మంత్రికుమారుఁడగు విద్యాధరుని కుమార్తె. మహారాజు తన మంత్రిని సంతోషపెట్టుటకై యాతనియింటి యాడుబిడ్డల నిరువురను దనయింటి కోడండ్రుగాఁ జేసికొనియెను. వృద్ధరాజు మిగుల దూరాలోచనము కలవాఁడు.

మురళ యందమునందు దీక్షభావమున్నది. ఆమెవంకఁ జూచినచోఁ గన్నులు మిఱుమిట్లు గొనును—హృదయము చెదరిపోవును—ప్రాణము చలించిపోవును. ఆమె నయనములు చంచలములు; పలుకులు భావ గర్వితములు; గమనములు కడునమందములు. ఆమెను జూచినచో భయమగును; మనఃప్రాణములు సురాపానము చేసినవియుంబోలె నవశములై పోవును.

కాని సరళరూప మట్టిదికాదు కోమలత్వమునందలి పరిపూర్ణ వికాస మీ రూపమునందున్నది. ఆమెవంకఁ జూచినచో హృదయమునం దొకవిధమగు పవిత్రభావ ముదయించును; ఆమె స్వర్గమునుండి యవత రించిన దివ్యమూర్తి యేమోయని తోఁచును ఆమెను జూచినచో భక్తి భావ ముదయించును; దేవతంబోలెఁ బూజింపవలయునను కోరిక కలుగును ఆమె కన్నులయందు దయయు. ముగ్ధభావమును, సరళతయు నెట్లు ప్రకాశించుచుండెనో యామె వదనమందలంతట నట్లే లజ్జ వినయము మాధుర్యము మొదలగు సద్భావములు సర్వదా విరాజిల్లుచుండును.

ఆ యుభయులు నొకయింటి యాఁడుబిడ్డలు; మేనత్తయు మేన గోడలును—ఉభయులు బరస్పరము ప్రేమించుకొనుచుండిరి. అందు సరళ తన మేనత్తయగు మురళను దన ప్రాణముంబోలెఁ బ్రేమించు చుండెను. మురళయును సరళను మిగులఁ బ్రేమించుచుండెడిది. కాని యా సరళను రామరాయలు పెండ్లియాడినది మొదలుగ నామెపై మురళ

ప్రేమభావము పూర్వమువలెలేదు. ఇప్పటి కాభావము క్రమముగ నామెపైఁ గోపముగా మాఱినది. సరళ హృదయ యగు సరళ మురళ విషయమున నెట్టి యపరాధమును జేసియుండలేదు. మీఁదు మిక్కిలి యామె మురళసన్నిధి నతి వినయభావముతో సంచరించుచు ననేకోపాయములచే నామెకు సంతోషముంగూర్చు కార్యములనే చేయుచుండెను. అందువలన మురళ తన కోపస్వభావమును గోపనము చేసికొనుచుండెను. ఇంతమాత్రమే కాని యామె సరళను శాంతభావముతోఁ దిలకించుటలేదు. యువరాజును బెండ్లియాడుట యొక్కటియే సరళ యపరాధము. ఇంకను నామె యపరాధ మేమనిన:—ఆమె సిద్ధపోలు రాజ్యమునకు భావిమహారాజ్ఞి కాఁగలుగుటయే. ఆమాట తలంచుకొని మురళ యప్పుడప్పు డున్మత్తప్రాయ యగుచుండెను. ఆమె తన మనసునందు "విషపానము చేసియైన సుఖముగ మరణింతునుగాని దీనిని మహారాజ్ఞి యని పిలువఁజాలను, దీనిసన్నిధిని జేతులుజోడించుకొని నిలువఁజాలను" అని యనుకొనుచుండును.

సరళస్వభావయు వినయవతియు భీతహృదయమునగు సరళను మురళ తనకంటె నికృష్టురాలుగాఁ దలంచి మనసునం దీసడించుకొనుచుండెను. "ఇదియా రాణియగుటకుఁ దగినది? ఒక దెబ్బకొట్టిన మొత్తోయని యేడ్చు నీయల్పజీవి మహారాజ్ఞి యగుటకు కర్హురాలుకాదు. పరమేశ్వరుఁడు నాకే మహారాజ్ఞి యగుటకుఁ దగిన గుణములను బ్రసాదించి యున్నాఁడు. నేనే రాణి నయ్యెదను" అని యామె భావించుకొనుచుండును.

## ఎనిమిదవ ప్రకరణము

ఉద్యానవనమునందలి పొదరింటిలోఁ గూర్చుండియున్న యా యిరువురు యువతులలోనను బ్రప్రథమమున సభారంగమునందలి సైనికుల జయజయ ధ్వనులు మురళకుఁ గర్ణగోచరములయ్యెను. సరళ యెప్పుడు నేపని చేయుచుండునో యా పనియందే నిమగ్నహృదయయై యుండును; బాలికవలె నాపనియందే తదేకధ్యానముతో బాహ్యజ్ఞాన శూన్యయై

యుండును. గర్వమతి యగు మురళ మాత్ర మట్లుగా నుండఁజాలదు. సర్వదా యామె చెవులు రిక్కించుకొని బాహ్యప్రపంచమునందలి సామాన్యశబ్దమును నైతము గ్రహించుటకుఁ బ్రయత్నించుచుండును. ఆమె యొక కార్యమును జేయుచుండియు సహస్రకార్యములపై మనః ప్రాణములను బ్రసరింపఁజేయుచుండును. అందుచేతనే ముందుగ నాసైనికుల జయధ్వను లామె కర్ణకుహరములఁ బ్రవేశించెను.

అప్పుడామె యాటలు మానివైచి "ఇట్టి సమయమున వెలుపల నా కలకలధ్వను లేమి?" అని యనుకొనుచుఁ జెంతనున్న యొక చెలికత్తెం జూచి "వకుళా! అవ్వల నా కలకలమేమి? సైనికుల జయధ్వనులవలె బోధయగుచున్నది—కేవల మంతియేకాదు. నలుదెసలఁ దూర్యధ్వనులుకూడ వినఁబడుచున్నవి. వినుచుంటివా?" అనియెను. వకుళ సగౌరవముగ "దేవీ! నేను వెలుపలకుఁబోయి యదియేమో తెలిసికొనివత్తునా!" అనియెను. అప్పుడు సరళ చిఱునవ్వుతోఁ దెలిసికొనుట కేమున్నది? చిన్నమామగా రేదియో యొక యుద్ధమున విజయముం గావించియుందురు. ఆ సమాచారమే వచ్చియుండును. అందుచే మహారాజిట్టి యానందోత్సవములను గావించుచున్నాఁడు. రమ్మా వకుళా! కమలా రమ్మా! రావే విమలా! మన మందరమును బోయి యా యుత్సవముం దర్శించి యానందింతము రండు!" అనియెను.

ఆనందముచే మురళ వదనమండలమున సుఖచంద్రికలు ప్రకాశించుచుండెను. కాని యామె తన హృదయభావమును మఱుఁగు పఱచి "ఆయన యెన్నిగొప్ప యుద్ధములను జయింపలేదు! అప్పుడింతటి సమారోహ మేమియును లేదే?" అనియెను సరళ నవ్వెను—ఆనవ్వునం దెట్టి మర్మమును లేదు; ఎట్టి యహంకారమును లేదు; ఎట్టి యభిమానమును లేదు; ఎట్టి యంతర్భావమును లేదు—కేవలసారళ్యమును మాధుర్యమును మాత్రమే. అట్టి నవ్వు నవ్వుటకు సరళహృదయయగు సరళకే తెలియును. అట్టి మధురహాసము చేయుచు సరళ "అత్తా! ఇప్పుడు బోధపడినది. చిన్నమామగారు మన్నెరాజుల నందఱను జయించి స్వయముగనే వచ్చియుందురు. ఇది నిశ్చయము లెమ్మా! మన మందఱమును బోయి దర్శింతము" అనియెను.

మురళ "సరళ కంతమాత్రమునసే యానందము! నేనెట్లు భావించుటలేదు. వకుళా! నీవు పోయి రాజసభలో నేమి జరుగుచున్నదో చూచిరమ్ము!" అనియెను వకుళ వెడలిపోయెను. క్రమముగా నాటలు ముగింపబడియెను మురళ యాలోచనానిమగ్నయై యాఁడుసింగమువలె నాస్థలమునందిటునిటుఁ దిరుగుచుండెను. సరళ యిరువురు ముగ్గురు సఖులతోఁ బూవులఁగోయుటకుఁ బోవుచు "అత్తా! మామగారు లోపలికి వచ్చినతోడనే యుక్కడనుండి యాయన యుత్తమాంగమునఁ బుష్పాంజలి విడువవలయును" అనియెను. కొంచెము సేపటిలో వకుళవచ్చి "విజయరాయలు వచ్చియుండెను. అతని విజయమునకు సంతసించి మహారాజాతనికి రాజబిరుదు నొసంగి యుండెను. యువరాజగు కుమారరాయలు సభాంగణమునఁ దన పినతండ్రికిఁ దన యువరాజపదమును సమర్పించి యున్నాఁడు. కాని విజయరాయలు కుమారు నాలింగనము చేసికొని నీవే భావిమహారాజుగా నుండఁదగినవాఁడవని యాశీర్వదించెను. ఇప్పుడే వారిరువురును గలసి యంతఃపురమునకు వచ్చుచున్నారు" అని చెప్పెను.

ఆ మాటలనువిని సరళ "అత్తా! వింటివా? నేను చెప్పినమాట సత్యమేగదా! చిన్నమామగారు వచ్చుచున్నారు. రమ్ము వకుళా! మనము పూవులను గోయుదము" అనియెను. సఖులందఱును మురళను రాణీ యని పిలుచుచుఁ దమతమ యానందములను బ్రకటించుచుండిరి. అప్పుడు సరళయుఁ దనహృదయానందమును బట్టఁజాలకపోయెను. ఆమె యెట్లు తన యానందమును సూచింపవలయునో నిశ్చయింపఁజాలక మురళ నలంకరించుచు "రావే వకుళా! కమలా! రమ్ము! మాయత్త యిప్పుడు మహారాజ్ఞియైనది రండు! ఈమె నిప్పుడు రాణివలె నలంకరింతము" అనియెను.

ఆనందము విశ్వవ్యాప్తమై యుండెను. నలువంకల నానందరసతరంగము లుద్వేలితములగుచుండ నెవ్వరు నిరానందులై యుండఁగలుగుదురు? కాని యిప్పుడు మురళహృదయమున మాత్ర మానందోదయము కాలేదు. అందఱి యానంద ప్రవాహములయందును నామె

నిరానందభావము తేలిపోవుచుండెను. అప్పుడామె తనలో "ఏమైననేమి? ఆయన మహారాజగుఁగాక! నేనెట్లు మహారాజ్ఞి నగుదును? నేను రాణిని గాఁజాలను? రాణివంటిదాననైతిని" అని మాటిమాటికిఁ దలపోయఁ దొడంగెను. తుదకా మురళహృదయమున నట్టి విచారభావము బలవంతముగఁ బ్రచలితమగుచుండెను. ఇఁక నామె యాభావమును మఱుఁగుపఱుపఁజాలకపోయెను. ఇంకను నచ్చటనే యున్నచోఁ దనహృదయము వెల్లడి యగునను నుద్దేశముతో నామె యతి వేగముగ నాస్థలమును విడిచి పోవఁదొడగెను. ఆమెం జూచి సఖులందఱు నొకరిమొగమొకరు చూచుకొన నారంభించిరి. అప్పుడు సరళ "అత్తా! ఇదేమి? రమ్మురమ్ము! మన మందఱమును జిన్నమామగారిని బహూకరించి వత్తము రమ్ము" అనియెను.

అందఱు నా యుద్యానమునుండి బయలుదేఱి రాజభవనము వైపునకుఁ బోవుచుండిరి. అందఱు నానందరసమున నోలలాడుదమని వేడుకపడుచుండిరి. సరళ ప్రయత్నము లన్నియు విఫలము లయ్యెను. మురళప్రవర్తనమువలన వారిహృదయము లన్నియును జెదరిపోయినవి. వారియెదుట నింక నొక నిమిషమైనను నానందము నిలువఁజాలకపోయెను. సరళ యెంతప్రయత్నించినను మరల వారికట్టి యుత్సాహమును గల్పింపఁ జాలకపోయెను. తుదకు వారి యానందహృదయములయందు విషాదచ్ఛాయ లావరించుకొనియెను—సరళమనసు కూడఁ జెదరిపోయినది.

వెలుపట నంతట నానందోత్సవములు—లోపల నట్టి వేవియును లేవు. ఇతరజనులందఱు నానందము నుపభోగించుచున్నారు. స్వజనులకు మాత్ర మట్టి భోగభాగ్యములేదు. తలఁచుకొన్నది యొకటి—జరిగినది మఱియొకటి! విజయరాయలును గుమారరాయలును గూడ నంతఃపురమునకు వచ్చిరి. వారిని సన్మానించుటకుఁ దగిన యుపకరణము లన్నియును సమకూర్పఁబడియే యున్నవి. కాని వానిలో జీవకళలేదు—ఉత్సాహకళ లేదు—ఆనందకళ లేదు.

# తొమ్మిదవ ప్రకరణము

అలంకరింపఁబడిన శయనమందిరమున దుగ్ధఫేననిభం బగు పర్యంకముపై మురళ చింతానిమగ్నమానసయై పరుండి యుండెను. ఆమె హృదయమునం దిప్పు డిచ్ఛకంతయును కొఱఁతలేదు భర్త యిప్పుడు రాజయ్యెను; ఇప్పుడామె రాణియైనది. సిడుద్రోలు రాజ్యమునందలి ప్రతిగృహమునందు నామె భర్తనామము ప్రతిధ్వనించుచుండెను. ఇంతటి యానందదినము మఱియొకటి యుండునా? కాని యామెకు సుఖములేదు. ఆమె హృదయమున మాత్ర మానందములేదు. సమీపమున నెవరో యడుగులచప్పుడు వినవచ్చెను. స్వామి వచ్చియుండెనని భావించి మురళ యతిశీఘ్రముగ లేచి కూర్చుండెను. ఇట్టి యానంద దినమున స్వామిసమ్ముఖమునఁ దాను విషణ్ణభావముతో నుండుట సిగ్గుచేటని భావించి యతికష్టముచే నామె తన హృదయమునం దానందమును బ్రవేశపెట్టుటకుఁ బ్రయత్నించెను. ఆమె తన విచారావృత వదనమండలమున హాసచంద్రికల నుద్దీపింపఁజేయుట కెంతయో శ్రమపడియెను. ఎల్లరు నెంతయో యానందమున మగ్నులై యున్నారు. ఆమెయు నట్లే యానందనిమగ్న హృదయయై యుండుటకు వేడుకపడియెను కాని యామె ప్రయత్నములన్నియు విఫలములై పోయెను. హృదయభావముఁ దాఁగియుండుట యెట్లు?

విజయరాయ లామె వదనమును దిలకించి యులికిపడియెను. అతఁ డా ముఖమునం దేమిచూచెనో కాని యా చూపు మూలముననే యాతని హృదయమునం దేదియో భావముదయించి మంచు గ్రమ్మినట్లయిపోయెను. కాని యాభావ మొక్క నిమిషమాత్రమే యుండెను. ఉత్తరక్షణముననే మరల నాతఁడు మురళవదనమును దిలకించెను. అప్పటి కది హాసవిలసితమై యుండెను—ఆనందోద్దీపితమై యుండెను. అచ్చట దుఃఖచిహ్నమైనను లేకుండఁబోయెను.

చాలదినములకైన సమ్మేళనము! ఆమె తన భర్తను ప్రాణములకంటె నధికముగఁ బ్రేమించుచుండెను. చిరకాలమునకు స్వామిదర్శన

మగుటచే నామె తన హృదయమునే మఱచిపోయెను. ఎదుటనున్న నాధునిం జూచుటతోడనే యప్పుడామె హృదయమునఁ బ్రేమప్రవాహము కూలంకషముగఁ బొంగిపొరల నారంభించెను. ఆ ప్రవాహమునందు హృదయమునందలి యితరభావము లన్నియును నిమిషములోఁ గొట్టుకొని పోయెను. అప్పుడు మురళి సుఖసంభాషణమువలన దుఃఖభావముల నన్నిటిని మఱచిపోయెను

విజయరాయలు తన విజయయాత్రలలోఁ దానేమి కార్యములం గావించినదియు వరుసగాఁ దన ప్రియురాలగు మురళికిఁ జెప్ప నారంభించెను; కాని భద్రారణ్యదేవీ మందిరవృత్తాంతము వఱకుఁ జెప్పి యాకస్మికముగ సంభాషణము నాఁపివైచెను. అనేక కారణములచే నాతఁ డా వృత్తాంతమును బ్రకటించుట కిష్టములేనివాఁడయ్యెను. ఇంతియకాదు. ఆతఁ డా వృత్తాంతమును మఱచిపోయియే యుండెను. తన ప్రయాణ సందర్భముం గూర్చి చెప్పుటకుఁ బ్రారంభింపకయే యుండిన యెడల నాతని కావృత్తాంతము జ్ఞప్తికి రాకపోయియే యుండును. ఇప్పు డాకస్మికముగ నా సంగతి స్మృతికి వచ్చుటచే నాతని హృదయమున నేదియో ప్రబలాఘాత మైనట్లయ్యెను. ఆతఁ డామాటను దాఁచి మఱియొక విషయముం గూర్చి మాటాడసాగెను. కాని కుశాగ్రబుద్ధియగు మురళను మఱపించుట మాత్రము సామాన్యమైన పనికాదు. విజయరాయలు మాటాడుచు మాటాడుచు నా ప్రసంగము నాఁపివైచెను. మురళి యా సంగతి నంతలోనే గ్రహించి " మీరు నా కంతయును జెప్పుటలేదు. ఏల చెప్పరు? నేను మీ సహధర్మిణిని గానా?" అనియెను.

విజయరాయ లిఁక నుపాయాంతరముం గానక " అంతయు నీకుఁ జెప్పియే యుంటిని " అనియెను.

ముర—లేదు. అంతయుఁ జెప్పలేదు. మీరు చెప్పఁదలఁచుకొన నప్పుడు నేనేమి చేయుదును? నేను మీ పాదదాసినిగాదా?

విజ—ఒక సంగతి మాత్రము నీతోఁ జెప్పలేదు. కాని యామాట నీవు విన్నచో నవ్వుదువు.

ముర—నవ్వుట యెందులకు? మీకిష్టములేనిచోఁ జెప్పవలదు.

విజయరాయ లింక మాఱుమాట చెప్పఁజాలక దేవీమందిర వృత్తాంత మంతయు మురళ కెఱింగించెను. మురళ నిశ్చలముగ నంతయును వినియెను; ఏమియును మాటాడలేదు! విజయరాయని మాటలు ముగిసినతరువాతఁగూడ నామె యేమియును మాటాడలేదు. అతఁడు కొంతసేపటివఱకు నామె ముఖమువంకఁ జూచుచు పిమ్మట "నీ వింకను నవ్వవేమి?" అనియెను. అప్పుడు మురళ "నవ్వు వచ్చినప్పుడు నవ్వెదను?" అనియెను.

## పదియవ ప్రకరణము

సరళయును దనస్వామి వక్షోభాగమున నర్ధశాయినియై యుండి భర్తృముఖ మండలమును విశాల నయనములతోఁ దదేకదృష్టిం జూచుచు నాతనివలన రాజసభావృత్తాంతముల నాలకించుచుండెను. ఆమెకోరిక యా సంగతులను దెలిసికొనవలయునని కాదు. రాజ్యముపోయి దరిద్రుఁడై వచ్చి రామరాయలు తన వృత్తాంతమును జెప్పుచున్నను సరళహృదయయగు సరళ యాతని మొగముం గాంచుచు నాతని యమృతమయంబులగు పలుకుల నానందముతోడనే యాలకించుచుండును. ఆమె సభావృత్తాంతములను వినుటలేదు. భర్తృముఖోద్గితంబులగు మధురవచనములవలనఁ గర్ణానందముఁ గావించుకొనుచుండెను. ఆమె రామరాయలం జూచినతోడనే తాన్నుఁదాను మఱచిపోవును ఆమె కేవల మాతని వదనమండలమును సందర్శించి హృదయమునం దవ్యక్తమహదానందము ననుభవించుచుండెను.

రామరాయలు తన యువరాజపదమును బరిత్యజించిన వృత్తాంతముం జెప్పుచు "సరళా! నిజముగా నాకు రాజుగానుండవలయు నను కోరికలేదు. పినతండ్రి యందుల కంగీకరించినచో నేను కృతార్థుఁడ నగుదును. విజనస్థలంబునకుఁ బోయి నీవును నేనును బరమానందముతో నివసించి సుఖజీవనము చేయఁగలుగుదుము" అనియెను. సరళ సంతోషముతో "మంచిది అట్లే యగుఁగాక! దానికేమి?" అనియెను.

రామ—సరళా! మనుజునికోరిక లన్నియు ఫలించునా? మనకుఁ గోరిక యున్నదిగాని యది మనలను విడుచుట యెట్లు? నేనుగదా? యీ విద్యానగరసామ్రాజ్యమున కుత్తరాధికారిని!

సర—అవును. మీరు మహారాజు లయ్యెదరు. మీకు మహారాజు కావలయునను కోరికలేదా?

రామ—నేను మహారాజు నైనచో నీవు మహారాజ్ఞివి కావా?

ఇట్లు చెప్పి రామరాయలు సాదరంబుగను సప్రేమంబుగను సరళ ముఖమండలమును దిలకించెను. సరళ లేచి "ఒకమాట చెప్పెదను, నవ్వరుగద!" అనియెను.

రామరాయలు నవ్వుచు "నవ్వుట యెందులకు?" అనియెను.

సర—అయినచో వినుఁడు—నేను మహారాజ్ఞిని గాఁజాలను.

రామ—అది యేమి?

సర—నేను కలఁగంటిని—ఆమాట చెప్పిన మీరు నవ్వెదరు. ఈ సంగతి నేను మీ కిదివరకే చెప్పియుంటిని.

రామ—నవ్వను—సరళా! ఇఁక నవ్వను! ఏమికల గంటివో చెప్పుము.

సర—నవ్వరుగద?

రామ—నవ్వను.

సర—నా యొడలు జల్లుమనుచున్నది!

రామ—నిజంబిమ్ముగ్ధ నెన్నఁడును చూచియుండలేదు. ఇంత సందేహమేల? నవ్వను; నవ్వను; ముమ్మాటికి నవ్వను. చెప్పుము

సర—ఇఁకఁ జెప్పెదను. నాకు తఱచుగఁ గలలు వచ్చుచుండును-కలలో నావంటి యువతియొకతె నాకగపడి నా చేయి పట్టుకొని నన్నాదరించుచు "సరళా! నీవు మహారాజ్ఞివి కాఁజాలవు. నేనే రాణి నయ్యెదను" అని చెప్పినది.

రామరాయలకు నవ్వెట్లువచ్చును? అతఁడు భయపడియెనో విస్మితుఁడయ్యెనో యీ విషయముంగూర్చి స్థిరముగఁ జెప్పఁజాలము అతఁడు కొంతసేపటివఱకు నిరుత్తరుఁడై యుండి "ఆ యువతి యెవ్వరు? నీ వెప్పుడైన నామెను జూచితివా?" అనియెను.

సర—లేదు. ఆమె యీదేశ స్త్రీ కాదు.

రామ—ఆ సంగతి నీకెట్లు తెలిసినది?

సర—ఆమె దుస్తులు మనదేశ స్త్రీల దుస్తులవంటివి కావు.

రామరాయ లాలోచనానిమగ్నుఁ డయ్యెను; అంతలోనే మరలఁ దెలివి తెచ్చుకొని యిట్లాలోచించుచున్నచో సరళ భయపడునని భావించుకొని "సరళా! స్వప్నవృత్తాంతము లెన్నఁడైన సత్యములగునా? నీవు నా యాదరపాత్రురాలవు; ప్రాణప్రియవు; అర్ధాంగలక్ష్మివి. సరళా! నీవే యీ విద్యుద్రోలు రాజ్యమునకు మహారాజ్ఞి వయ్యెదవు" అనియెను. సరళ మెల్లగఁ దలయూఁచెను; ఏమియు మాటాడలేదు. కొంతసేపటి కిరువురును నిద్రించిరి.

విశేషానందముతో విజయరాయలు తనపత్నిని జూడఁబోయెను. అంతకంటెను బరమానందముతో రామరాయలు సరళ నాదరింపవలయునని కుతూహలపడియెను—కాని యెట్లో యెచ్చటినుండియో వచ్చి యీ యిరువురి యానందములమీఁదను విషాదచ్ఛాయ ఆలముకొనియెను.

## పదునెకండవ ప్రకరణము

విద్యుద్రోలు మండలమునకుఁ గేవల ముత్తర భాగమున మహారణ్యము కలదు. అందుఁ గ్రూరులగు కోయలు నివసించుచుండిరి. కొన్ని పల్లెల కొక నాయకుఁడుండి యా యరణ్యకులను శాసించుచుండును. అట్టి నాయకుని దైవముగ జూచుకొనుచుఁ గోయలందఱు నాతని వశవర్తులగుచుండిరి. ఆ నాయకులకుఁ గొండలే దుర్గములు. ఆ యరణ్యరాజ్య మంతయుఁ జాలయేండ్లవఱకు నట్టినాయకులచేతనే పరిపాలింపఁ బడుచుండెను. ఆ నాయకులలోఁ గూడఁ బరస్పర కలహములు తటస్థించినప్పుడు బలవంతులగువారు బలహీనులను నిగ్రహించి కొన్ని పల్లెలను దమరాజ్యమునందుఁ గలుపుకొనుచుండిరి.

ఆ కోయజాతికి భక్తివిశ్వాసములే ప్రధానములు. క్రూరులగుటచే నొక గుంపువారు రెండవగుంపువారిని జేరనియ్యరు. కొంత కాలమునకు శూరసేనుఁడను నొకరాజు తన బుద్ధిబలంబునను బాహుబలంబునను గూడ

నా కోయనాయకుల నందఱను గైవసము చేసికొని క్రమముగ వారలకును
నా వనరాజ్యమున కంతకును నధీశ్వరుండయ్యెను. అంతకుఁ బూర్వ
మా యరణ్యరాజ్యమునందలి కొంతభాగము విడుబ్రోలు రాజ్యమునకు
లోఁబడియుండెడిది. శూరసేనుఁడు ప్రభువైనప్పటినుండియు నా భాగము
మరల నరణ్యరాజ్యమునకే చేరిపోయెను. ఆ రాజ్యమునకు రాజధాని
గిరిదుర్గము. గిరిదుర్గమునకును విడుబ్రోలు రాజ్యమునకును బైవిధముగఁ
బరస్పర వైరకారణ మేర్పడియెను. శాంతిప్రియుఁడగు మాధవరాయలు
రాజ్యలోభముచే శూరసేనునిపైఁ గత్తికట్టి మహారణ్యమంతయు
రణక్షేత్రముగఁ జేసి గౌతమీపుణ్యజలంబుల రక్తస్రోత కలుషితములుగఁ
జేయుట కిష్టపడలేదు. అంతియకాక యాతని జీవితమునఁ జాలభాగము
కష్టములతోనే నిండియుండుటచే యుద్ధములు చేయుట కాతనికిఁ దీరికయే
లేకపోయెను.

అసహాయ శూరుండును, మహా రణప్రియుండునగు విజయ
రాయలు తన యిరువది రెండవయేఁటనే పూర్వవైరమును బురస్క-
రించుకొని మహాసంరంభముతో గిరిదుర్గముపై దాడివెడలి శూరసేనునితో
నిరువది దినములు యుద్ధముచేసి తుదకా శూరసేనుని సమిత్రబాంధవ్య
ముగ నాశనము చేసివైచెను; ఆ మహావిజయానంతరముననే మాధవ
రాయలు పరమానందంతోఁ దన కుమారుని సర్వసేనానాయక పదంబున
కభిషిక్తునిం గావించెను.

విజయరాయలు గిరిదుర్గమును జయించెనేగాని యరణ్యరాజ్య
మాతని కిప్పటికిని స్వాధీనము కాలేదు. తమరాజునే దైవముగఁ జూచు
కొనుచుండు స్వామిభక్తిపరాయణులగు నా కోయ లిప్పటికి నప్పుడప్పుడు
గుంపులు గుంపులై విడుబ్రోలు మండలముపైఁబడి దోఁచికొని
పోవుచుండిరి. విజయరాయలు గిరిదుర్గమును జయించిన తరువాత
మరలఁ బూర్వరీతినే వనదుర్గములు బయలుదేరెను. ఆత్మరాజ్యమున
కధికసంతాపకరంబు లగునట్టి వనదుర్గములను రూపుమాపుటయందే
యాతఁడు నిమగ్నుఁడై సమయము వచ్చినప్పుడెల్ల వాని నొక్క-
టొక్కటిగ నాశనము గావించుచుండెను. కాని యీ గభీరవిశాలారణ్య
మధ్యమునం దెచ్చట నేమి జరుగుచున్నదో యెవ్వరికిఁ దెలియును ?

# పండ్రెండవ ప్రకరణము

ఎంతటి ప్రపంచక జ్ఞానహీనులకైనను, నెంతటి మూఢులకైనను, భారతవర్షమున జన్మించినంత మాత్రమున దేవుఁడనియు, దేవతయనియు, గురువనియు, ప్రభువనియు భక్తివిశ్వాసములుండుట సహజము. తమకు సర్వస్వరూపుఁడగు కూరసేనుఁడు గతించిన తరువాత నా యారణ్యకులు చూడఁజుట్టమును, మొ్రక్కుదైవమును లేక యష్టకష్టముల పాలైపోయిరి.

అప్పుడు వారంవఱును దమ్ము పాలించు ప్రభువునుగోరి కనఁబడిన శాఖకన్నిటికిని గైమోడ్పు లర్పించిరి; చెంతనున్న చెట్లకన్నిటికిని జేతులెత్తి మ్రొక్కిరి; నదుల మునింగిరి; నగములఁ బూజించిరి; కులదేవతలఁ గొలిచిరి; కోలఁ బరిభ్రమించిరి. పరమేశ్వరుఁడు వారలఁ గరుణించి యొక ప్రభువును బ్రసాదించెను.

అయ్యారణ్యకుల ప్రభు వొక బాలకుఁడు. ఆ బాలకుని వయసు పదియాతేండ్లకు మించియుండదు. అయినను నాతఁడే సమస్తారణ్యములకును బ్రభువయ్యెను; వృద్ధులు, బాలకులు, ప్రబలులు, దుర్బలులు వేయేల! కోయలందరును నాతని యధికారము నంగీకరించిరి. ఆ మహారణ్యమున గిరిగహ్వరములయందును, దరుషండములయందును, నదీతరంగములయందును, దోఁటలయందును, బాటలయందును, బల్లెలయందును, బ్రాంతములయందును నెల్లయెడల బాలరాజగు 'వనరాజు' పవిత్రనామము ప్రతిధ్వనితమగుచుండెను. ఆతనియాజ్ఞ వేదవాక్యముగఁ బ్రతిపాలింపఁ బడుచుండెను.

పూర్వమువలె నిప్పు డంతఃకలహములు లేవు. కోయనాయకులతో నెప్పుడైన నించుక పరస్పరాభిప్రాయభేదములు కలిగినప్పుడు వనరాజునకు విన్నవించుకొని యాతని యానతి ననుసరించి ప్రవర్తించుచుండిరి. ఆ జాతి యెట్టిదియో యందులకుఁ దగిన రాజు కూడ లభియించెను; వనరాజు రాజకుమారుఁడు గాఁడు ఆతఁడు నాయకునివలెగాని, ప్రభువువలెఁగాని ప్రవర్తించుటలేదు. అతనికి రాజభవనము లేదు; దుర్గములేదు; మంత్రిలేఁడు; సభ్యులులేరు; అంగరక్షకులులేరు; సైనికులులేరు;

గుఱ్ఱములు ఏనుగులు మొదలగు వాహనాడంబరము లేవియులేవు. సమస్తారణ్య రాజ్యపాలకుఁడగు నా వనరాజున కేమియునులేవు. అరణ్యకులే యాతనికి సర్వస్వమునై యుండిరి.

చంచల హృదయులును, సరళస్వభావులును, సాహసికులును, భ్రమణశీలురును, విలాసప్రియులును, నవనాగరవైభవాడంబరులునగు కోయలకు సరిగ నట్టి ప్రభువే లభియించెను. వనరాజు సర్వదా సర్వ ప్రదేశములను సంచరించుచుండును. ఆతఁ డెచ్చటనున్న నదియే రాజధాని: అక్కడి నాయకులే మంత్రులు; అచ్చటి ప్రజలే సైనికులు; కాని యాతఁడు నిరంతరము నారణ్యకులతోఁ గలసి యుండుటలేదు. ఒక్కొక్కప్పు డాతఁ డెవ్వరికి నగపడకుండ నంతర్ధానుఁడగుచుండును. ఆతని స్థిరనివాసమేమో యెవ్వరికిని దెలియదు. ఆతఁ డెప్పు డెచ్చటనుండునో యెవ్వరికిని దెలియదు. కాని యా యరణ్యకుల కావశ్యకమైనప్పుడు వారు వెదకుకొనకుండఁగనే యాతఁ డచ్చటవారికి సాక్షాత్కరించుచుండను

వనరాజు కోయలవలె నల్లనివాఁడుకాఁడు; అట్టి మోటుఁదనము కలవాఁడునుగాఁడు. కాని యాతనిఁ జూచినచో విశేషనాగరకత నందిన జాతులలోఁ గూడ నట్టివాఁడు జన్మించి యుండఁడని బోధయగుచుండును. ఆతని సర్వాంగములును మాంసలములు, బలిష్ఠములు, సుందరములునై యుండెను. చిన్నతనము నుండియు వ్యాయామాదులవలన నాతఁడు తన శరీరమును బలిష్ఠముగఁ జేసికొనియున్నట్లాతని రూపమునుబట్టి బోధయగుచుండును. ఆతఁడు పదియాఱేండ్ల బాలుఁడనుమాట నిజమే. కాని యా యుద్ధవిద్యా వ్యాపారమునం దాతనితో సమానులగు వీరులెవ్వరును లేరు. ఆతని యుద్ధవిద్యానైపుణ్యముం దిలకించినచో నా విషయమునం దాతఁడు విశేష శిక్షాలాభమును బొందియున్నట్లగపడును. ఆతని సాహస మసమానమైనది; శౌర్యవీర్యము లనుపమానములైనవి ఇంతియకాదు. ఆతఁడు జగన్మోహనమూర్తి!

ఆతని వదనసౌందర్యమున ననిర్వచనీయ మగు లావణ్యము కలదు. ఆ మోహనమూర్తి నెంత సేపు తిలకించినను దనివితీరదు. ఆతని జూచినతోడనే నేత్రముల కమృతస్నానము చేసినట్లగును. ఆతని

ప్రేమింపకుండ నెవ్వరు నుండఁజాలరు. అంతటి శృంగారమూర్తి నెవ్వరు నెచ్చటను జూచియుండలేను. ఆతని వేషము సుందరమైనదియే ఆతఁ డాజానులంబితంబగు తననీల కేశదామమును జేర్చి నడుదలపై సిగవైచుకొని దానిపై మణిమయంబగు సువర్ణవలయము నలంకరించుకొని యుండును. ఆవలయమధ్య భాగమునఁ గూర్పఁబడిన ప్రదీప్త వజ్రమణిఖండమునను సొగసుగ సువర్ణతాటంకమును నిర్చబడ సుందరమయూర పింఛ మింద్రధనుఃకాంతులను బ్రసరింపఁజేయుచుండును.

ఆతని పరిధానము పీతాంబరము—ఆతని వెనుకభాగమున సుందరంబగు కృష్ణాజినము వేలాడుచుండును దానిపై ధనుస్తూణీరములు విరాజిల్లుచుండును ఆ పార్శ్వమున నతిమనోహరంబుగ నొక చిన్నవీణ విలసిల్లుచుండును. పార్శ్వమున వ్రేలాడుచున్న నిశితకృపాణమును గటిపటంబునఁ గూర్పఁబడిన శాణితచ్ఛురికయు నాచెంతనే నిలుపఁబడిన మోహనమురళియు నాతని యందమునకు వింతచందముం గూర్చుచుండును. ఆతఁ డెల్లప్పుడును స్ఫటిక రుద్రాక్షమాలికాలంకృతుఁడై యుండును. ఆతని ఫాలతల మొకప్పుడు సింధూరతిలక విలసితమై యుండును; మఱియొకప్పుడు రక్తచందనచర్చితమై యుండును. ఆతఁ డొకప్పుడును వాహనముల నుపయోగించుటలేదు. పాదచారియై తిరుగుచుండును అట్లయ్యును దలంచిన మాత్రముననే యెల్లయెడల నాతని దర్శనము లభించుచుండెను. అందువలననే గోపగోపికాబృందము గోపాలబాలకృష్ణునింబోలెఁ గోయదొరలు నా బాలకృష్ణుని—ఆ వీరబాలుని—ఆ వనరాజును పరమేశ్వరునిగ భావించి సేవించుచుండిరి.

## పదునాలవ ప్రకరణము

వనరా జెవ్వఁడు? పరమహంసపరివ్రాజక శ్రీ శాంతానంద పూజ్యపాదుల ప్రియశిష్యుఁడు.

అట్లే కాకున్నచో నొక సామాన్య బాలకుఁడు సమస్తారణ్యరాజ్యమునకును ప్రభువగుటకు సమర్థుఁ డెట్లగును? శాంతానందుఁడు పోయినచోటికెల్ల నాతని వెంటనే యా బాలకుఁ డాతని పూజాద్రవ్యమును మోసికొనుచుఁ

బోవుచుండును. వనరాజు తన యైదేండ్ల ప్రాయమునుండియు శారదా నందుని శ్రీపాదములను సేవించుచు నాతని ప్రియశిష్యుఁడై యుండెను. స్వామి యతి ప్రయత్నముతో నతివాత్సల్యముతో నాతని కెల్లవిద్యలను బ్రసాదించెను.

వనరాజు వీణావాదనమునం దద్వితీయుఁడు; ఆతని వీణావాదన నైపుణ్య మవర్ణనీయమైనది. ఆతని మధురమోహనగానముచేఁ గఠిన పర్వతములుకూడఁ గరఁగిపోవుచుండును. విశేషపరిశ్రమ చేయించి శారదానందస్వామి తన ప్రియశిష్యుని సంగీతవిద్యాపారంగతుని గావించెను. ఆతని ప్రేమామృతగానములకు—వీణామధురగానమునకు—మురళీమోహనగానమునకు——వనసత్వములుఁగూడ వశీకృతములై పోవు చున్నప్పుడు కోయలాతని భక్తితోఁ గొలుచుచుండిరని చెప్పుటలో వింతయేమున్నది ?

ఇంతియెకాదు. స్వామి యా బాలుని శరీరబలప్రవర్ధనకరంబులగు వ్యాయామములయందును, వివిధాయుధప్రయోగోప సంహారముల యందును, సమస్తసమర ధర్మములయందును సద్వితీయుని గావించెను. ఆయుధశిక్షాసందర్భమున నాచార్యుఁడగు ద్రోణుఁడు కూడ నర్జునుని కింతటివాత్సల్యముతో విద్యనేర్పియుండలేదు. ఇంతయేల ? శారదానంద స్వామి యాతనికి రాజరాజేశ్వరుఁడగుటకుఁ దగిన విద్యాశిక్షణముం గావించెను. రాజలక్షణలక్షితంబగు నాతని యాకారముంగాంచి శారదానందస్వామి యాతని నెట్లయిన మహారాజుం జేయవలయునని తలంచుకొనియెను. ధర్మసంరక్షణార్థముగఁ బరమేశ్వరుఁడుకూడ నిట్లే సంకల్పించుచుండును.

శారదానందుఁడు నిరంతరవనవాస సంచారియగుటచే నాతనికిఁ గోయలందఱును బరిచితులైయుండిరి. శాంతమూర్తియుఁ బ్రేమార్ద్రి హృదయుఁడును, దపోనిధియు, భూతదయాపరుండును, మధురప్రియ భాషియునగు నా స్వామిని గోయలందరును గురువుగను ప్రత్యక్ష దైవముగను భావించుచుండిరి. నిరంతరము నా స్వామిననుసరించియే తిరుగుచు సకలజనయనానందకరుండై యలరారుచున్న యా బాలకునిం గూడ నెల్లరును బరమాదరముతోఁ బ్రేమింప నారంభించిరి.

అట్టి మనోహర రూపమును నట్టి మధురస్వభావమును నట్టి సుందర విలాసమును నట్టి పవిత్రచరిత్రమును గల బాలుని వారిదివఱ కెన్నఁడును జూచియుండలేదు. కావుననే వారందఱు నాతని బ్రేమింపఁదొడంగిరి. మఱియు నాతని మోహనసంగీతమును, విజ్ఞానమును, బుద్ధిసూక్ష్మతయు బలపరాక్రమములును, సాహసమును, యుద్ధనైపుణ్యమును గూడఁ గ్రమక్రమముగ వారల హృదయములయందలి ప్రేమభావమును వర్ధిల్లఁ జేయుచుండెను. తుదకాప్రేమయే యా బాలునకుఁ బదియాఱేండ్లు నిండియు నిండకముందే యీ మహారణ్య రాజ్యమున కాతఁడు ప్రభువగుటకుఁ గారణమయ్యెను. భగవత్స్వరూపుఁడగు శారదానందస్వామి కోయల ప్రార్థనము నంగీకరించి యా బాలుని వారికి రాజుగాఁ బ్రసాదించెను.

గురుదేవుఁడగు శారదానందస్వామి యీ విధముగఁ గోయల ననుగ్రహించి పిమ్మట నా యరణ్య రాజ్యమునుండి యంతర్హితుఁడై పోయెను. ఇప్పుడు వనబాలుఁడు వనరాజయ్యెను. అంతటినుండి వనరాజునకు స్వామిసేవాభాగ్యము దూరమయ్యెను. అతఁ డిప్పు డొంటరిగ నరణ్యరాజ్యమున బరిభ్రమించుచుండెను. అతఁ డెప్పుడైన నొక్కచోఁ గోయలనందఱను సమావేశము చేయఁదలచినప్పుడు మురళీ గానము చేయుచుండును. ఆ మధురగానము నాలకించినతోడనే యా యరణ్యరాజ్యమునందీమూలనుండి యామూల కెల్లతావులకును వంశీ ధ్వనుల మూలమున సమాచారము లందిపోవుచుండును. ఇట్టి వంశీధ్వను లందినతోడనే యెల్ల పల్లెలయందలి కోయలును రణవేషాలంకృతులై బాణబాణాసన ధారులై శీఘ్రముగఁ బ్రభుసన్నిధానమునకు వచ్చి చేరుచుందురు. ఏదైన విశేషకార్యములేనిచో వనరాజు తమ్మూరక యాహ్వానము చేయఁడని వారెల్లరును బాగుగ నెఱుంగుదురు. అతఁడు రాజైన పిమ్మట సమస్తారణ్యకుల నొక్కచో సమావేశము గావించిన దిప్పటి కొక్కసారిమాత్రమే.

## పదునాలుగవ ప్రకరణము

భద్రారణ్యమునం దొకచిన్న దేవీమందిర మున్నది. ప్రప్రథమమునఁ జూచినవారి కదియొక సామాన్యమందిరముగా నగపడును. కాని యది యారణ్యక జనులకందఱకును ప్రధానతీర్థస్థానమును ప్రధానదేవతామందిరమునై యున్నది. ఆ యారణ్యకు లప్పుడప్పుడీ మందిరమునకువచ్చి దేవీపూజాదికములం గావించి పోవుచుందురు. కోయలందఱు నావశ్యకమైనప్పు డొక్కచోఁ గలసికొనుస్థానముగూడ నీ మందిరమే. మహారణ్యమునందలి కోయలందఱును వనరాజు వేణువును బూరించినప్పుడీ మందిరము నొద్దకే గుంపులు గుంపులుగఁ జేరుకొనుచుందురు. ఇప్పటికి వారందఱు నొక్కసారిమాత్రమే యీ మందిరమునఁ గలిసికొనియుండిరి. ఈ మందిరమునం దెప్పుడు నెవ్వరును నివసించియుండరు. దేవీపూజార్థ మచ్చట నర్చకులెవ్వరునులేరు. దేవీపూజ ప్రతిదినము జరుగుటయును లేదు. కోయలపూజల కర్చకులతో నిమిత్తములేదు. కోయ లప్పుడప్పుడు తమ శక్త్యానుసారముగఁ కోళ్ళు గొఱ్ఱెలు మేకలు నెనుబోతులు మొదలగు వానిని దీసికొనివచ్చి దేవికి బలిప్రదానముం గావించి మ్రొక్కులఁ జెల్లించుకొని పోవుచుందురు; సురాపానము కావించి యానంద సామ్రాజ్యమున కధీశ్వరులై తల్లియగు నా దేవీమూర్తికి నలువంకల నానంద తాండవములఁ జేయుచుందురు. ఆ నృత్యములతోఁబాటు సంగీతములను వాద్యధ్వనులునుగూడ దెసలఁ బ్రకంపితములుగఁ జేయుచుండును. రాత్రివేళయందు వారు కోలలఁ బ్రజ్వలింపఁజేసి వినోదక్రీడలఁ గావించుచుందురు. కోయలువచ్చి యా దేవీమందిరమునఁ బూజలఁ గావించుచున్నప్పుడు వారి యానంద ధ్వనులచే నయ్యరణ్యమంతయు మాఱుమ్రోగుచుండును.

ఆ మందిరమునం దొక్కరును లేకుండుట యెన్నఁడునులేదు. ఆ మందిరమునం దప్పుడప్పు డొక యున్మాదిని యగపడుచుండును. ఆమె రూప మతిలోక సామాన్యమైనది. ఉన్మాదగ్రస్తంబగు నా యమ రూపము జలదమాలికా వృతంబగు చంద్రరేఖఁబోలె శోభాయమాన

మగుచుండును. తైలవిరహితంబులగు నామె దీర్ఘకుంతలములు విడివడి యాజానులంబితములై వెన్నునను వక్షమునను జీరాడుచుండును. ఆమె యతి మలినంబగు జీర్ణవసనమును ధరించియుండును. పూసలపేరులు, పగడాలదండలు, స్ఫటికమాలికలు, రుద్రాక్షతావళములు, పుష్పహారములు మొదలగు నానావిధమాలికల లామె కంఠసీమ నలంకరింపఁబడియుండును. కుండపెంకులకోవలును జింతగింజలచేరులను గూడ నామె ధరియించును. ఆమె నిరంతరము కపోలభాగమునం దంతట నద్దముగఁ గుంకుమబొట్టు పెట్టుకొనుచుండును ఇఁక నామె కెట్టి యలంకారములును లేవు. కాని యా యున్మాదిని యనేకములగు నరణ్యవస్తువులను దన కలంకారములుగ నవరించుకొనుచుండును. సాధారణముగఁ బిచ్చివాండ్రం జూచినచోఁ జాల భయమగుచుండును. కాని యామెం జూచినప్పుడు భయము కలుగ కుండుటయేకాక మరలఁ మరలజూడవలయుననియే వేడుక యగుచుండును ఆమెతో మాటాడవలయుననియే కోరిక కలుగుచుండును. ఇంతియకాక యా యున్మాదినియం దింకొక విశేషమున్నది. ఆమె గానము చేయు చుండును. అంతటి మధుర సంగీతమును సచరాచరంబగు నీ ప్రపంచ మునం దెవ్వరు నెన్నఁడును వినియుండలేదు. ఆమె సంగీతజ్ఞానము సహజమైనది; సర్వజ్ఞానము స్వభావసుందరమైనది; మాధుర్యమును స్వతంత్రతా విలాసితమైనదియే, ఆ యున్మాదిని కేవలము గీతములఁ బాడుచుండును. అవియు స్వభావమధురములైనవియే—అట్టి మనోహర గీతములిఁక నెచ్చటనులేవు. ఆ గీతములయం దామెహృదయమే లీనమై పోవునో యామె హృదయమునందా గీతములే లీనములై పోవునో యెవ్వరికిని బోధపడుటలేదు. ఆమె సంగీతముచేఁ బాషాణహృదయములు గూడఁ బ్రేమతరంగ ఖేలితములై పోవుచుండును. ఆ గానామృత శ్రవణములచే హరిణీహరిణములును, మయూరీమయూరములు కూడ నానందనృత్యములు చేయుచుండును. క్రూరసత్వములుకూడ సాధు జంతువులై పోవుచుండును.

ఆరణ్యకు లా మందిరమునకుఁ బూజార్థము వచ్చినప్పుడెల్ల ముందుగ నా శ్యామలను వెదుకుచుందురు. శ్యామల లేకున్నచో వారి పూజలు సరిగా సాగవు. శ్యామల పాటలు వినఁబడకున్నచో వారి

యానందము సంపూర్ణము కాఁజాలదు. యెల్లప్పుడను వారి కామె దర్శనము లభింపదు. ఆ యున్మాదిని యొక్కొక్కప్పు డా మందిరమునం దుండదు. ఎక్కడకుఁ బోవునో యెవ్వరికిని దెలియదు. చాలమంది కోయ లొక్కచోఁ జేరినప్పుడు తఱచుగ శ్యామల యంతర్హితయై పోవు చుండును. ఆమెకు శ్యామల పేరెవ్వరు పెట్టిరో తెలియదు. కాని యెవ్వరైన నామెను బేరడిగినచో నా యున్మాదిని నవ్వుచు నవ్వుచుఁ దల యూఁచును; నృత్యము చేయును; జీర్ణవసనాంచలముచే మొగము గప్పుకొని కిలకిల నవ్వుచు—మరల నవ్వుచు నవ్వుచుఁ గరతాళములు వైచుచు "నా పేరు—శ్యామల—శ్యామల సుందరిని—సామగాయనిని—సోమపాయిని—ప్రేమమోహిని" అని నవ్వుచు నవ్వుచు నాడుచుఁ బాడుచు నంతర్హితయై పోవుచుండును.

## పదునైదవ ప్రకరణము

విజయరాయలు విడిచివచ్చిన తరువాత మహారణ్యమునందలి పర్వతపంక్తులలోఁ గొన్ని దినములనుండి వేణుధ్వనులు వినఁబడుచున్నవి. కొండలనుండి కొండలకును, పల్లెలనుండి పల్లెలకును, గ్రామములనుండి గ్రామములకు నా వంశీధ్వనులు పరివ్యాప్తము లగుచుండెను. క్రమముగ నా ధ్వను లచ్చటినుండి నిన్నటి యుదయమునఁ జాల దూరమువఱకు వ్యాపించినవి. మహారణ్యములోని పల్లెలయందంతటను వంశీధ్వనులు నిండిపోయెను. సమస్త పర్వతపంక్తులను, సర్వాంగ భాగములయందును నభినవ చైతన్యోదయ మయ్యెను. ఆహార విహారముల నుజ్జగించి కోయలందరును రణవేషాలంకృతు లగుచుండిరి. గుంపులు గుంపులై వారందఱును మందిరాభిముఖులై వచ్చుచుండిరి. వకరునొకరు పిలుచుకొనుచు వనరాజదర్శనమునకుఁ దొందరపడుచుండిరి. చెల్లె లన్ననలంకరించుచుండెను; భార్య భర్త నలంకరించుచుండెను. తనయ తండ్రి నలంకరించుచుండె. ఆకోయ లందఱు నలంకృతులై యెక్కడకుఁ బోవుదురు?

గుంపులు గుంపులుగ వారందఱును దేవీమందిరమునొద్దకువచ్చి విడియుచుండిరి. అందఱును వనరాజ దర్శనమున కువ్విళ్ళూరుచుండిరి. ఉదయమునకు జనశూన్యమైయున్న యామందిర మిప్పుడు వేలకొలఁది కోయల గమనాగమనములచే సంకులమైయుండెను. ఇప్పు డచ్చట నలుదెసలఁ గోలాహలముగ నుండెను-ఎచ్చటఁ జూచిన హాస్య ధ్వనులే-ఎచ్చటఁ జూచిన నామోదధ్వనులే—ఎచ్చటఁ జూచిన విజయధ్వనులే.

కాని వనరా జింతవఱకును వచ్చియుండలేదు. కొన్ని దినముల నుండి యాతనిజాడ యగపడుటలేదు—ఎప్పటినుండి కోయరాజ్యమున వేణుధ్వను లారంభములయ్యెనో యప్పటినుండియు నాతఁ డెవ్వరికి నగపడుటలేదు. కేవల మాతని మురళీగానమున్మాత్రమే వినఁబడు చుండెను. ఇప్పు డా వేణువు నొకమూల విడిచి వనరా జెచ్చట నంతర్హితుఁడై యున్నాఁడు ?-అన్ని పల్లెలయందును బర్యటనముచేసి యాతని మురళి యాతని హస్తము నలంకరించువఱకు నాతఁడెవ్వరికి నగపడఁడు!

ఇదివఱకుఁ జాలమంది యరణ్యకులం జూచినప్పుడు శ్యామల పాఱిపోవుచుండెడిది. కాని నేఁడుమాత్ర మట్లు చేయలేదు. ఒక్కచోఁ జేరియున్న కోయల నందఱ నొకసారి చూడవలయునని యామెకుఁ గోరిక పుట్టినదికాఁబోలును! అందుచేతనే కావచ్చును నేఁడామె వారందఱి యెదుటను దిరుగుచున్నది. ఆ యున్మాదిని యొకప్పుడు నవ్వుచుండును-అంతలోనే యేడ్చుచుఁ బోవుచుండును—ఒకచోఁ గోయలొసంగిన ఫలాదుల నారగించుచుండెను ఒక్కచోఁ బది యిరువదిమంది కోయలఁ జుట్టును జేర్చుకొని వారికి సంగీతమును వినిపించుచుండెను. ఆమె నందఱును భక్తిభావ హృదయములతోఁ జూచుచుండిరి. చాలమంది యామెను దేవీమూర్తిగ భావించి పూజించుచుండిరి. అనేకు లామెను దమ ప్రాణములకంటె నెక్కుడుగఁ బ్రేమించుచుండిరి కొందఱు వస్త్రములను గొందఱలంకారములను గొందఱాహారపదార్థములను నామెకుఁ బ్రియపూర్వకముగ నర్పించుచుండిరి వారందరునుగూడ నీమందిరమునందలి దేవీమూర్తిని బూజించుటకుఁ దమశక్తికొలందిగఁ బూజాద్రవ్యములనుదెచ్చి యుండిరి. అట్లే వారు శ్యామలకును మంచి మంచి వస్తువులనుదెచ్చి సమర్పించుచుండిరి.

శ్యామలను గోయలందఱును బాగుగ నెరుంగుదురు. వారికిఁ బ్రత్యేకజాతీయాదర్శము లేఁక నెట్టివియునులేవు అప్పటి యాయరణ్యకుల కందరకు నొక్కటే పరమావధిగానుండెను. వారి దేవీమూర్తి—వారి శ్యామలామూర్తి—వారి వనరాజమూర్తి—ఈ మూఁడుమూర్తుల యందే యెల్లప్పుడును వారి మనఃప్రాణములు విలీనములై యుండును; వారి సర్వస్వము నర్పింపఁబడుచుండును. ఇప్పుడు వారందరు నొక్కచోఁ జేరి వారి శ్యామలామూర్తిని వారి దేవీమూర్తిని దర్శించి యానందించుచున్నారు.—ఇఁక వారికి వనరాజమూర్తి సాక్షాత్కరింపవలసియుండెను. అందుకొఱకే యందరు నుత్కంఠులై ప్రతీక్షించుచుండిరి

## పదునాఱవ ప్రకరణము

" వేణుగానరవంబు • వినవచ్చె నేమొ
యమునలో నప్పుడే • యమృత ముప్పొంగె;
ప్రియసఖీ ! చెప్పవే • ప్రేపల్లెనుండి
బయలుదేఱెనఁటమ్మ • బాలకృష్ణుండు ?
శిఖిపింఛకాంతులు • చెలరేగెనేమొ
తరుపత్రములలోనఁ • దళదళల్ పుట్టె;
ప్రేయసీ ! యిప్పుడే • బృందావనమునఁ
గొలువుదీర్చునఁటమ్మ • గోపాలమూర్తి !
గిరిమల్లికలతావి • గిరికొన్న దేమొ
యాభీరమండలం • బవశమైపోయె;
కల్యాణి ! చూడవే ! • కన్నులఁగప్పి
మోసగించునొ యేమొ • మోహనమూర్తి ? "

శ్యామల యిట్లుపాడుచు నంతలో గీతము నాఁపివైచి కరతాళముల వైచుచు అనంతర మల్లే నవ్వుచులేచి నిలువఁబడియెను. అనంతర మల్లే నవ్వుచు నవ్వుచుఁ బయిగెత్తఁసాగెను. ఆమె మధురసంగీతమునకు ముగ్ధులై కోయలందఱు నామె చుట్టును మూఁగనారంభించిరి. ఆమె యతివేగముగ దేవీమందిరమువైపునకుఁ బోవుచుండుటంగాంచి వారందఱును దత్తరముతో నామెకుఁ ద్రోవయిచ్చిరి శ్యామల యొక్క

పరుగునఁబోయి యా మందిరమునఁ బ్రవేశించి ద్వారమును మూసి వైచెను. తలుపులు వైచినశబ్ద మా యరణ్యమునం దతిదూరమునఁ బ్రతిధ్వనించెను. అప్పుడయ్యారణ్యకు లందఱును దమతమ కార్యముల యందు నియుక్తులై యుండిరి.

ఆకస్మికముగ నా యరణ్యకజనసమాజమునం దంతటను గలకలము బయలుదేఱెను అప్పుడు వారందరు నొక్కసారిగ యోధవేషాలంకృతులు కాఁజొచ్చిరి. ఆ కోయమండల మంతట నాజ్ఞాశబ్దములు నంగీకారధ్వనులు నొక్కసారిగ వెలువడియెను. వారందఱును దమతమ నాయకుల ననుసరించి వరుసలుతీరి నిలిచియుండిరి.

దూరమునం దేదియైన శత్రుసైన్య మగపడుచుండెనా యేమి ?— లేదు సర్వప్రభుండగు వనరాజు మధురమురళీగానము వినఁబడుచున్నది; శీఘ్రముగనే వనరాజు వారికి సాక్షాత్కరింపనై యుండెను. అందుచేతనే వారందఱు నీవిధముగ నుత్కంఠులై యెదురుచూచుచుండిరి. అదియే యా మోహనవేణుగానామృతము !— అంతటి మధురవేణుగానామృతమును గోయలెట్లు మఱవఁగలుగుదురు ? ఆ మహారణ్యమందంతట నమృతమును వర్షింపఁజేయుచు నా మధురమోహనగాన ముద్దీపితమగుచుండెను. ఏమురళి యింతవఱకు నెల్లయారణ్యకుల హస్తముల యందును జిందులుద్రొక్కుచుండెనో యా ముద్దులమురళి యదియే చిరపరిచితంబగు నా మధురస్వర మదియే ! ఇప్పటికా మురళి స్వామి హస్తముల నలంకరించినది అతఁడా వేణువు నందుకొని గానము చేయుచున్నాఁడు ! ఇఁక నాతఁడు ప్రత్యక్షము కాఁగలఁడు.

మొట్టమొదట నా కోయలందఱు నాగాన మెచ్చటనుండి వినఁబడుచుండెనో తెలిసికొనఁజాలకపోయిరి. ఇప్పుడు తెలిసినది. ఆ చెంతనున్న గిరిశిఖరమునుండి పాడుచు నా వనరాజు దిగి వచ్చుచుండెను. అదియే యా మురళి. ఆ మనోహరశిఖిపింఛ మల్లే యాతని శిఖాశిఖరమునఁ జిందులుద్రొక్కుచుండెను. ధనుస్తూణీరములు కృపాణము, ఛురిక, వీణ, కృష్ణాజినోత్తరీయము—అన్నియు నట్లేయున్నవి. అతఁడు పీతాంబరమునే ధరియించియుండెను. గళమున స్ఫటికరుద్రాక్షమాలికలు

యథాపూర్వముగనే విలసిల్లుచున్నవి. ఫాలభాగమున సిందూరతిలక మెప్పటివలెనే మెఱయుచుండెను. ఆ మూర్తియే వనమూర్తి!

ఆకస్మికముగ నందఱకు నా దివ్యమూర్తి ప్రత్యక్షమయ్యెను. కోయలందఱ హృదయములను బరవశములై పోయెను. అతఁడు నిజముగ దేవతాస్వరూపుఁడని యిదివరకే వారు నమ్మియుండిరి. ఆ దివ్య మందిరమునందలి దేవీమూర్తియే—నరకపాల మాలికాలంకృతదివ్య శక్తియే స్వయముగఁ దమ్ముఁ బరిపాలించుటకై వనరాజమూర్తిం దాల్చి సాక్షాత్కరించుచున్నట్లు వారికిఁ దోఁచెను. అప్పుడా యారణ్యకులందఱు నాతనిం దర్శించి భక్తివిశ్వాసములతో నొక్కపెట్టున జయజయధ్వనుల జేయసాగిరి. వారి జయధ్వనులు దిగంతములఁ బ్రతిధ్వనించుచు నయ్యనంతారణ్యమున ననంతవాయు తరంగములందీఁది యనంతాకాశమున విలీనములై పోవుచుండెను.

అప్పుడు వనరాజు కోయలను సమీపించి ప్రసన్నవదనముతో దక్షిణహస్తమునెత్తి మంత్రగంభీర మధురస్వరంబున "ఓ దేవీదాసులారా! సోదరులారా! వరాభయదాయని యగు వనదేవి—జగన్మాత మనలను సర్వదా కాపాడుచున్నది. ఆ భువనమాత యాజ్ఞగా నేను మీకందఱకు నాజ్ఞాపించుచున్నాఁడను. నిరంతరరణజీవనుఁడగు నిడుఁబ్రోలు సేనాపతి విజయరాయలు చిరకాలమునుండి మిమ్ములను బీడించుచున్నాఁడు. తనబిడ్డల రక్తవాహినులంగాంచి తల్లియగు వనదేవత కన్నుల నీరుపెట్టుకొనుచునే యున్నది. కాని ప్రతికారమున కిప్పుడు సమయముకాదు. సమరప్రియుండగు నాతఁడు ససైన్యముగ మరల నిచ్చటికి వచ్చుట తటస్థించునేని మీరెల్లరు వెనుకటివలెనే యాతని కంటఁ బడకుండఁ దప్పించుకొని యుండుఁడు! పూర్వవైరములం దలంచుకొని యాతనితోఁ గలహింపవలదు. ఆతని రాజ్యమునం దెవ్వరు నెట్టి కల్లోలమును గల్పింపవలదు. అమృతమూర్తియగు దేవీయనుగ్రహముచే మన కెట్టిలోపమునులేదు. నిర్దయుఁడై మనలను గ్రూరసత్వములవలె భావించుచు హింసించుచున్న విజయరాయల చిరకాలములోనే తన పాపఫలము ననుభవింపఁగలఁడు. శాంతజీవనులమగు మనకు శాత్రవముతో నిమిత్తములేదు. ఇదియే దేవి యుద్దేశము—తల్లియాజ్ఞ—

ఆ జగన్మాతయనుజ్ఞను బరిపాలించుటయే మనకుఁ గర్తవ్యము—జయ మహామాతకు జయమగుఁగాక !" అనియెను.

మఱియొకసారి యామహారణ్యమంతయు జయజయధ్వనులతో నిండిపోయెను. దశదిశల నానందకోలాహలధ్వనులు చెలరేఁగెను. అప్పుడు వనరాజు కోయలతోఁ గలసి మెలసి క్రీడింపనారంభించెను. ఇప్పుడతనికి గంభీరభావములేదు ; రాజభావములేదు. ఇప్పు డాతఁడు సామాన్యనింబోలి కోయలతోఁ గలసిపోయెను; వారితోఁగలసి యానంద నిమగ్నుఁడై పోయెను. అతని మధురసంగీతమును, మధురమోహనమురళీ గానమును బరమానందముతో నాలకించుచు నారణ్యకులందఱు నచ్చటనే యా దినము నత్యానందకోలాహలముతోఁ గడపివైచిరి.

మఱునాఁడు వారందఱును దమతమ యిండ్లకు బయలుదేఱి పోయిరి. అప్పుడు మరల నెప్పటివలె నాప్రదేశము నిర్జనారణ్యమే యైపోయెను. ఎప్పటివలె నా దేవీమందిరముకూడ జనశూన్యమైపోయెను. కేవల మా విజనకాననమున దూరమునుండి శ్యామలా మధురగానము మాత్రము నలువంకలఁ బ్రతిధ్వనిత మగుచుండెను. ఏకాకిని యగు శ్యామల వనవిహంగమువలెఁ దన మనఃప్రాణముల నేకీభవింపఁజేసి యిచ్చవచ్చిన తీరున గానము చేయుచుండెను.

"కాళీయఫణిఁజూచి • కార్చిచ్చుఁ జూడ
వెఱ్ఱిగోపకులార ? • వెఱచెద రేల ?
కొదవులన్నియుఁ దీర్చు • గోపాలమూర్తి
మీపాలనుండఁగా • మీకేమి భయము ?

* * * *

గోపాలకుల వీడి • గోవుల వీడి
పాడుచు నాతోడఁ • బరుగెత్తివచ్చి
బాలకృష్ణుఁడు చాల • బడలినాఁడమ్మ
విరజాజిచెల్లెలా ! • విసరవేమమ్మ !

## పదునేడవ ప్రకరణము

మురళ మునుపటి మురళకాదు. ఆమె గర్వము రాణియైన తరువాత శతగుణము అధికమయ్యెను. ఆమె నిగూఢహృదయ మిప్పుడు మఱింత నిగూఢమైనది. ఇప్పుడు మురళ సఖులతో నానందముగను జనవుగను దఱచు మెలంగుటలేదు. సరళకుమాత్ర మెప్పుడో యొకప్పు డామెదర్శన మగుచుండెను. కాని మునుపటి యాటపాటలును వినోద విలాసములను మాత్రములేవు. ఆమె తన మందిరాంతరమునఁ దనయాలోచనములలోనే యెల్లప్పుడు మునిఁగి తేలుచుండెను. ఆమె మనసులో నేమున్నదియో యామెకేగాని మఱి యెవ్వరికిని దెలియుటలేదు. ఇంతమాత్రముచే నితరుల కెవ్వరికిని లాభముగాని నష్టముగాని లేదు; కాని యామె హృదయపరివర్తనముచే నంతఃపురమునందలి సుఖశాంతులను వినోదవిలాసములకును మాత్రము లోపము వాటిల్లెను.

కాని తుదకామె కేకాంతసుఖమార్గము దొరికినది. కొలఁది దినముల లోనే మురళ రాజాంతఃపురమును విడిచెను. మహారాజగు మాధవ రాయలు కుమారుఁడగు విజయరాయనికిఁ గేవలము రాజబిరుదము నొసంగుటతోడనే తృప్తివహించి యుండలేదు. ఆతనికొక జాగీరును గూడ నొసఁగి యొక మహారాజప్రసాదమును గట్టించి యిచ్చెను; మఱియు నచ్చటికిఁబోయి యామందిరమునఁ బ్రభువువలె స్వేచ్ఛగ నుండుట కనుజ్ఞనొసంగెను. విజయరాయలు మురళతోఁగూడ నా ప్రాసాదమున నివసించియుండెను. మురళ మహారాజాంతఃపురమును వదలి నప్పటినుండియు నెప్పటివలె నచ్చట నానందకిరణములును, సుఖకిరణ ములును బ్రసరించుట కారంభించెను.

విజయరాయ లిప్పుడు రాజయ్యెను—ఆతనికొక పెద్ద జాగీరు కూడ నున్నది. ఇట్టిస్థితికి వచ్చినప్పు డేదైన నొక మహోత్సవము గావింపకుండుట బాగుండదు. అందువలననే విజయరాయలు నూతన ప్రాసాదమునఁ బ్రవేశించి యొక మహోత్సవముం జేయుటకు మహా సంరంభంతోఁ బ్రయత్నింపఁబొడఁగెను. దేశమునందలి పేరుమోసిన

పెద్దలందఱకును శుభవార్త లంపఁబడియెను. మహారాజును యువరాజును గూడ విజయరాయని ప్రాసాదమునకువచ్చి యీ మహోత్సవమును సందర్శింపవలయును. విజయరాయ లీమహోత్సవమునకై విశేష ద్రవ్యమును దృణప్రాయముగ వ్యయము చేయుచుండెను. ఏవిషయమునఁగూడ నెట్టి లోపమున గలుగఁగూడదని యాతని ముఖ్యోద్దేశము. కేవలము రాజబంధులను, నధికారులను మాననీయులను మాత్రము పిలుచుటయేకాదు. దేశమునందలి ధనవంతులగు వర్తకులను, సామాన్య ప్రజలకుఁగూడ నాహ్వానము లంపఁబడియెను. దరిద్రులకును భిక్షుకులకును నన్నవస్త్రధనదానములం గావించుటకుఁ దగిన యేర్పాటులు చేయఁబడియెను. ఈ మహోత్సవ వృత్తాంతము దేశవిదేశములయందుఁ గూడ వ్యాప్తమయ్యెను. ఎల్లచోటులనుండియుఁ జాలమంది ప్రజ లా యుత్సవమునకు విచ్చేసియుండిరి.

ఆమహోత్సవమునకుఁ బూర్వరాత్రి మురళ తన స్వామియెడలఁ బరమాదరమును, బరమప్రేమమును, బరమోత్సాహమును బ్రకటింపసాగెను. అంతటి యాదరమును, నంతటిప్రేమమును, నంతటి యుత్సాహమును విజయరాయ లిదివఱ కెన్నఁడును జూచియుండలేదు. అప్పుడాతఁడు పత్నీవ్యామోహముచే ముగ్ధుడైపోయెను. ఆ సమయమున మురళ యాకస్మికముగ "నాథా! మీరు మహారాజు లయ్యెదరా?!" అనియెను. ఆమాటకు విజయరాయఁ డులికిపడి "మురళా! నీవెన్నఁడు నిఁక నిట్టిమాట చెప్పకుము! అందువలన నా హృదయము దహించుకొనిపోవును. నా ప్రాణములు చలించిపోవును. నామనసున మహారాజును గావలయునను కోరిక లేనేలేదు. కాని యీ దేవీమందిరమున నా మాయావివి భయంకర వాక్యములు వినకుండ నున్నంతవఱకు మాత్రము నా హృదయమునం దట్టి యుద్దేశము తనంతతానే లీలామాత్రముగఁ దలసూపినది. ఎంత ప్రయత్నించినయు దానిని హృదయమునుండి మరలించుకొనఁ జాలనైతిని—మురళా! నీవెన్నఁడు నిఁక నామాట చెప్పకుము!" అనియెను.

నాథునిమాటకు మురళ హృదయమునం దభూతపూర్వానందముదయించెను. అప్పుడామె యీ భావమును మఱుఁగుపఱచి "ఆ సన్యాసి-

రూపమున జగన్మాత పలికిన పలుకులు సత్యములు. ఆ విధముగఁ దప్పక జరగితీరును " అనియెను.

విజయరాయ లాకస్మికముగ లేచికూర్చుండి మెల్లమెల్లగ "ఏమి! నేను మహారాజ నయ్యెదనా?—ఎట్లు?—రామరాయలు జీవించియుండఁగనే!" అనియెను.

మురళ—చచ్చుట యెంతసేపు?

ఆమాట యాతని హృదయమున మెఱపువలెఁ బ్రవేశించెను. ఆతఁడు మురళను దదేకదృష్టితోఁ జూచుచు "నీయొద్ద నిజము చెప్పకుండుటేల? నేనీ జాగీరును రాజభవనమును బడసినప్పటినుండియు ననిర్వచనీయానందము ననుభవించుచు నింతమాత్రమునకే యింతటి సుఖము కలుగుచుండఁగా మహారాజనైనచో నెంతటిసుఖము కలుగునో గదా యని యనుకొనుచున్నాఁడను" అనియెను.

ముర—మీకా సంగతి తెలియదు. చాలదినముల క్రిందటనే నేను దాని నెఱుఁగుదును.

విజ—మురళా! ఇప్పుడు నన్నేమి చేయమనియెదవు?

ముర—నామాట విందురా యేమి? వినినచోఁ జెప్పెదను.

విజ—నీమాట వినక యీ ప్రపంచమునం దింకెవ్వరిమాట విందును?

ముర—చెప్పెదను వినుఁడు!

అత్యాదరముతో నతిప్రేమముతో మురళ తనస్వామి మస్తకమును వక్షమునం దుంచుకొని మధురస్వరముతో "నాథా! మీరే మహారాజు లయ్యెదరు; కుమారరాయలు మూర్ఖుఁడు—దుర్బలుఁడు—భీరుఁడు—రణవిద్యావిహీనుఁడు—మహారాజగుట కాతని కెట్టి గుణసంపత్తియును లేదు. మీరే నాసర్వస్వమును—మీరే విడుఁ బ్రోలు మహారాజ్యమునకుఁ బ్రభువులగుట కుపయుక్త సత్వసంపన్నులు—మహారాజునకుఁ దగిన గుణములన్నియు మీయొద్దనే యున్నవి—ఇదియే భగవతి యనుజ్ఞ—ఇచ్ఛ—లీల—మీరిందుల కిచ్ఛయింపనిచో నుత్తమంబగు నీ విడుఁ బ్రోలు రాజ్యసింహాసనమునం దొక యసమర్థుఁడు ప్రవేశించుటయు.

జగన్మాత యుద్దేశము విఫలమగుటయుఁ దటస్థించును. కావున మీరు మహారాజులు కాఁగోరకుండుట దోషమగును" అనియెను.

విజయరాయలు కొంతసేపటివఱకు మాటాడలేదు. పిమ్మట మురళం జూచి "కుమారరాయలు జీవించియుండఁగా నేనెట్లు మహారాజనగుదును ?" అనియెను.

ముర—అతఁడు మరణించుట యెంతసేపు ?

విజ—జీవిత మనిశ్చితమైన దనుమాట విజమే—కాని రామరాయ లింతశీఘ్రముగ మరణించునని యాశ యెక్కడనున్నది ?

మురళ యాఁడుసింగమువలె లేచికూర్చుండి "నాధా ! నేను మీరు మహావీరులని యెఱుంగుదును. పథపరిష్కారము గావించుకొని మీ యభీష్టసిద్ధిం బడయఁగలరనికూడ నెఱుంగుదును. కాని మీరిప్పుడు కేవలము విష్ప్రియోజకులై యున్నారు" అనియెను.

విజయరాయలు చాలసేపటివఱకు మాటాడఁజాలక పిమ్మట "తలఁచుకొనినచోఁ బ్రాణములు తల్లడిల్లిపోవుచున్నవి. మురళా ! ప్రియా ! ప్రాణేశ్వరీ !—నీవిప్పుడు నన్నుఁ బ్రలోభసముద్రమున ముంచి వేయకుము. ఏమిచేసిన నేమగునో యెవ్వరికిఁ దెలియును ?" అనియెను.

ముర—హృదయేశ్వరా ! భయమెందులకు ? మీమూలమున భయమునకుఁ బ్రతిష్ఠకలుగునా యేమి ? మీరు మహారాజు లయ్యెదరు. ఇది దేవత సంకల్పము. ఇట్టిచో మీరీవిషయమున నించుక ప్రయత్నించుట మీకుఁ గర్తవ్యముకాదా ? ప్రాణప్రియా ! నన్ను మీరు ప్రేమించియున్నారు—నేను మహారాజ్ఞిని గావలయునని మీకించుకంత యైనఁ గోరికలేదా ? ఇంతటిలోనిదా మీప్రేమ ?

విజయరాయలు రెండుచేతులతోడను మొగము మూసికొని యేడ్చుచు "మురళా—మురళా ! ఇంకను నన్నుఁ బ్రలుబ్ధునిగాఁ జేయఁజూడకుము !" అనియెను.

ముర—ఉపయోగ మేమైన నుండినచో నేను—నేను నా యొడిలో నుండి నాపాలంద్రావుచున్న నా కన్నబిడ్డనైన విశ్చలముగ నేలపై ద్రోసివైచి యా శిశుమస్తకమును జూర్ణీభూతముగఁ జేయఁగలుగుదును !

ఆవశ్యకమైనచో నేను నాతండ్రి వక్షముసంగూడ విశితకరవాలముం బ్రయోగింపఁ గలుగుదును! నేనెఱుంగుదును—నీవు వీరపురుషుఁడవు!

ఇట్లు చెప్పుచు ససహ్యాభావముతో రోషావేగముతో మురళ నాధునిచెంతనుండి లేచిపోవుచుండెను. భీతశిశున్యాయమున విజయరాయ లామె చేలాంచలమును బట్టుకొనియెను. అప్పుడు మురళ "వదలుఁడు! మీప్రేమయేమో తెలిసిపోయినది!" అనియెను. అప్పుడు విజయరాయలు లేచి నిలువఁబడి గంభీరభావముతో "మురళా! నీవు సరిగఁజెప్పితివి—నేనసమర్థుఁలో నధమాధముఁడను-నిన్నింత దానిగాఁజేసిన మూర్ఖుఁడను" అనియెను.

ముర—ఇదియా విజయరాయని సత్యవాక్యము!

విజ—నన్నేమి చేయుమందువు?

ముర—నామాట విందురా?—నేఁ జెప్పినట్లు చేయుదురా? నాకెందులకు?

విజ—నీవుచెప్పినట్లు చేయక మఱియెవ్వరు చెప్పినట్లు చేయుదును?

ముర—కుమారరాయలు మనయింటికి వచ్చును—అప్పు డనాయాసముగ మీమార్గము నిష్కంటకముగఁ జేసికొనవచ్చును.

విజ—మురళా! నీహృదయ మతితీవ్రమైనది. భావించినంతనే ప్రాణములు చలించిపోవుచున్నవి.

ముర—మీహృదయ మింత దుర్బలమైనదే యైనయెడల మీరీ కార్యమునందే ప్రవేశింపవలదు. నేనే నామనసుకు బుద్ధిచెప్పుకొనియెదను-దుర్బలహృదయుఁడగు నాతఁడు విడుఁ బ్రోలు సింహాసనమున కర్హుఁడు కాఁడవి-నేనే బుద్ధిచెప్పుకొందును.

విజ—అయ్యో! ఎంతటి మహోత్సవదినము? కుమారుఁడు—నాయింటి యతిథి—

ముర—ఇట్టి కార్యములయందు న్యాయాన్యాయములు లేవు—యుద్ధసమయములయందు, దుర్గభేదసమయములయందు, రాజ్యోపార్జన సమయములయందు-మీవంటి వీరులు న్యాయము నన్యాయమును గూడ భావింతురేమి?

విజ—సరిగఁ జెప్పితివి. నేనీ కార్యమును జేసితీఱుదును. ఇఁక భయములేదు. ఇంతటినుండి నేను రాక్షసుండను.

ముర—కాదుకాదు—ప్రాణప్రియా! నీవిఁక నిడుఁబ్రోలు రాజ సింహాసనాధీశ్వరుఁడవు. మహారాజవు!

## పదునెనిమిదవ ప్రకరణము

కొంతవఱ కూఱడుండెను. కొంతవఱకుఁ బ్రబోధించెను. కాని సరళ యించుకంతయును దేఱుకొనలేదు. ఆమె యువరాజు వక్షమునందు మొగమువాల్చి వెక్కి వెక్కి యేడువసాగెను. "ఏడువకుము! ఇఁక నేడువకుము!" అని మెల్లగఁ బలుకుచు రామరాయలు సరళ మొగ మించుకపైకెత్తి ముద్దు పెట్టుకొనియెను. అయినను నామె కన్నీరాఁగలేదు? ఏడుపు మానలేదు— రామరాయలు మరల మరలఁ జాలవఱకు బోధించెను.

నిడుఁబ్రోలు ప్రజలందఱు నిప్పుడు పరమానంద నిమగ్నులై యుండిరి. విజయరాయని నూతనప్రాసాదముల మహోత్సవములు జరగుచున్నవి. మహారాజంగరక్షిబలముతోఁ గుమారుని భవనమునకుఁ బ్రయాణము చేయుచుండెను. ఆయనతోఁ గలిసి రామరాయలుకూడఁ బోవలసియుండెను. కాని యాతఁ డట్లు పోవఁజాలకుండెను. సరళ యాతని బోనిచ్చుటలేదు. కేవల మేడ్చుచుండుటయేగాని యామె యేమియు మాటాడుటలేదు. స్వామికంఠమును బట్టుకొని వ్యాకుల హృదయముతో "నీరిచ్చటనుండి యిప్పుడు పోవలదు" అని యేడ్చుచుండెను ఆమె భావమును గ్రహింపఁజాలక యతికోమలహృదయుఁడగు కుమార రామరాయలుకూడఁ గన్నీటి నాఁపుకొని సరళహృదయయగు సరళ నూఱడించెను.

సరళ యట్లే వెక్కివెక్కి యేడ్చుచు నేడ్చుచుఁ గొంతసేపటికి హృదయేశ్వరు వక్షముమీఁదనే తలయుంచి నిద్రపోయెను. రామరాయలా యుత్సవమునకుఁ బోకుండుట మంచిపనికాదు. అతఁడు పోనియెడలఁ బ్రజలనేకులఁ అనేకవిధములుగఁ జెప్పుకొందురు. అపవాదము నెత్తిపై

బడును. తాతగారుమాత్ర మేమనుకొందురు? రామరాయలు జాగరూకతతో మెల్లగఁ దనవక్షముమీఁదనున్న సరళ యుత్తమాంగమును బర్యంకముపైఁజేర్చి సంకోచభావముతో నా శయనమందిరమునుండి వెలుపలకు వచ్చెను; ఆమెలేచి మరల దన్నడ్డగించునేమోయను భయముచే నాతఁడు వెనుకకైనఁ దిరిగి చూడలేదు. వాద్యములు మొరయుచుండెను. తోరణద్వారముకడ భేరీధ్వనులు దిగంతముల భేదించుచుండెను. రాజగు విజయరాయని విశాలరాజభవనము నానాలంకార భూషితమైయుండెను. వాద్యోత్సవములను వారాంగనానృత్త్య గీతములను మఱియు ననేక వినోదములను దర్శింపవలయునని వేలకొలఁది జనులు మూఁగియుండిరి. ఆ జనసంఘమునం దొక్కపెట్టున గగనతలవిభేదనంబులగు జయధ్వనులు బయలువెడలెను. ఉభయపార్శ్వములందును జను లోసరిల్లి యెవ్వరికొఱకో మార్గమును విడుచుచుండిరి. నలుదెసలను గోలాహలము పుట్టెను—యువరాజగు రామరాయలు వచ్చుచుండెను.

సైనికులును సేనానాయకులును బరివేష్టించియుండఁ గుమార రామరాయ లశ్వారోహియై పుర(?)ముఁ బ్రవేశించుచుండెను. అంతలో నెవ్వరోవచ్చి యాతని యశ్వసమ్ముఖమున నిలువఁబడిరి. అంగరక్షకులా స్త్రీని దూరముగఁ దొలఁగించుటకై ప్రయాసపడుచుండిరి—కాని యమె పిచ్చిది—ప్రహరీగణ మామెను బట్టుకొనుటకుఁ బ్రయత్నించుచుండుటం గాంచి రామరాయలు వారిని వారించెను. ఆమె యున్మాదినియే కాని యామెం జూచినచో హృదయము కరఁగిపోవుచుండెను. ఆమె మొగమువంకఁ జూచుటతోడనే కుమార రామరాయని హృదయమున ననిర్వచనీయంబగు నొక యభినవభావోదయ మయ్యెను.

అప్పు డాతఁడు గుఱ్ఱమునుండిదిగి మెల్లమెల్లగ నా పిచ్చిదాని యొద్దకుఁబోయి యామె చేయిపట్టుకొని "నీవు నాతోఁగూడ రమ్మ! నీకేమియును భయములేదు. పిచ్చిదానివని నిన్నెవ్వరు నిఁకఁ ద్రోసివేయఁజాలరు" అనియెను. అప్పుడా యున్మాదిని పకపక నవ్వసాగెను. అనవ్వు చూచి కుమారరాయలు లజ్జితుఁడై పార్శ్వవర్తులం జూచి "ఈమెను దీసికొనిపోయి భోజనము పెట్టింపుఁడు!" అనియెను. ఈసారి

యున్మాదిని నవ్వలేదు—అతిగంభీరభావముతో నహంకారపూర్వకముగఁ దలయెత్తి "నేనెవ్వరో యెఱుఁగుదువా!" అనియెను. రామరాయలు మాటాడుటకు ముందుగనే జనమండలమునుండి యెవ్వరో 'నీవెవ్వరవు!' అని ప్రశ్నించిరి. అప్పు డా యున్మాదిని "నేనీ విదుఁబ్రోలు రాజ్యము నకు మహారాజ్ఞీమణిని!" అని ప్రత్యుత్తరమిచ్చెను. ఈ మాటకు జనమండలమంతటను హాసధ్వనులు బయలువెడలెను. రామరాయలు నిజముగా నిప్పుడు లజ్జాన్వితవదనుఁ డయ్యెను. ఇఁక నీ పిచ్చిదానితోఁ బిచ్చిచేష్టలు చేయుట యనుచితమని భావించి యాతఁడు సత్వరముగ రాజప్రసాదమునఁ బ్రవేశించెను.

ఉన్మాదిని యేడువఁదొడంగెను—ఆమె రోదనధ్వని నిశితాయుధముంబోలి రామరాయల హృదయమున నాఁటుకొనియెను. అప్పు డాతఁడు చకితుఁడై వెనుకకుఁ దిరిగెను. ఉన్మాదిని యాతనివంకకుఁ జేయెత్తి "పోవలదు—పోవలదు—" అని పలుకుచు నున్మాద నృత్యములం జేయుచు జనసంఘమునఁ బ్రవేశించెను. ఆమె భయంకర తాండవముం గాంచి ప్రజలు భయముతో నామెకుఁ ద్రోవయిచ్చిరి. "ఎంతనవ్వో యంత యేడుపు" అని కేకలువైచుచు నా యున్మాదిని యతివేగముగఁ బరుగెత్తనారంభించెను. ఆ వికృతధ్వనులు వాద్యధ్వనులు కాఁజొచ్చెను. ప్రాసాదద్వారమునొద్దఁ గుమారరాయల కర్ణకుహరమునఁగూడ నీశబ్దములు ప్రతిధ్వనించెను. అతఁడు వజ్రాహతునింబోలి నిలువఁబడిపోయెను. అందఱు నా వెఱ్ఱిదానిమాటలు చెప్పుకొనుచు నవ్వుకొనుచుండిరి. కాని కుమారరాయని హృదయమున మాత్ర మెన్నఁడు నెఱుంగని భయభావ ముదయించెను. అప్పు డాతఁడు తనలో "నేఁడు నిశ్చయముగ నేదియో దారుణకృత్యము జరుగఁగలదు. కానిచో సరళ యంతగా నెందుల కేడ్చును?" అని యనుకొనియెను.

రెండడుగులు ముందఱికివైచి వెనుకకుఁదిరిగి యువరాజంగ రక్షకులం గాంచి "ఆ పిచ్చిది యెవ్వరు? ఆమెను మీరెప్పుడైనఁ జూచితిరా?" అని ప్రశ్నించెను. అప్పుడు వారిలో నొకఁడు "ప్రభూ! ఈమె కోయల శ్యామల!" అని ప్రత్యుత్తరమిచ్చెను.

## పందొమ్మిదవ ప్రకరణము

"కోయల శ్యామలయా?" అని రామరాయలు నిలువఁబడి పోయెను. అప్పటికప్పుడే యాతఁడు సభారంగమును సమీపించియుండెను. అయిన నచ్చటనే నిలువఁబడి వారింజూచి "కోయల శ్యామల యెవ్వరు?" అని మరలఁ బ్రశ్నించెను. ఆ శ్యామలపేరు చెప్పినయాతఁ డిదివఱకుఁ గొన్నాళ్ళు భద్రారణ్యప్రాంతమునందుఁ గొన్నిదినములుండెను. అందుచేతనే యాతఁడు కోయలపూజాస్థానమగు దేవీమందిరమును జూచియుండెను. అప్పుడాతఁడు శ్యామలనుగూడఁ జూచెను. శ్యామలనుగూర్చి తనకుఁ దెలిసిన విషయమంతయు నాతఁడా యువరాజునకు నివేదించెను. ఆ మాటల నాలకించి యువరా జించుక యాలోచించి "యున్మాదినిని మఱియొకసారి చూడవలయును. మీరెవ్వరైనఁబోయి యామె నొకసారి వెదకి తీసుకొని రండు!" అనియెను.

ఆమెను వెదకవలసిన యావశ్యకము లేకపోయెను. అంతలో శ్యామలయే యెక్కడనుండియోవచ్చి ప్రాసాదమునఁ బ్రవేశించెను. ఆమెయొక్క యెదుటున సభారంగమునఁ బ్రవేశింప నుద్యుక్తురాలయ్యెను. వినోదోత్సవ సందర్భమున రాజసభారంగమునకు జీర్ణవసన యగు నున్మత్త యువతిని బోనిచ్చుట యనుచితమని యెంచి ద్వారపాలకు లామె నడ్డగించుటకుఁ బ్రయత్నించుచుండిరి. ఇరువది ముప్పది మంది యామె వెనువెంటనే రాఁదొడంగిరి. కాని యెక్కడైన నామెను బట్టుకొనుటకుఁ బ్రయత్నింపఁజాలకపోయెను. పిచ్చిదానికి బలమెక్కువగ నుండును. ఆమె పట్టుకొనవచ్చినవారినెల్లఁ ద్రోసివైచుచు నెవ్వరికిని దొరకక ముందటికి వచ్చుచుండెను. పదిమందివచ్చి పట్టుకొన్నను వారల నామె సునాయాసముగ విడిపించుకొనుచుండెను. అందువలన నచ్చట మిగుల భయంకరకోలాహలము కాఁజొచ్చెను. అప్పుడు కుమార రామరాయని హృదయము భయప్రచలితమయ్యెను. అతడు నిజముగ నా కోలాహలమును గ్రహింపఁజాలక సత్వరముగ సభామధ్యమునఁ

ప్రవేశించెను. మహారాజాతనిం జూచి "కుమారా! వెలుపలఁ గోలాహల మేమి?" అని యడిగెను. కుమారరాయల కా సంగతి యేమియుఁ దెలియకుండుటచే "ఆ సంగతి తెలిసికొనివచ్చుటకు భటుని బంపి యుంటిని" అని ప్రత్యుత్తరమిచ్చెను. అంతలో నతివేగముగ ద్వార పాలకులను దప్పించుకొని శ్యామల సభామధ్యమునఁ బ్రవేశించెను.

ఆమె యతిశీఘ్రముగ మహారాజు సింహాసనమునొద్దకుంబోయి కరతాళములతో నృత్యముచేయుచు "తప్పుకొనుఁడు! తప్పుకొనుఁడు! నేను విడుఁబ్రోలు రాజ్యమునకు మహారాజ్ఞీమణిని!" అని కేకలు వైవసాగెను. ఆకస్మికముగ మార్గమధ్యమునఁ గాలసర్పముం గాంచి నప్పుడు పథికుఁ డెట్లదరిపడునో-అకస్మికముగ నెట్టయెదుట నశనిపాతమై నప్పుడు మనుష్యుఁ డెట్లు విశ్చేష్టుఁడై పోవునో—ఆకస్మికముగ నగపడ కుండవచ్చి యొక బాణము హృదయమున గ్రుచ్చుకొన్నప్పు డెట్టి క్లేశానుభవ మగునో—ఆ యున్మాదినిం జూచినతోడనే విజయరాయల హృదయ మా విధముగఁ దల్లడిల్లిపోయెను. కూర్చున్నయాతఁ డొక్క సారిగ గుభాలునలేచి నిలువఁబడియెను. అప్పుడాతఁ దక్షిణహస్తము తనంతన తానే పార్శ్వమున వ్రేలాడుచున్న కృపాణముమీదికిఁ బోయెను. ఆతఁడొఱనుండి చంద్రాయుధమును సగమువఱకుఁ బైకి లాగెను. దేవీమందిరమునందే బాలికామూర్తి తన్నుఁ జంపెదనని బెదరించినదో యామెయే యిప్పుడు కృపాణపాణియై తన్నుఁ బొడుచుటకై వచ్చుచున్నట్లు భావించుకొనియెను. నిమిషములో నాతని యాత్మజ్ఞానము నశించిపోయెను. ఒకనాడాతఁడా యారణ్యశిబిరమున నిద్రావస్థయం దెట్టి భయంకరస్వప్నముం గాంచియుండెనో యిప్పుడు జాగ్రదవస్థయందుఁ గూడ నట్టి స్వప్నమునే గనుఁగొనియెను. ఏబాలికాచ్ఛాయా మాత్ర దర్శనమున భయముచేఁ బిఱికిపందయై యాతఁ డరణ్యశిబిరమును విడిచి పలాయితుఁడయ్యెనో యా బాలికయే నేఁటిమహోత్సవదినమునం దన ప్రాసాదమందిరమునఁ దనసమ్ముఖమునఁ బ్రత్యక్షమైయున్నట్లాతని కగపడియెను. ఆమె యిప్పుడట్టి వేషములో లేదేమి?—ఆతఁడీ యిహ జీవనమునం దిక నెప్పటికైన నా ముఖమును మఱచిపోఁగలఁడా?—

## ఇరువదియవ ప్రకరణము

**విజయరాయని కొదలు తెలియకుండఁబోయెను.**

నిమిషములో నాతఁడు తన కరవాలము నొఱనుండి పెఱికి యా పిచ్చిదానిపై బ్రయోగింప సంసిద్ధుఁడయ్యెను. సభాముఖమున స్త్రీహత్యజరుగనై యుండుటంగాంచి సభ్యులలోఁ గోలాహలము పుట్టెను. అందఱును భయవిస్మితులై స్తంభితులై పోయిరి. వృద్ధమహారాజు "ఇది యేమి యన్యాయము ?" అని కేకలువైచుచు లేచెను. ఎల్లెడలను మహాకోలాహలముగ నుండెను.

కాని విజయరాయని కరవాలము పిచ్చిదాని మెడపైఁ బడలేదు. ఆ కరవాలముపై నింకొక నిశితకరవాలముపడి యా ఖడ్గసంఘర్షణముల వలన నగ్నిస్ఫులింగములు బయలువెడలెను—నిమిషములో రామరాయలు తన కృపాణముచే విజయరాయల కరవాలము నడ్డగించివైచెను! ఎవ్వరి హృదయములు పరస్పరానురాగపూరితములై యుండెనో, కొలంది దినములక్రిందటనే యెవ్వరు మహాజనసభారంగమున ననురాగపూరిత హృదయముతో నాలింగనమును గావించుకొని యుండిరో—అట్టి యా యుభయులు నిప్పుడు సభామధ్యమున—వృద్ధమహారాజు సన్నిధానము—అతని సింహాసనపార్శ్వమున — పరస్పరము యుద్ధము చేయుటకు సంసిద్ధులైయుండిరి—ఇరువురును గోశోన్ముక్త కృపాణపాణులై నిలిచియుండిరి. శ్యామల యతి శీఘ్రముగవచ్చి రామరాయని వక్షమునం దనమొగ మానుకొని వెక్కివెక్కి యేడువసాగెను. రామరాయలు వామహస్తముతో శ్యామలను గౌఁగిలించుకొని దక్షిణ హస్తముతోఁ గరవాలము నెత్తిపట్టుకొని యుద్ధమునకు సర్వసన్నద్ధుఁడై యుండెను.

అట్టి మహోత్సవ సమయమున వారిరువురు నిట్లుండుటంజూచి సభాసదు లందరును నిశ్చేష్టులైపోయిరి. సభయంతయు నిశ్శబ్దమైపోయెను. ఎవ్వరు నేమియు మాటాడుటలేదు. తుదకుఁ గుమారరామరాయలు "తండ్రీ! నేనీమె కభయప్రదానమును గావించియుంటిని. అదియును గాక యీమె యున్మాదిని—దిక్కుమాలినది. దీనురాలు—ఇట్టి యాడు

దానిపై మీవంటివారి కింతటిక్రోధ మెందులకు? ఇట్టి మహోత్సవ సందర్భమున నిది యీసభలోఁ బ్రవేశించి యుత్సాహ భంగము కావించు చుండెనని మీకుఁదోఁచినచో దీనిని మఱియొక చోటికిఁ బంపివేయ వచ్చును. ఇది పిచ్చిది—ఇట్టిదానికి మంచిచెడ్డ లెట్లుతెలియును?" అనియెను.

వృద్ధమహారాజు కూడ విస్మితుఁడై "కుమారా! నీవింతటి జ్ఞానశూన్యుఁడవై యుండుట నేనెన్నఁడును జూడలేదు. నీవిప్పుడీ స్త్రీ హత్యను గావింపఁదలఁచి విడుఁబ్రోలురాజ్య పవిత్ర సింహాసనమునకుఁ గళంకము నారోపింపఁ జూచుచుంటివి." అనియెను. విజయరాయని వదనము లజ్జావనతమయ్యెను. అతఁడు మెల్లమెల్లగఁ గరవాలము వఱలోనుంచి "తండ్రీ! నేను మీ సమ్ముఖమున క్షమాప్రార్థనముం జేసి కొనుచున్నాఁడను. ఇప్పుడు నేనేమిచేయుచుంటినో నాకుఁ దెలియలేదు. ఇఁక నీసభలో నా మొగము చూపుటకు సిగ్గగుచున్నది" అని ప్రార్థించుచు సభాసదులవైపునకుఁ దిరిగి "సభాసదులు నన్ను క్షమియింతురుగాక" అనియెను.

అప్పటికి నా యున్మాదిని రామరాయల వక్షమునందే మొగము నానుకొని యేడ్చుచునే యుండెను. అప్పుడు కుమారరాయలు మహారాజు నుద్దేశించి "మహారాజా! అనుజ్ఞయైనచో నేనీ యున్మాదిని మఱియొక చోటికిఁ దీసికొనిపోయెదను. ఇక్కడ నున్నచో నుత్సాహభంగము కాఁగలదు" అనియెను. వృద్ధమహారాజు తనలో "ఇటనుండి రామ రాయలు వెడలిపోయినచోఁ దప్పక యుత్సవభంగమగును సభ్యులందరు నీతనికిని విజయరాయలకును బూర్వానురాగము చెడినట్లు భావింపఁ గలరు. కావున నేనే స్వయముగ నీపిచ్చిదాని నూఱడించి యానందోత్స వములకు భంగము కలుగకుండఁజేసెదను" అని భావించి ప్రకాశముగ నవ్వుచు ఈ యున్మాదిని చెప్పినమాట నిజమే—ఈమెయే యీవిడుఁ బ్రోలు రాజ్యమునకు మహారాజ్ఞి—విడుఁబ్రోలుమహారాజ్ఞి విడుఁబ్రోలు రాజసింహాసనముననే కూర్చుండుఁగాక! రమ్ము మహారాజ్ఞీ! నీవు నా పార్శ్వమునం గూర్చుండి యీ యానందోత్సవముల నాలోకించు

చుండుము ! అనియెను. వృద్ధమహారా జుచితజ్ఞుఁడు—అందువలననే యాతఁడు నవ్వురాకపోయినను నవ్వుచుండెను. మహారాజ సంభాషణమునకు సభాసదులందఱు నవ్వు నాఁపుకొనలేకపోయిరి.

శ్యామల మెల్లమెల్లఁగ రామరాయని వక్షమునుండి మొగమెత్తి మెల్లమెల్లఁగ మొగముమరల్చి మహారాజువంకఁజూచుచు మందమంద గమనములతో సింహాసనము నొద్దకుఁబోయి మహారాజ పార్శ్వమునఁ గూర్చుండెను. అప్పుడు వృద్ధమహారా జాదరపూర్వకముగ నామెం జూచుచు "రమ్మ ! నీవు నా పార్శ్వమునఁ గూరుచుండుము !—కాని యల్లరి చేయకుము ! అల్లరి చేసినచో నిన్నందఱును నిందింతురు !" అని బోధించుచు నాతఁడు శ్యామల చుబుకమును బట్టుకొని ముఖ చాలనముం జేయుచు "నీ వెవ్వరవు ?" అనియెను. అప్పుడు శ్యామల "నీవు నన్ను గ్రహింపలేదా ? నేనే యీ విదుఁబ్రోలు రాజ్యమునకు మహారాజ్ఞీమణిని ! అనియెను. ఆపిచ్చిదాని మాటల కందఱును నవ్విరి. అప్పుడు మహారాజుకూడ లజ్జితుఁడై 'నీ పేరేమి ?' అని ప్రశ్నించెను. అంత నా యున్మాదిని 'కోయల శ్యామల !' అనియెను. అనంతర మామె యీ విధముగఁ బాడనారంభించెను.

"కోమలజాతీ ని • కుంజాంతరమున
నోరులెఱుంగకయుండ • నొంటిగానుండి
యస్ఫుటస్వరముతో • నతివిగూఢముగ
విదియేమె ప్రియసఖీ ! • యేడ్చుచున్నావు ?
మనసు ద్రిప్పఁగలేక • మాటాడలేక
మాఱు సేయఁగలేక • మఱులోపలేక
వేఁడివిట్టూర్పులు • విడుచుచున్నావు
తలఁప నెంతటివెట్టి • దానవే తల్లి !—
తులసికావనములోఁ • దూఁగుటుయ్యేలలఁ
దూఁగుచు నీమాట • దోఁచిన నులికి
ప్రియుఁడు వేణువునూఁది • పిలుచుచున్నాఁడు
లేవమ్మచెల్లెలా ! • లేచి రావమ్మ !"

## ఇరువదియొకటవ ప్రకరణము

కారాబద్ధుఁడగువానికిఁ గారాగారమునఁ గాల సర్ప దర్శనమైనప్పు డెంతటి హృదయాందోళన మగునో యున్మాదినీ దర్శనముచే విజయరాయలకట్టి హృదయాందోళన మగుచుండెను. అతఁ డటునిటు బెదరి బెదరి చూచుచుండెను. ఒక వంక సంగీతము నాలకించుచు మనఃపరివర్తనముం గావించుకొనవలయునని యాతఁడు ప్రయత్నించుచుండెను; అచ్చటి యానందోత్సవములయందుఁ దన మనసును బ్రవేశపెట్టవలయునని ప్రయాసపడుచుండెను. కాని యెట్లును నాతఁడు తన హృదయవేగము నడఁగించుకొనఁ జాలక పోయెను.

ఏదినమున విజయరాయలు తాను మహారాజు కావలయునను నుద్దేశముతోఁ గార్యసాధనమునకు దృఢసంకల్పుఁడై యుండెనో యా దినమునకే సరిగ నాతని భవిష్యత్ఫలమును బ్రత్యక్షముగ దర్శింపఁ జేయుట కీయున్మాదిని యగు శ్యామల యాతని యెదుట సాక్షాత్కరించినదా యేమి ?—ఆ మందిరమునం జూచిన బాలికామూర్తి యీ శ్యామలవలె లేదే!—ఈ యున్మాదిని యా బాలిక కాదని యాతని మనసే పరిపరివిధములఁ జెప్పుచున్నది. అతఁడు కేవల కల్పనామయ దృష్టులతో నెల్లయెల్లడల నా బాలికామూర్తినే చూచుచుండెను. ఆమె యంతదూరమునుండి యీ నగరమున కెట్లువచ్చును ?—ఒకవేళ వచ్చినను నామె యీపిచ్చిది యెట్లగును? కాదు-ఆమె యీ యున్మాదినికాదు-ఈవిధముగ భావించుకొని విజయరాయలు శ్యామలను బాగుగఁ బరీక్షింపవలయునని యనుకొనియెను. కాని యట్లు చేయఁజాలకపోయెను.

క్రమముగ నాతని కచ్చటనుండుట దుస్సహముగ నుండెను—ఆతని హృదయతాప మసహనీయ మగుచుండెను. మనశ్చాంచల్యముచేఁ గలిగిన భయమువంటి భయము మఱియొకటిలేదు—అతఁ డాకస్మికముగ లేచి మహారాజుం గాంచి " మహారాజా! అనుజ్ఞయైనచో నీ సేవకుఁడు సెలవు గైకొనుచున్నాఁడు. నాకిప్పుడు మిగుల నస్వస్థతగా నున్నది. నేనిఁక గూర్చుండఁజాలను " అనియెను. కుమారుని చంచలభావముం గాంచి మహారాజుకూడ భయభ్రాంతుండై " అతి పరిశ్రమచే విజయ

రాయఁ దలసియున్నాఁడు ఇంచుక విశ్రమించినచో నాయాసము శాంతింపఁగలదు " అని భావించుకొని " కుమారా ! సౌమ్య !—బాల దినములనుండి శ్రమపడుచున్నాఁడవు—ఇంచుక విశ్రమింపుము " యని యనుజ్ఞ నొసంగెను. ఒక నిమిషములో విజయరాయలు సభారంగము నుండి వెడలిపోయెను. సహజముగనే నడచిపోవుచుంటినని యాతఁ డనుకొనియెను. కాని యాతని యూర్ధ్వశ్వాసములు సభాసదులకు గోచరము లగుచునే యుండెను. ఆతఁడు తన మనఃప్రపంచమున ననేక భయంకరదృశ్యములను గాంచుచునే యుండెను. ఆతఁడు సభను విడిచి పోవునంతలోనే యా యున్మాదిని యొక్క యెదుటున సింహాసనము నుండి క్రిందికురికెను. ఇంతవఱకును గొయ్యబొమ్మవలె సింహాసనముపైఁ గూరుచుండిన యామె యిప్పుడు కేకలువైచుచు బాణవేగముతో సభా రంగమును వదలిపోయెను. " ఏమియులేదు; ఎవరునులేదు " అని కేకలు వైచుచు నామె పోవుచుండెను. ఆమె భయంకరధ్వనులు రాజప్రాసాదమం దంతటను నలుదెసలనుగూడఁ బ్రతిధ్వనితము లగుచుండెను. గాయికలు పాడుచుఁ బాడుచు భయముచే గానమును మానివైచిరి. ఎల్లరును దమ తమ పనులనుమాని భయవిస్మయములచే స్తబ్ధులైపోయిరి. వినోద విలాసము లాకస్మికముగ నాఁగిపోవుటచే నిఁక నామె భయంకరధ్వనులు తక్క మఱి యెట్టిశబ్దమును వినవచ్చుటలేదు.

అప్పుడు మహారాజు " ఇప్పుడు వినోదవిలాసక్రీడలఁ జాలించి విశ్రాంతిగైకొనుట మంచిది. ఇఁక సభ చాలింతము " అనియెను. అందఱ హృదయములందు నిప్పుడొక యభూతపూర్వోదయ మయ్యెను. ఎల్లరును దమతమ యిండ్లకుఁ బోవుటకు వేగిరపడుచుండిరి. మహారాజాజ్ఞయైనతోడనే యందఱును సభాస్థలమును విడిచిపోయిరి.

## ఇరువదిరెండవ ప్రకరణము

యువరాజును మహారాజునుగూడ నేఁటి రాత్రి యా నూతనప్రాసాదమునందే యుండవలయును. మరల నుదయమున నెప్పటివలె వినోదవిహారక్రీడ లారంభమగును. అందువలన మహారాజును యువరాజునుగూడ సభారంగమును

విడిచి తమనిర్దిష్టశయన గృహాభిముఖులై పోవుచుండిరి. వారివెనుకనే కొంద అంగరక్షకులును, గొందఱు ప్రతీహారులునుగూడఁ బోవుచుండిరి.

ఇరువురును దమదమ యాలోచనములలోనిమగ్నులై యుండిరి. రామరాయల హృదయభావములు మన మెఱుంగుదుము. మహారాజు తనహృదయము నందలి భయవిచారముల నెంతగఁ బ్రయత్నించియుఁ ద్రోసివేయఁజాలకపోయెను. అతని హృదయమునఁగూడ సంతోషభావమంతర్హితమై పోయినది. ఎవ్వరు నేమియును మాటాడుట లేదు—ఇరువురును నిశ్శబ్దముగనే నడిచిపోవుచుండిరి. అప్పుడు యువరాజు సమీపవర్తులకైన వినఁబడకుండునంతటి మెల్లగ మృదుస్వరముతో "మహారాజా! అనుజ్ఞ — అనుజ్ఞయైనచో మరల నిచ్చటికిఁ దిరిగి వచ్చెదను" అనియెను. మహారాజు యువరాజుంజూచి "అదియేమి?" అని ప్రశ్నించెను.

యువ—మీ సన్నిధిని నాహృదయభావములను మఱుఁగుపఱుపఁ జాలను. నేఁటిరాత్రి యీ ప్రాసాదమునం దుండుటకు నాకుఁ జాల భయమగుచున్నది.

మహా—ఈమాట విన్న లోకులు నవ్వెదరు!

యువ—నేనెంత ప్రయత్నించినను మనసు కుదుటఁ బడకున్నది. కావున నాకు సెలవిచ్చి పంపుఁడు!

మహా—కుమారా! నీయొద్ద దాఁచుట యెందులకు? నా మనసు కూడ నంత బాగుగలేదు. కాని మనమిచ్చట నుండిపోయిన బాగుగ నుండదు. అందువలన లోకు లనేకవిధములఁ జెప్పుచుందురు. విశేషించి విజయరాయలు మనసునఁ జాలఁ బరితపించును. వత్సా! మనము క్షత్రియులము. మనహృదయమున భయమునకుఁ దావొసంగుట మిగుల లజ్జాకరమగు విషయము. విధివిధాన మెట్లున్నదియో యట్లే యగుఁగాక! భయపడి యసమర్థతను బ్రకటించుట యేల?

కుమారరామరాయ లిఁక నేమియు మాటాడఁజాలక వృద్ధ మహారాజు ననుసరించి పోవసాగెను. వా రనేకద్వారములను నిశ్శబ్దముగఁ నడచిపోయిరి పిమ్మట వారిరువురును బాగుగ నలంకరింపఁబడిన

శయనమందిరముల యొద్దకువచ్చి నిలువఁబడిరి. ఒక యంగరక్షకుఁ డప్పుడు వారియొద్దకు వచ్చిన సంభ్రమముగ " మహారాజా! ఈ మొదటి గది యువరాజుకొఱకు కలంకరింపఁబడినది " అనియెను. అప్పుడు మహారాజు మనుమనితో " వత్సా! బొమ్మ! శయనింపుము! సర్వమంగళ యగు జగన్మాత నిన్ను రక్షించుఁగాక! " అనియెను. రామరాయలు మహారాజును సమీపించి యతి మృదుస్వరముతో " మహారాజా! నగరునకుఁ బోవుటకు నా కనుజ్ఞ యొసంగుము " అనియెను.

మహా—ఇట్లు చేయుట తగదు.

యువ—కాని యీ యింట బరుండుటకు మాత్రము నన్ను నిర్బంధింపవలదు.

యువరాజు భీరుస్వభావుఁడనియు మృదులహృదయుఁడనియు మహారాజు బాగుగ నెఱుంగును. అతఁ డప్పుడు యువరాజు వీఁపుపైఁ దట్టుచు సత్యాదరముతో నవ్వుచు " నీకీ గృహమునఁ బరుండుటకే భయమైనయెడల నీవు నా గదిలో బరుండుము. ఆ గృహద్వారమునఁ బ్రతీహారులు కావలియుందురు. ఇఁక నీవు భయపడ నక్కఱలేదు. నేను నీకొఱకేర్పఱుపఁబడిన యీగదిలోఁ బరుండెదను " అనియెను. అప్పుడు రామరాయలు లజ్జితుఁడై " మహారాజా! భయములేదు. నా హృదయమునుండి భయమును బాఱద్రోలితివి. నేనీ మందిరముననే పరుండెదను " అనియెను. మహారాజు యువరాజు మాటకుఁ బ్రత్యుత్తర మీయకుండఁగనే వెనుకనున్న యంగరక్షకులం జూచి " మీరిఁక విశ్రమింపుఁడు! పొండు! యువరాజుతో నాకిప్పుడు రాజకార్యములం గూర్చి మాటాడవలసియున్నది. నేను తరువాతఁ బరుండెదను. ఇఁక మీరిక్కడ నుండనక్కఱలేదు " అనియెను. ఆజ్ఞానుసారముగ నంగరక్షకులు వెడలిపోయిరి. కేవల మిరువురు మాత్రము దూరముగనుండి రాజాజ్ఞానుసారముగఁ గావలిగాచుచుండిరి.

మహా—వత్సా! లెమ్ము! ఆ గృహమునకేఁగి పరుండుము?

యువ—మహారాజా! నేనీగృహముననే పరుండెదను!

మహా—వలదు—ఆయింటనే నీవు శయనింపవలయును—ఇది మహారాజాజ్ఞ! నేనిప్పుడు నీ యింటఁ బరుండెదను.

రామరాయ లిఁక నేమియు మాటాడక నసంభ్రమముగ నవనత మస్తకుఁడై నిశ్శబ్దముగఁ బోయి యా గృహమునఁ బ్రవేశించెను. అప్పుడు మహారాజు దూరముననున్న ప్రతీహారుల నిరువురను సమీపమునకుఁ బిలిచి "మీరా ద్వారమునఁ గావలియుండుఁడు! నా గృహ ద్వారమునం దుండనక్కఱలేదు" అని యాజ్ఞాపించెను. వారును నిశ్శబ్దముగఁ దలలువంచి రాజాజ్ఞను నిర్వహింప నేఁగిరి.

మహారాజు మెల్లమెల్లగ నా శయనమందిరమునఁ బ్రవేశించి నలుదెసల జాగరూకతతోఁ బరీక్షించెను. గవాక్షములన్నియును మూయబడియుండెను. ఇతరు లెవ్వరును లోపలఁ బ్రవేశించుట కెట్టి యవకాశమును లేదు. ఆగదికిఁ బార్శ్వమునం దింకొక గుమ్మమున్నది. దాని తలుపులకు వెలుపలనే గొళ్లెము వేయఁబడియుండెను. ఏమైననేమి—ఆ గృహ మధ్యమునం దెట్టి భయకారణమును లేదని యూహించి వృద్ధమహారాజు మెల్లమెల్లఁగఁ దల్పముపై శయనించెను. అప్పు డాతఁడు తనలో "భయకారణమేమియునులేదు—కాని భయమగుచున్నది! ఇప్పుడేదియో యొక భయానకకృత్యము జరుగనైయున్నదని భయమగుచున్నది! విధివిధాన మనిలంఘ్యము—దాని నెవ్వరడ్డగింపఁగలరు? ఒకవేళ మరణమే యైనచో నేను మరణించుట మంచిది—నేను వృద్ధుఁడనై యుంటిని—కుమారరాయలు మరణించినచో నిడుఁ బ్రోలురాజ్యమే పేరులేకుండ నశించిపోవును — అయ్యో! మరణవృత్తాంతము లేల తలంపునకు వచ్చుచున్నవి? ఎవ్వరు చంపుదురు? ఈ ప్రాసాద మధ్యమునకువచ్చి మమ్ములను జంపుట కెవ్వరితరము?" అని యీ విధముగ భావించుకొనుచు మహారాజు నిద్రాముద్రితుఁడయ్యెను.

## ఇరువదిమూఁడవ ప్రకరణము

వికలహృదయముతో నలువంకలఁ దిలకించుచు విజయరాయలు భయముతో శయనమందిరాభిముఖుఁడై పోవుచుండెను. అతని వెనువెంటనే యెవ్వరో యనుసరించి

వచ్చుచున్నట్లాతనికి బోధయగుచుండెను. ఆతనికర్ణములయం దడుగుల చప్పుడు వినవచ్చుచుండెను. కాని యిప్పుడు విడుఁద్రోలురాజ్య సేనాపతి భయముచే వెనుదిరిగిం చూచుటకు సాహసింపఁజాలకపోయెను. ఆతఁ డంధకారమునఁ గంపితుఁడై పోవుచుండెను—ఎట్టయెదుట మురళ—మురళ నాధునింజూచి "ఇదియేమి? మీరింత శీఘ్రముగ వచ్చినారేమి? మహారాజును యువరాజు నెక్కడ నున్నారు?" అనియెను. విజయరాయలు కంపితస్వరముతో మెల్లమెల్లఁగ "మురళా! ఈపని నావలన గాదు!" అనియెను. మురళ భర్తమాటవిని క్రోధోన్మత్తురాలయ్యెను. ఆమె కన్నులనుండి నిప్పులొలుకుచుండెను. కాని యామె యతికష్టముతో భావగోపనముం గావించుకొని 'ఏమి?' అనియెను.

విజ—ఏమియా? రామరాయలు నా యన్నకుమారుఁడు—అతఁడు నన్ను భక్తివిశ్వాసములతోఁ దండ్రివలెఁ జూచుకొనుచున్నాఁడు-అతనియెడ నొక్కదోషమును లేదు. సుగుణరాశి—అతఁడే విడుఁద్రోలు రాజ్యమునకు గౌరవస్వరూపుఁడు.

ముర—మీరు విడుఁద్రోలు రాజ్యమునకు సేనానాయకులుగా నుండుట కర్హులుకారు—రామరాయలు మహారాజయినచో మీరు సేవకులై యుండవలయును.

విజ—మురళా! కోపమువలదు—బాగుగా నాలోచింపుము—అతఁ డిప్పుడు మనయింటి యతిథి—

ముర—మీవంటి యసమర్థుని మొగము నేనింకఁ జూడఁజాలను.

ఇట్లు చెప్పి క్రోధగర్వితయగు మురళ యటనుండి వెడలిపోవుట కుద్యుక్తురాలయ్యెను. అప్పుడు విజయరాయలు సత్వరముగ నామె హస్తమును బట్టుకొని "మురళా! కేవల మదియే కారణముకాదు—నేనే మందిరవృత్తాంతమువలన విడుఁద్రోలుంరాజ్యాధిపత్యమునకై యాసించి యుంటినో, యా మందిరమునందలి మఱియొక వృత్తాంతమే నన్నిట్టి కార్యమునుండి నివారించుచున్నది. మురళా! ఆ బాలికామూర్తి యిక్కడకుఁగూడ వచ్చియున్నది—వేయిమాట లెందుకు? ఆమె రాజసభలో నాసమీపమునకుఁ గూడ వచ్చియున్నది—ఆమె చేతులలోనే నాకు మరణమున్నది" అనియెను.

మురళ— "కోయశ్యామలయా? దానికొఱ కింతభయ మెందులకు" అని యట్టహాసము చేయదొడంగెను. ఆ నవ్వులో గూఢభావము సన్న్యాపదేశము నసహ్యాభావమును మిశ్రితములై యుండెను. ఆ నవ్వువలన విజయరాయని హృదయమునం దెట్టి భావోదయమైనదో మేము చెప్పఁజాలము. అప్పుడాతఁడు "మురళా! నేనసమర్థుఁడనుగాన— మనుష్యుఁడేమి చేయుటకు సమర్థుఁడో యట్టివాని నన్నిటిని జేయుటకు నాకును సాహసమున్నది" అనియెను.

మురళ— అవును. మీ రెంతటి వీరులో నేనెఱుఁగకపోలేదు— ఒక సామాన్యోన్మాదిని భయమువలన నెల్లదిక్కులను భయంకర దృశ్యములనే కాంచుచుండు మీ వీరత్వమును నాకుఁ దెలియకపోలేదు.

విజ— ఆ యున్మాదిని చేతులలోనే నాకు మరణమున్నది.

మురళ— చావనిన నెంతభయము! మీ రెల్లన్ని యుద్ధములలో విజయములను సంపాదించితిరో యించుక నాకుఁ జెప్పఁగలరా?

విజ— మురళా! నీవు నన్నుఁ బిచ్చివానిం జేసితివై తువా?

ముర— ఏమి? నేనేవతెను-నామాటవలన మీకేమి నష్టమున్నది?

విజయరాయలు బంధింపఁబడిన గజముంబోలి విశృఙ్ఖలముగ నా గదిలోఁ దిరుగసాగెను. మురళ దూరమున నిలిచి ప్రజ్వలిత నయనములతో నాతనిఁ దదేకదృష్టితోఁ జూచుచుండెను.

కొంతసేపటి కామె మెల్లమెల్లఁగ నాతని యొద్దకువచ్చి "నాథా! మీకెంతమాత్రమును భయములేదు. మీరే విద్యాప్రోలురాజ్యమునకు మహారాజులయ్యెదరు. ఇప్పు డించుక మనసు దృఢపఱచుకొన్నచో మన మార్గమును నిష్కంటకముగఁ జేసికొనవచ్చును. ఇది యెంతపని? మీ రెంతమంది రక్తమును బ్రవహింపఁజేయలేదు!— ఇప్పుడు మీరు భయపడుచున్నారా? ఎన్నఁడును రక్తపాతమును గాంచియైన నెఱుంగని నేనుగూడ నీకార్యము ననాయాసముగఁ జేయగలుగుదునే!" అనియెను.

విజయరాయ లేమియును మాటాడలేదు. ఇటునిటు నాయింటఁ దిరుగసాగెను. అప్పుడు మరల మురళ పరమాదరముతో స్వామి హస్తమును బట్టుకొని "ఇంకను మీరా యున్మాదిని కొఱకు భయపడు

చుంటిరా యేమి ? ఆపిచ్చిది మన యంతఃపురమునకుగూడ వచ్చినది—నేనామెను సఖీగణమున కొప్పగించితిని. ఇంకను మీకా భయము వదల కున్నచో నామెను నిమిషములో జంపివైతును" అనియెను. విజయరాయ లప్లే తిరుగుచు నాకస్మికముగ నిలువఁబడి మురళ మొగమువంక నిరీక్షించుచు "ఏమంటివి? ఆబాలిక నీసఖుల నిర్బంధమునం దున్నదా?" అనియెను.

మురళ నవ్వుచు "నాథా! మీకుఁ గ్రమముగఁ జెవుడుకూడ వచ్చుచున్నదా?" అనియెను.

విజ—ఈరాత్రి యామె యక్కడనే యుండునా?

ముర—ఉండక యెక్కడకుఁ బోవును?

విజ—ఇది మంచిపనియే—ఆమెను సంహరించినచో నా భయమంతయును దీఱిపోవును. అప్పుడు నేను నిరాపాయుఁడనై యుందును. ఇక నా సింహాసనమున కంతరాయముం గూర్చువా రెవ్వరు నుండరు? కాదా? మురళా!

ముర—ఔను.

విజ—నేనీకార్యమును జేయుదును. రెండుపనులు నీరాత్రియే పూర్తి కావలయును. ఇఁక నీవు పొమ్ము; ఆమె యెట్లును దప్పించుకొని పాఱిపోకుండ జూచుకొనుచుండుము.

ముర—నాథా! ఇక నామె యెక్కడకుఁ బోవును?

విజ—అట్లయినచో నేను పోయెదను. జాగ్రత్తగ నుండుట మంచిది. నేను పోవుచుంటిని—ఈసరికి మహారాజును రామరాయలు గూడ నిదురించుచునే యుందురు

ముర—పొండు! పరమేశ్వరుఁడు మీ హృదయమునకు ధైర్యమును బ్రసాదించుఁగాక!

విజ—ఈశ్వరుఁ డెందులకు? ఈశ్వరుడిఁక లేఁడు. పిశాచములు వచ్చి యిప్పుడు నా హృదయమున నధిష్ఠించుగాక!

అని చెప్పుచు విజరాయ లున్మత్తునివలె నాస్థలమును వదలి పోయెను. గర్వాంధయగు మురళ కొంతసేపటివఱకు కచ్చటనే నిలువఁబడి

యేదియో యాలోచించుకొని " నాకు మీయెడల నమ్మకములేదు. కార్యము పూర్తియగు నంతవఱకును నేను మీ పార్శ్వమునందే యుండెదను. నేను దగ్గఱలేకున్నచో మీరు బాలకునికంటెను నధములగుదురు " అని చెప్పి మురళియు నాయిల్లు విడిచి పోయెను.

## ఇరువదినాలుగవ ప్రకరణము

రాత్రి నిశీథసమయము—రాజప్రాసాదమందంతటను గంభీర విస్తబ్ధభావము నెలకొని యుండెను. ఇంతకుఁబూర్వ మది యంతయు నానందకోలాహల ధ్వనులతో నిండియుండెను. ఇప్పుడట్టి వేమియును లేవు. ఎట్టి శబ్దమును లేదు. ఆ విస్తబ్ధభావమునకు భంగకరముగా దూరమునందలి ప్రతీహారుల పదశబ్దములు మాత్రము వినవచ్చుచుండెను.

అంధకారమునందు విజయరాయలు జాగరూకుఁడై యొకగది నుండి మఱియొక గదిలోనికి బోవుచుండెను. ఆకలిగొన్న సింగము కన్నులంబోలి యా విజయరాయనికన్నులా యంధకారమునఁ బ్రజ్వలితము లగుచుండెను. అతని హస్తమున నిశితకరవాలము విరాజిల్లుచుండెను. అతని మొగము దుర్నిరీక్షమై యుండెను. ప్రపంచమునందలి భయభావము లన్నియు నాతని వికృతవదనమున సమావేశితములైనట్లుండెను—ఆకస్మికముగ నాతఁడు స్తంభితుఁడై పోయెను. అతని నఖశిఖపర్యంతమును సుడిగాలికిం దూలు రావియాకుం బోలి ప్రకంపితమై పోవుచుండెను. అతని యొడలంతయును గగుర్పొడిచెను. అతని కన్నులు ప్రజ్వలించిపోవుచుండెను; హృదయము దడదడఁ గొట్టుకొనిపోవుచుండెను.

అప్పు డాతఁడు కంపితస్వరముతోఁ దనలో '' ఇదియే యా కృపాణము—ఇఁక భయములేదు! విజయరాయని హృదయమున భయమను మాటయేలేదు—మరల నిదియేమి? సరిగ నాకన్నులపైఁ గరవాలము నృత్యము సేయుచున్నదేమి? రమ్ము! రమ్ము. నీమూలముననే నా యభీష్టమును సిద్ధింపఁ జేసికొందును. ఏమిది! పట్టుకొనఁ బోయిన దొరకకున్న

దేమి? ఇట్టి నేనూ గూడ నసమర్థునివలె—బాలకునివలె—శిశువువలె నలువంకలను భయదృశ్యములనే కాంచుచుంటి నేమి? ఇఁక నేనట్టి భయమునకు లోఁబడిపోను—ఇఁక నావిజయరాయలనుగాను—విజయ రాయ లిప్పుడు రాక్షసుఁడై పోయినాఁడు—మహారాజగుట కీతఁ డీఁక రామరాయశతసహస్రముల నైనను నిష్కారుణముగ హత్య గావింపఁ గలఁడు—" అని యనుకొనుచుఁ బిశాచమువలె ద్రుతపదవిక్షేపముతో నతిజాగరూకుఁడై రామరాయుల శయనగృహాభిముఖుఁడై పోవుచుండెను

ఎదుట ద్వారము—ఆద్వారము తెఱచినచో నావెనుకనే శయన మందిర ముండెను. అక్కడ రామరాయలు నిశ్చింతుఁడై నిద్రించు చుండెను. పినతండ్రి యింట నాతనికి భయమేమి యున్నది? ద్వార సమ్ముఖమున నిలిచియున్న విజయరాయని కాతని నిశ్వాస ప్రశ్వాసములు వినవచ్చుచుండెను విజయరాయలు తలుపులను దెఱచి చూచెను. గదిలోని దీపము మినుకుమినుకు మనుచుండెను—ఆ వెలుతురునం దంధకారము కూడ మిశ్రితమై విలక్షణచ్ఛాయామయమై యుండెను. అందువలన నచ్చటి వస్తువులన్నియు విలక్షణముగ గానవచ్చుచుండెను—పర్యం కముపై నాపాదమస్తకమును ముసుఁగువైచుకొని రామరాయలు నిద్రించుచున్నట్లాతఁడు కనుఁగొనియెను—విజయరాయలు నిలువఁబడి పిడికిటనున్న కృపాణమును మఱింతదృఢముగ బట్టుకొనియెను— ఆ యవస్థలో నాతని మనోబలము మెల్లమెల్లగ దిగజారిపోవ నారం భించెను—ఏమని హత్యగావించును?—ఆతఁ డుత్తమ క్షత్రియుడు!— వీరశేఖరుడు!—విద్యానగర రాజ్య సేనానాయకుడు!—అట్టివాడు ఘోరకా పురుషునింబోలి నిద్రించుచున్న తన సోదరపుత్రుని వక్షముపై దారుణ కృపాణము నెట్లు ప్రయోగింపఁగలుగును? ఎంతటి పరమనీచుఁడైనను మఱియెంతటి ఘాతుకుఁడైనను నిట్టి క్రూరకార్యమును జేయుటకు సంశయింపక మానఁడు—

ఇట్టి పాపకార్యము నాతఁ డేఘాతుకుని మూలముననైనఁ జేయింప వచ్చును; కాని యందువలన నెప్పటికైనను బాపము బయలుపడక మానదు-ఇట్టి మహోత్సవదినమున దానే స్వయముగ దన భ్రాతృపుత్రుని- పుత్రసమానుని విజయరాయుడు హత్యగావించునని యెవ్వరనుకొందురు?

ఒకవేళ నెట్లయిన నిది ఘాతుకులచే జేయింపబడి బయలుపడుటయే తటస్థించినయెడల రాజ్యమునందలి పిన్నపెద్ద లెవ్వరును విజయరాయని యధికారమున లోబడియుండుట కంగీకరింపజాలరు—అందువలన విజయ రాయనికి రాజసింహాసనము లభియించుట యసంభవమైపోవును. ఇంక నిట్టి క్రూరకార్యమును విజయరాయలు స్వహస్తములతో జేయవలసినదే గాని యన్యోపాయ మేమియునులేదు.

విజయరాయలు కృపాణమును దృఢముగఁ బట్టుకొనియెను—అప్పుడే యీనినపులి యాకలిగొని తినివేయుటకుఁ దన పిల్లవైపు నోరు తెఱచుకొని యెట్లుచూచునో యట్లే విజయరాయలు శయనించియున్న కుమారునివంక వీక్షింపసాగెను. అప్పటికిని రామరాయలు గాఢనిద్రావస్థ యందున్నట్లు విజయరాయలు గ్రహించెను—నిశ్వాస ప్రశ్వాసశబ్దము తక్క నాతనికిక నేమియు వినబడుటలేదు. కాని యాతఁ డాగృహమున బ్రవేశించుటకు సాహసింపజాలకపోయెను. అకస్మికముగ నాతడు స్తంభితుడై తనలో "నేను చేయఁజాలను—ఈ దారుణకృత్యము నేను చేయఁజాలను!—రాజసింహాసనముతో నాకుఁ బనిలేదు—" అని యనుకొనుచు శీఘ్రముగ నటనుండి వెడలి పోయెను.

## ఇరువదియైదవ ప్రకరణము

అట్లు పోవుచున్న విజయరాయని నడ్డగించి త్రోవలో నెవ్వరో యాతని హస్తమును బట్టుకొనిరి—అంతలో విజయరాయ లదరిపడి మెగమెత్తి చూచెను—పార్శ్వమున మురళ!—కాలసర్పమువలె మురళహస్త మాతనిచేతికి జల్లగఁ దగిలెను—లావణ్యమయియగు మురళంగాంచి విజయరాయలు ఘోరరాక్షసిం గాంచినట్లదరిపడియెను—స్తంభితుడై పోయెను.

'కార్యసిద్ధి యైనదా?' అని మురళ మెల్లగ నడిగెను. ఆ స్వరము కాలసర్పనిశ్వాసమువలె నాతనిచెవుల బడియెను. అప్పు డాతఁడదరిపడి కొన్నియడుగులు వెనుకకువైచి నిలువబడియెను.

అప్పుడు మురళి "మాటాడవేమి ? చెప్పుడు ! కార్యము పూర్తి యైనదా ?" అనియెను. విజయరాయని కంఠమునుండి యెట్టిశబ్దమును వెలువడలేదు. ఆతని కంఠతాలువులు శుష్కించిపోయెను. అతికష్టముతో నాతడు 'లేదు' అనియెను.

క్రోధావేగముతో మురళి భయంకరస్వరూపిణి యయ్యెను. ఆమె కన్నులనుండి యగ్నిస్ఫులింగములు వెడలుచుండెను. ఆమె సర్వాంగకములును నతికఠినములై పోయెను. అప్పుడామె విజయరాయని హస్తమునుండి కరవాలమును బలవంతముగ లాగికొని యున్మాదినివలె రామరాయల శయనమందిరాభిముఖియై బయలుదేఱెను. ఆమె కేశపాశము విడివడి యంగకములపై నావరించుకొనియెను. ఆమె పైటజాఱి నేలపై జీరాడుచుండెను. విస్ఫారితనయనయు, విస్ఫీతనాసికయు, సమున్నతవక్షోభాగయునగు నామె యప్పటి భయంకరరూపము వర్ణనాతీతముగా నుండెను.

పరుగెత్తుకొనిపోయి విజయరాయలు మురళిహస్తమును బట్టుకొని "మురళీ ! నేను నిన్ను రాక్షసిగాఁ జేయజాలను; నీ హస్తములను శోణితరంజితములు గానీయను—లెమ్ము కత్తినిటు తెమ్ము ! మురళీ ! ఇఁక భయములేదు" అనిచెప్పి మురళిహస్తమునందలి కృపాణమును దీసికొని మరల నా శయనమందిరమునకుఁ బోయెను. అతఁడిక నేవంకకును జూచుటలేదు. అతివేగముగ బర్యంకపార్శ్వమునకుఁబోయి విలువబడియెను. కుమారరాయ లాపాదమస్తకమును ముసుగువైచుకొని నిద్రించుచున్నాడని నిశ్చయించి విజయరాయలు సరిగ నాతని వక్షమును గుఱిచేసి బలవంతముగ గరవాలముచే బొడిచెను. అప్పుడొక శబ్దమయ్యెను—మరల నంతట నిశ్శబ్దమయ్యెను.

అప్పుడు విజయరాయలు పొడిచినకత్తిని బైకిలాగెను. దాని వెంటనే చిమ్మనగ్రోవినుండియుంబోలె బాణవేగమున రక్తము జిల్లునఁ బ్రవహించెను. అతని ముఖమును వక్షమును హస్తములును గూడ రక్తసిక్తములైపోయెను. అప్పుడాతడు నలువంకలను మహానలజ్వాలలఁ గనుగొనియెను—ఆ భయంకరాగ్ని జ్వాలాంతరాళమున నా బాలికామూర్తి

నృత్యము చేయుచు గృపాణపాణియై తనపైకి నవ్వుచు నవ్వుచు వచ్చి పడుచున్న ట్లాతనికిఁ దోచెను. అప్పుడాతఁడటనుండి ప్రాణభయముచే నొక్కపరుగున బాఱిపోయెను.

వెలుపల మురళి యాతనికొఱకు నిరీక్షించుచుండెను—తన పార్శ్వములనుండియే విజయరాయలు పాఱిపోవుచుండుటగాంచి యామె యాతని హస్తముంబట్టుకొని "ఆఁగుడు; భయపడవలదు-పనియంతయు బూర్తియైనదిగద? నేనొకసారి చూచివచ్చెదను" అనియెను.

విజ—వలదు వలదు! నీవు పోవలదు.

ముర—మీరాడుదానికంటె నన్యాయముగ నగపడుచున్నారేమి?

అట్లనుచు మురళి మెల్లమెల్లగ నా గృహమధ్యమున బ్రవేశించి యతివేగముగ నా పర్యంకమునొద్దకు బోయెను. రామరాయలు మరణించి నదియు లేనిదియు జూడవలయునని యామె మెల్లమెల్లగ నాతనితలపైనున్న ముసుగును దొలగించి చూచెను. ఆకస్మిక శరాఘాతముచే నెగసిపడు హరిణాంగనంబోలి మురళి భయవికృతవదనయై తూలిపోయెను. అంతలో నొక్కయెదుటున నా పర్యంకమునకు దూరముగబోయి నిలువబడియెను. కొన్ని నిమిషములవఱకు నామెకుఁ జైతన్యమే లేదు. కాని కొంచెసేపటిలో నామె తెలివిదెచ్చుకొని సత్వరముగ నాగదిని విడిచి పోయెను. వెలుపల విజయరాయలు కొయ్యబొమ్మవలె నిలువఁబడియుండెను. ఒకయడుగైన నొంటిగ ముందఱకుఁ బోవుట కాతనికి సాహసము లేకుండబోయెను. మురళి యాతని సమీపించి "రండు! అనియెను. విశ్శబ్దముగ విజయరాయలు మురళి ననుసరించిపోయెను. ఇరువురును మెల్లమెల్లగ దమ శయనగృహమునఁ బ్రవేశించిరి. అప్పుడు మురళి యాతనింజూచి "ఇంకను మనపనులన్నియు బూర్తికాలేదు" అనియెను.

—ఔను! నేను నదియే చూచుచున్నాను. ఆ పిచ్చిదానినిఁగూడ దుదముట్టింతమా! ఆపనియు నిప్పుడే కావలయును.

ముర—అట్లుకాదు. మీరంతయును ధ్వంసముచేసి వచ్చితిరి. రామరాయలు మరణింపలేదు.

విజ—రామరాయలు మరణింపలేదా ?—ఏమది !

ముర—ఔను. ఆతడు చావలేదు—ఇఁక నివ్వు డాతనిఁ జంప వలయును. ఆతడు మరణించినచో నుదయమునకు మీరే మహారాజు లగుదురు.

విజ—రామరాయలు మరణింపలేదా ? అట్లయినచో నేనెవ్వరిని జంపితిని !

ముర—మహారాజును—

"ఎంతదారుణము ! పితృహత్యయా !" అనుమాట లస్పష్ట స్వరముతో విజయరాయని వదనమునుండి వెలువడియెను. తోడనే యాతడు మూర్ఛితుడై నిలువున గూలఁబడియెను. అప్పుడు మురళ స్వయముగ ఛురికాపాణియై "అప్రయోజిక విగ్రహమా ! చూచుట కసహ్యమగుచున్నది-పోనిమ్ము-నేనే యా కార్యమును దుదముట్టింతును-నే నాఁడుదాననై తినేమి ? నేనే పురుషుఁడనైనచో నీ పిదుగ్రోలు రాజ్యమున కనాయాసముగ మహారాజును గాఁగలుగుదునే !" అని యనుకొనుచు నారాక్షసి యా మందిరమునుండి యవ్వలకుఁబోయెను.

## ఇరువదియాఱవ ప్రకరణము

సరళ దుఃఖవ్యాకులిత హృదయయై నిదురించుచుండఁగా రామరాయలు మహోత్సవదర్శనమునకుఁ బోయియుండెను. కాని యా వెంటనే యామె భయముతోఁ గన్నులఁదెఱచిచూచెను. అప్పుడు తనప్రక్కను రామరాయలు లేకుండుటచే భీతకురంగివలె సంభ్రమముతో స్వామిని వెదక నారంభించెను. కాని భర్త యగపడలేదు. సఖులువచ్చి యామె నూరడించుచుండిరి. అయినను సరళకన్నీ రాగుటలేదు. ఆమె నయనద్వయమునుండియు నవిరళాశ్రుధారలు ప్రవహించుచుండెను. ఆకన్నీటిచే నామె వక్షస్థల మంతయు దడిసిపోయెను.

ఎంత ప్రబోధించినను నెంత యూరడించినను సరళ తన హృదయ శోక తరంగముల నడఁగించుకొనఁ జాలకపోయెను. ఆమె వకుళ

కంఠమును బట్టుకొని యేడ్చుచు నేడ్చుచు "సఖీ! మాయత్త నన్నుఁ బిలిచినదికాదు!—ఆమె తన యానందోత్సవములలో నన్ను మఱచి పోయినది కాబోలును!—అందుకొఱకు నేనేడ్చుటలేదు! నేనెందుల కేడ్చుచుంటినో చెప్పజాలను. సఖీ! సఖీ! నాకేమి కానున్నదో?" అనియెను.

వకుళ పరమానందముతో సరళకన్నీటిని దుడుచుచు "ఏమిచెలీ! ఇంత యధైర్యపడియెదవు? ఎందులకు దుఃఖించెదవు?—యువరా జిప్పుడే రాఁగలఁడు" అనియెను. సరళ సఖీవక్షముపై వదనము నాను కొని "వకుళా! ఇఁక నేను నాస్వామిని జూఁడజాలనని నా మనసులో నేమో కళవళమగుచున్నది! ఇట్లెందుల కగుచున్నదో తెలియుటలేదు" అనియెను.

వకు—సఖీ! అతఁడు నిన్ను విడిచి యెన్నిసారులు దూరప్రయాణములు చేయలేదు! అప్పు డెన్నడైన నీవింతగా విచారించితివా!

సర—చెలీ! ఏమోకాని నామన సెన్నఁడు నింతగ బరితపింప లేదు—ఇప్పుడాయన యచ్చటకుఁ బోకుండిన బాగుగ నుండును.

వకు—నీవు వ్యర్థముగ భయపడుచున్నావు. అతఁ డిప్పుడే వచ్చును.

ఆసమయమున నొకదాసి యచ్చటకువచ్చి "రాజకుమారీ! నీదర్శనమునకై యెవ్వరో యొకబాలిక వచ్చియున్నది" అనియెను.

సరళ యాదాసిమాట బాగుగ గ్రహింపలేదు. వ్యాకుల నయనములతో నామెవంకఁ జూడసాగెను. అప్పుడు వకుళ దాసిం జూచి "ఆ బాలిక యెవ్వరు? ఇంతరాత్రివేళ రాజకుమారి నామె కేమిపని యున్నది?" అని యడిగెను.

దాసి—మేమామె నీమాటయే యడుగగా—ఆ విషయ మితరులతోఁ జెప్పరాదనియు, రాజకుమారి యెదుటనె చెప్పవలయుననియు జెప్పినది. అప్పుడు మేమామెతో నిప్పుడు రాజకుమారి యస్వస్థతగా నున్నదనియు నెవ్వరితోడను మాటాడదనియు నెట్టి మాటలను వినఁజాలదనియుఁ జెప్పితిమి.

సరళ వకుళంజూచి "సఖీ! ఆమె యెవ్వరు?" అనియెను.

వకు—అంత భయముతో నడుగుచున్నావేమి? భయములేదు. ఆమె నిచ్చటకుఁ బిలిపింతునా?

సర—పిలువుము!

ఆమెను దీసికొని వచ్చుటకై దాసి వెడలిపోయెను. అప్పుడు సరళ వకుళచుబుకమును బట్టుకొని "చెలీ! ఇప్పుడేదో జరుగనై యున్నది. నా మనసు దిగులుపడుచున్నది. నేనిఁక సహింపఁజాలను" అనియెను.

వకు—సఖీ! ఇంచుక మనసు కుదురుపఱచుకొనుము; అన్యుల యెదుటగూడ నిట్లుండుట బాగుగనుండునా? మీయత్తగారు నీకొఱకు వార్తనంపియుండలేదు—నీతో ననేకపర్యాయములు కలహించియున్నది—అందువలననే నీమనసు పరిపరివిధముల బరితపించుచున్నది—నెమ్మది పడుము! అధైర్యపడవలసిన పనిలేదు. ఊరకుండుము! అదిగో! ఆబాలిక వచ్చుచున్నది.

అతికష్టముతో సరళ కన్నీటి నాపుకొని చేలాంచలముచే గన్నులఁ దుడుచుకొనియెను. అంతలో నడుగులచప్పుడు నాలకించి యావంకఁ జూచెను. దానితోఁగూడ నొకబాలిక వచ్చుచుండెను. ఆమెరూప మపూర్వమైనది; వేష మపరూపమైనది—ఆజానులంబిక కేశదామ మామె వెన్నున విడివడియుండెను. ఆమె గైరికవసనధారిణియై యుండెను. గళమున రుద్రాక్షమాలయుఁ గపోలములఁ గుంకుమరేఖలును, వామహస్తమునఁ గమండలువును, దక్షిణహస్తమునఁ ద్రిశూలమును నామె ధరించి యుండెను. కైలాసవాహినియగు సర్వమంగళాదేవి కైలాసమును విడిచి భూలోకమున నవతరించినట్లామె యగపడుచుండెను. అకస్మికముగ నామెంజూచి సరళ కొయ్యయైపోయెను—ఆమె కన్నులు చలించుటలేదు—ఆమె సర్వాంగములు నవసన్నములైపోయెను. ఆమె యుచ్ఛ్వాస నిశ్వాసము లాగిపోయెను. ఆమె విస్ఫారిత నయనములతోఁ దదేకదృష్టి నా సన్యాసివంకనే చూచుచుండెను.

సన్యాసినియగు బాలిక మెల్లమెల్లగ సరళయొద్దకువచ్చి నిలిచెను. తోడనే యామె యేదియో చెప్పబోవుచుండగా నంతలో సరళ వకుళను గౌఁగిలించుకొని యామె హృదయమున మెగముంచి "సఖీ! నన్నుఁ బట్టుకొనుము! సఖీ! ఆస్వప్నము—నీకెన్నిసారులో చెప్పితిని—నేను మహారాజ్ఞినిగాను—ఈమెయే మహారాజ్ఞీమణి యగును—అదియే—యిది—" అని చెప్పుచు సరళ చటాలునలేచి సన్యాసిని పాదములపైఁ బడి కాతరస్వరముతో "నీవే యగుము! నిడుఁద్రోలు రాజ్యమునకు మహారాజ్ఞీమణివి నీవే యగుము! రాణిని గావలయునని నేనెప్పుడు కోరుకొనుటలేదు. నా స్వామినిమాత్రము నాయొద్ద నుంచుము—తీసుకొని పోవలదు—తీసుకొని పోకుము! తీసుకొని పోయినచో నేనిఁక బ్రదుక జాలను" అనియెను.

సన్యాసినియు వకుళయును సత్వరముగ సరళను లేవనెత్తిరి. కాని యామె మూర్ఛితయై పోయెను.

## ఇరువదియేడవ ప్రకరణము

ఆ యిరువురును సరళను బట్టుకొని తీసుకొని పోయి పర్యంకముపై బరుండబెట్టిరి. వకుళ యుపచారములను జేయుచుండెను. అప్పుడు సన్యాసిని తన కమండలు జలంబుల నామె మొగమునఁ జల్లుచుండెను. వకుళ దాసదాసీజనంబులను సఖులను బిలువదొడంగెను. కాని సన్యాసిని యామెను వారించి "మరేమియును భయములేదు నీవు తొందరపడవలదు. నేనింతలో నీమెను సేదదేర్చెదను" అనియెను.

అప్పుడు సరళ కన్నులువిచ్చి చకితదృష్టితో నలువంకలఁ గనుఁ గొనియెను. అంతట సన్యాసిని "రాజకుమారీ! నేను నీస్వామిని దీసికొని పోవుటకు రాలేదు. నీసొత్తును నీకిచ్చుటకై వచ్చితిని—అతఁ డిప్పుడు చాల విపత్తులో నున్నాఁడు! అతని ప్రాణములఁ దీయుటకై పాపాత్ములు కొందఱు సంకల్పించుకొని యున్నాడు. ఏ యుపాయముచేనైన నిప్పు డాతని రక్షింపవలయును" అనియెను.

ఆమాటలువిని సరళ వ్యాకులభావముతో సన్యాసిని రెండుచేతులను బట్టుకొని "ఏమగుచున్నది ? పద ! నేనుగూడ వచ్చెదను" అనియెను.

సన్యా—నీవు వచ్చి యాతని రక్షింపఁగలవా ?

సర—ఏమి చేయుదును ?

సన్యా—ఎట్లయిన నాతని విజయరాయని ప్రాసాదమునుండి యిప్పుడే తప్పింపవలయును.

సర—పద ! పద ! నేనాతని రమ్మని పిలిచెదను—ఆయన నిశ్చయముగ నా విన్నపమును మన్నించును.

సన్యా—అతఁడు క్షత్రియవీరుఁడు—విడుఁగ్రోలు రాజ్యమునకు యువరాజు—మృత్యువును జూచియైనను భయపడి పలాయితుఁడు కాఁజాలఁడు—అతఁడిట్టి విషయములలోఁ బరులమాటల నాలకించు వాఁడుకాఁడు—వచ్చి నీవేమి చేయఁగలవు ?

సరళ వకుళను గౌగిలించుకొని యేడ్చుచు నేడ్చుచు "సఖీ ! ఇఁక జేయవలసిన దేమున్నది ?" అనియెను.

సన్యా—నీవేదైన నానవాలిచ్చినచో బోయి యాతనికి జూపుదును. అప్పు డాతఁడు శీఘ్రముగ విజయరాయని ప్రాసాదమును విడిచి వచ్చును-నేనందుకొఱకే నీయొద్దకు వచ్చితిని—ఆనవాలేదైన నిమ్ము !

సర—ఏమీయవలయును ? నీకేమి కావలయును ?

సన్యా—నీచేతి యా యుంగరమును నాకిమ్ము. అతఁడు దానిని బాగుగ గ్రహింపఁగలడు.

సరళ మాఱుమాటాడకుండ నతిత్వరితముగ సన్యాసికిఁ దన యుంగరమును నొసంగెను—ఆమెయు నా యుంగరమును దీసికొని యతివేగముగ నా ప్రాసాదమును విడిచిపోయెను. అప్పుడు రాజప్రాసాద మున కించుకదూరమునఁ ద్రోవప్రక్క నంధకారములో నొకవ్యక్తి యెవ్వరికొఱకో ప్రతీక్షించుచు నిలువబడియుండెను. సన్యాసిని యావ్యక్తి యొద్దకువచ్చి నిలిచెను. అప్పు డావ్యక్తి 'అయినదా ?' అని ప్రశ్నించెను. "అయినది ! ఇదిగో !" అని యా సన్యాసిని ప్రత్యుత్తర మొసంగెను.

వ్యక్తి—ఇప్పటికిఁ గార్యము పూర్తియైనట్లే—

సన్యా—తండ్రీ! నాకిఁక నిడుద్రోలురాజ్యమునకు మహారాజ్ఞి నగుట కిచ్ఛలేదు.

వ్యక్తి—అదియేమి ?

సన్యా—రాజకుమారియగు సరళం జూచినతోడనే నాకాకోరిక వదలిపోయినది. నేనింతవఱకును మీ యానతిని శిరసావహించుచుంటిని. ఈ విషయమునమాత్ర మట్లు చేయఁజాలను.

వ్యక్తి—పదునాలుగేండ్ల నా ప్రయత్నమంతయు నీవిధముగఁ బాడుచేయుదువా ? బిడ్డా! తుదకు నీవు చేయఁదలఁచుకొన్న దిదియా ?

సన్యా—మీ యాజ్ఞ లన్నియుఁ బ్రతిపాలించెదను — సరళ హృదయమునుండి స్వామిని విడదీయఁజాలను.

వ్యక్తి—పరముకొఱకు—దేశముకొఱకు—ప్రతీకారముకొఱకు—సుఖముకొఱకు—నాకొఱకు—అంతయుఁ జేసితీరవలయును.

సన్యా—తండ్రీ! నిరర్థకముగ నాకిట్టి ప్రలోభముం గల్పింప వలదు. ప్రేమసన్నిధానమున రాజ్యసుఖమును, ధర్మకర్మములును నెంతపాటివి ? మీయొద్ద దాఁచుట యెందులకు ?—మూఁడు సంవత్సరములక్రిందట నొకనాఁడు నాకు యువరాజుంజూపి యాతఁడే విడుద్రోలు రాజ్యమునకు భావిమహారాజు కాఁగలడని మీరు చెప్పియుంటిరికాదా ? ఆదినమునుండియు నేనామూర్తిని నా హృదయములోని హృదయమున నిలుపుకొని యారాధించుచున్నదానను. నాకును గోరికయున్నది. అయినను దానినిప్పుడు ద్రోసివైచితిని—నాకంటెను బ్రేమార్హపాత్రమును నిడుద్రోలురాజ్యమునకు మహారాజ్ఞీమణిం జేయుటకై చేతనైనంత ప్రయత్నముచేసి చూచెదను.

ఆవ్యక్తి నిశ్శబ్దముగ నిలువఁబడి యా సన్యాసిని భావోద్దీప్త వచనంబుల నాలకించుచుండెను. ఏమియు మాటాడలేదు. సన్యాసిని యిఁక నూరకుండుటంజూచి యప్పుడావ్యక్తి "నీయిష్టమువచ్చినట్లు చేయుము. ఇప్పుడు రామరాయల ప్రాణరక్షణముం గావింపవలయును" అనియెను.

సన్యా—ఆతని ప్రాణరక్షణముచేసెదనని రాజకుమారి కిప్పుడే మాటయిచ్చి వచ్చితిని.

వ్యక్తి—అట్లయినచో నింక నాలస్యము చేయవలదు.

ఆ సంభాషణానంతరమున నిరువురును విజయరాయల ప్రాసాదాభిముఖులై వెడలిపోయిరి.

## ఇరువదియొనిమిదవ ప్రకరణము

మంత్రికుమారుఁడగు విద్యాధరుడు సరళ తండ్రి. అంతియకాక చిన్నతనమునుండియు రామరాయ లాతనిఁ బ్రాణములకంటె నెక్కుడుగఁ బ్రేమించుచుండెను. విజయరాయని ప్రాసాదమునం జరిగిన దారుణకృత్యము విద్యాధరునకు ప్రథమముననే తెలియవచ్చెను. మురళి సఖియగు కమలయు మురళియు విద్యాధరుఁడును జిన్నతనమునుండియు నొకచోఁబెఱిగినవారు. విశేషించి కమలకు విద్యాధరుఁడన్న నెంతయో గౌరవము—ఎంతయో సోదర ప్రేమ! విద్యాధరుఁడుకూడ నామెను దన సోదరికంటె నెక్కుడుగఁ బ్రేమించుచుండెను. మురళి పడకటింటి ప్రక్కగదిలోనే కమల శయనించుచుండును. మురళా విజయరాయల సంభాషణములవలన నారాత్రి యామెకు నిద్రాభంగమయ్యెను. ఇంతరాత్రివేళ వారేమి మాటాడుకొనుచున్నారో వినవలయునని యామె యా ద్వారమునొద్దకుఁ బోయి చెవులొగ్గి వినుచుండెను. ఆమాటలు విన్నతో యామె కొయ్యయై పోయెను—కాని యంతలో దెలివి దెచ్చుకొని విద్యాధరుని యింటికిఁబోయి యాతని శయనమందిరద్వారమునొద్ద నిలువబడియెను. ఆ గృహద్వారము లోపల బంధింపబడి యుండలేదు. అందుచే నామె యనాయాసముగ లోపలఁ బ్రవేశించెను. లోపల దీపము వెలుగుచుండెను. అప్పుడు కమల మెల్లగ నాతని సమీపించి చేతులతోఁదట్టిలేపెను. విద్యాధరుఁ డులికిపడి లేచి యట్టి యసమయమున దన పడకటింటికి వచ్చియున్న కమలం జూచి యదరిపడి "ఏమి కమలా! ఇంతరాత్రివేళ వచ్చితివి?" అని యడిగెను.

కమల గద్గదస్వరముతో "అతి దారుణకృత్యము జరగిపోయినది! విజయరాయలు మహారాజును హత్య గావించినాఁడు—ఇఁక రామరాయలు కూడ నాతనిచేతులలోఁ బడిపోవును—నీవిప్పుడేపోయి రామరాయల నా ప్రాసాదమునుండి తప్పింపుము! రామరాయల ప్రాణముల నెట్లయిన కాపాడుటకై ప్రయత్నింపుము. ఇక నేనిచ్చట నుండగూడదు" అని చెప్పి కమల సత్వరముగ వెడలిపోయెను. విద్యాధరుఁడు చటాలునలేచి దుస్తులను దొడిగికొని రామరాయలు శయనించియున్న గదియొద్దకుఁ బోయెను. అచ్చట ద్వారపాలకులులేరు. నలుదెసలను రక్తచిహ్నము లగపడుచుండెను. ఆతడు మందిరమున బ్రవేశించిచూచెను. ఆకస్మికముగ నప్పుడాతఁ డెట్లయ్యెనో వర్ణింపజాలము. అతఁ డాయింటినుండి వెడలి ప్రక్కగదిలోనికిఁబోయి చూచెను. రామరాయ లచ్చటనులేడు—ఆ గృహముకూడ రక్తచిహ్నితమైయుండెను. ఆతడు వెనుకకుమరలెను; కాని ద్వారమునొద్ద స్తంభితుఁడై పోయెను. అప్పుడు విద్యాధరుఁడు తనలో "నేనిప్పు డీయింటినుండి వచ్చుచున్న ట్లెవ్వరైన జూచినచో నేనే మహారాజును జంపినట్లు సందేహింపగలరు. కావున నేనిప్పుడీ గవాక్షద్వారమునుండి యవ్వలకుఁ బోయెదను. రామరాయల కీవృత్తాంత మెట్లో తెలియుటచే నాతడు ముందుగనే యీ ప్రాసాదమును విడిచి తన మందిరమునకుఁ బోయినను బోయియుండవచ్చును. నేనిప్పుడే యాతని యొద్దకుబోయి యీ భయంకరవృత్తాంతమును దెలియజేసెదను—తన మందిరములోఁ దండ్రినే చంపుకొన్న విజయరాయలు రామరాయలను గూడ జంపఁదలచి యుండెననుటలో వింతయేమున్నది!" అని భావించు కొనియెను.

అతని మనసు మనసులోలేదు. ఈ ప్రపంచమంతయు దలక్రిందై పోవుచున్నట్లుండెను. "ఎంతటి దారుణకృత్యము! ఎంతసాహసము! ఈ మహామారణతంత్రమున రామరాయలుకూడఁ బడిపోలేదుగద! ఆ యిల్లంతయు—ఆ పర్యంకమంతయు రక్తసిక్తమై యున్నదే! రామ రాయలు కూడ హత్యకావింపబడినచో నాతని మృతకళేబరము కూడ నచ్చట నుండదా?—ఏమో! ఆ నరపిశాచముల క్రూరకృత్యములయం

దెట్టి రహస్యములున్నవో? విదుద్రోలు రాజ్యసింహాసన మీ విధముగ నాశనమైపోయినదా? ఈ మహారాజ్యలక్ష్మి యీవిధముగ రక్తవాహినులలో నీదుకొని పోవుచున్నదా? ఛీఛీ! విజయరాయా! మహావీరుఁడ వనిపించుకొన్న నీకు నిదురించుచున్న తండ్రిని గుమారుని ఛురకాని హతులం జేయుటయే శూరకృత్యముగాఁ దోచినదా? అఁడుదాని మోహ జాలములం బడిపోయినవాని కిఁక వివేక మెక్కడిది?—పాపభీతి యెక్కడిది? ఏ విషయమునందును యువరాజు నీకడ్డమురాలేదే! మహారాజు నీకింతటిగౌరవ మొసంగినందులకుఁ బితృఋణము బాగుగనే తీర్చుకొంటివి! ధర్మము విజితమైపోయినది—దైవము విపరీతమై పోయినది—విధివిధాన మిట్లే యున్నదికాఁబోలును—హా! ఇక సరళ నేమని యూరడింపగలను? ఒకవేళ రామరాయలు—కానిమ్ము! కడసారి యొకసారిపోయి చూచెదను—ఏమైన నేమి చేయఁగలను!" అని యీ విధమగు నాలోచనాపరంపర లాతని హృదయమునం దొక్క-నిమిషములో బరివర్తితములై పోయెను. అతఁ డధికావేగముతో గవాక్ష ద్వారమునుండి యవ్వలకుఁబోయి సత్వరముగ నొక గుఱ్ఱమునెక్కి-వాయువేగముతో మహారాజ ప్రాసాదాభిముఖుఁడై పోయెను.

## ఇరువదితొమ్మిదవ ప్రకరణము

రాత్రియంతయును సరళకు నిద్రపట్టుటలేదు. ఆమె యురిలోఁ దగులుకొన్న విహంగివలెఁ గొట్టుకొనుచుండెను. ఆకస్మికముగ నవ్వల నేదియో యడుగులచప్పుడు వినవచ్చుటచే నామె యావంకఁ దిలకించెను. తోడనే యామె యాదిక్కునకు బరుగెత్తెను. స్వామిపదశబ్దము నామె బాగుగ గుర్తింపగలదు. చటాలున నెదురుగఁబోయి సరళ భర్తను గౌగిలించుకొనియెను; ఇఁక హృదయా వేగము నడఁగించుకొనజాలక వెక్కి-వెక్కి- యేడువసాగెను. రామరాయ లామె నాలింగనముచేసికొని పరమాదరముతో "సరళా! నీకింత యధైర్య మెందులకు? ఇప్పుడు నాకు మహావిపత్తు కలుగనైయున్నమాట నిజమే. కాని నేను నీమూలమున రక్షింపబడితిని. నీవు నీ యుంగరమునుబంపి

యా మూలమున నన్ను హెచ్చరింపజేసితివి. సన్న్యాసిని నాకెల్ల సంగతుల నెఱింగించినది. కానిచో నాకేమియు దెలియకయే యుండును. ఇదిగో నీ యుంగరము " అనియెను.

సరళ సన్యాసిని వృత్తాంతమంతయు గ్రమముగ స్వామి కెఱింగించుచుండెను. ఇంతలో వెలుపల నేదియో శబ్దము వినవచ్చెను—రామరాయలు చెవియొగ్గి యాలకింపసాగెను—ఆశబ్ద మశ్వపద శబ్దమువలె నుండెను—అంతలో నొకదాసి " యువరాజా ! మంత్రికుమారుఁడు వచ్చి యున్నాడు. ఆవశ్యకకార్యముం గూర్చి మీతో మాటాడవలయునని చెప్పుచున్నాఁడు " అనియెను. అప్పుడు సరళ తనలో " ఏదియో విపరీత మున్నది. కాకున్న నింతటిరాత్రివేళ మా జనకుఁ డేలవచ్చును " అని యనుకొని దాసితో " శీఘ్రముగ లోనికి రమ్మనుము ! " అనియెను. దాసి వెడలిపోయెను.

కొలఁదినేపటిలో విద్యాధరుఁడు లోనికివచ్చి యెదురుగబోయి కంపితహస్తములతో రామరాయలను గౌగిలించుకొని కంపితస్వరముతో " ఇంతవఱకు దైవానుగ్రహముచే శుభమే జరగినది. మరల నొకరి నొకరు చూచుకొనఁ గలిగితిమి. పాపము—" అనియెను.

సరళ నిశ్చేష్టయై నిలువఁబడిపోయెను. ఆమె సర్వాంగములును గంపించిపోవుచుండెను. అప్పుడు రామరాయలు " మామా ! ఏమి జరగినది ? " అనియెను.

విద్యా—వృద్ధమహారాజు హత్య గావింపఁబడియెను.

" ఆ ! ఆ ! ఏమి యీదారుణము ! " అని సరళ నిలువున గూలఁబడిపోయెను. వకుళ యామెను బర్యంకముపైఁజేర్చి యుపచార ములఁ జేయుచుండెను. రామరాయ లామాటను విశ్వసింపఁజాలక " ఇది నిజమా ? నీవు పొరపాటు పడుచున్నావు " అనియెను.

విద్యా—నేను కన్నులార జూచివచ్చితిని. పొరపాటు కాదు—కుమారా ! విదురప్రోలురాజ్యమునకు వినాశకాలము వచ్చినది.

రామరాయలు కన్నీటి నాపుకొనఁ జాలకపోయెను. అతఁడు తన పితామహుని మిగుల ప్రేమించుచుండెను. అతడు దుఃఖించుచుండుటం

జూచి విద్యాధరుఁడు "కుమారా! ఇది దుఃఖమునకు సమయముకాదు. నీకొఱకుఁగాదు—ఈ సమస్తరాజ్యముకొఱకును నీప్రాణరక్షణ మావశ్యకమైయున్నది—" అనియెను.

రామ—ఇప్పుడు నేనేమిచేయవలయును?

విద్యా—నీ వింకను విచ్చటనే యున్నచో నీప్రాణములను గాపాడుకొనుట మిగులఁ గష్టము—పితృహత్య గావించిన కఠినహృదయుఁడు నిన్నుఁ జంపుటకుమాత్రము సందేహించునా?

రామ—పిఱికివానివలెఁ బాఱిపోవుటయా?

విద్యా—సైన్యము లన్నియు నాతని యధీనమునందున్నవి. నీవిప్పుడు కొన్నిదినములవఱకు నెచ్చటనైన దాఁగియుండుట మంచిది. ప్రజాభిప్రాయమును సైనికాభిప్రాయమును నీయెడల నెట్లుండునో గ్రహించి నీకు వార్తనంపెదను.

రామ—నేనెక్కడకుఁ బోవుదును!—హా! భద్రారణ్యమునకుఁ బోయి దేవీమందిరమునందుండెదను-నీవచ్చటకు నాకు వార్తనంపుము.

విద్యా—కుమారా! ఇప్పటినుండి నీవు విదుర్బోలు రాజ్యమునకు మహారాజవు—నీవిచ్చట లేనిదినములలో నీరాజ్యపరిపాలన మెట్లు జరగును? కావున నెవ్వరెవ్వరి నేయేయుద్యోగమునందు నియమింపవలయునో నియమించి పోవుట నీకు గర్తవ్యము.

రామ—మామా! నీవు నీతనయయగు మహారాజ్ఞిని రక్షించుకొనుచు బ్రధానమంత్రివై నాకుం బ్రతినిధివై యుండెదవుగాక! సేనానాయకులను బ్రధానోద్యోగులనందఱను నామాఱుగ నీవే నియమింపుము-అదియే నాయాజ్ఞగ బ్రకటింపుము.

విద్యా—ప్రాతఃకాలముననే నేను మీయాజ్ఞను బ్రకటించెదను.

రామ—నాకుఁ బ్రతిదినము వార్తలనంపుచుండుము. సైనికులును సరదార్లును రాజబంధువులును రాజోద్యోగులును నాయాజ్ఞ నతిక్రమింపరని తలంచెదను.

విద్యా—శక్తివంచనములేకుండ వారెల్లరు నీపక్షమునం దుండునట్లే చేయుటకు నేనెల్లవిధములఁ బ్రయత్నించెదను.

రామ—ఇఁక జెప్పవలసిన దేదియును లేదు. సరళ యున్నది—అమాయకురాలు—ఏమియు నెఱుఁగదు—నీబిడ్డ—ఇఁక జెప్పవలసిన దేమున్నది ?

విద్యా—కుమారా ! అది నా విధాయకకృత్యముకాదా. ఆవిషయమై యింతగ జెప్పవలయునా ? నీవు నిశ్చింతుఁడవై యుండుము.

రామ—అట్లయినచోఁ బోయెదను.

విద్యా—ఇఁక నాలసింపరాదు.

రామ—లేదు—ఆలస్యములేదు. ఒకసారి సరళతోమాటాడి—

విద్యా—గుఱ్ఱము సిద్ధముగనేయున్నది.

రామ—సరే—మిగుల జాగరూకతతోఁ గర్తవ్యకార్యముల నిర్వహింపుము. ఇఁక నిచ్చట నాలస్యమువలదు.

## ముప్పదియువ ప్రకరణము

సరళ హృదయావస్థ వర్ణనాతీతమైయుండెను. ఆమె కన్నులనుండి యశ్రుధారలు ప్రవహించుచుండెను. హృదయము బ్రద్దలుచేసికొని యామె ప్రాణములు వెడలిపోఁ జూచుచున్నట్లుండెను. కాని ప్రాణేశ్వరుని యాసన్నవిపత్సమయమునఁ దానును గళవళపడుచుండుట యశుభసూచకముగా నామెకుఁ దోఁచెను. అప్పుడు ప్రాణనాధునికొఱ కామె తన హృదయముసలేపి బలమును దెచ్చుకొనియెను—స్వామికొఱ కామె తన ప్రాణములనైన నర్పింపఁ గలదు—ఆమె కన్నీటిని దుడుచుకొని నాధునింజూచి "నాధా ! ఇఁక నాలస్యము చేయవలదు—ఇప్పుడే యీ పంచమహాపాతక పట్టణమును వదలిపొండు !"

సరళ మాటలకు రామరాయలు విస్మితుఁడయ్యెను—ఆమె యంతటి ధైర్యముతో నెలవిచ్చునని యాతఁడనుకొనలేదు—ఆమె యేడ్చుచు వలదని యడ్డగించినచో నాతఁ డేపనియును జేయఁజాలడు. ఆమె దుఃఖమును జూచినచో నాతని గుండెలు పగిలిపోవును. అట్టిస్థితిలో నామెను విడిచిపోవుట యాతని కశక్యమైయుండును. ఇప్పుడట్లేమియు

నభ్యంతరము కల్పింపక సరళయే యాతనిఁ బ్రయాణము చేయుటంజూచి రామరాయలు విస్మితుడయ్యెను.

రామ—ప్రేయసీ! నేను శీఘ్రముగనే వచ్చెదను. నీవధైర్య పడకుము మన కష్టములన్నియు ద్వరలోనే తీరగలవు.

సర—నాధా! నాకధైర్యములేదు.

రామ—నీవు సావధానవై యుండుము. సీతంద్రి నిన్నెల్లవిధముల గాపాడుచుండును. ఈ సమస్త రాజ్యమునందును మన కాతనికంటె నాత్మబంధువు లెవ్వరున్నారు?

సర—ఇఁక నాలస్యము చేయవలదు. అదియేమి? యేదియో చప్పుడగుచున్నది?

రామ—ఏమియునులేదు. భయముచే నీవట్లు భావించుచున్నావు. ఇఁక నేను పోయివత్తునా?

సరళ యెంతో కష్టముతో నింతవఱకును దుఃఖము నాపుకొని యుండెను. ఇఁక నట్లు సహింపజాలకపోయెను. ఆమె కన్నీటిని మాత్ర మాపుకొన్నది, కాని నోటమాటవచ్చినదికాదు. కుమారరాయలంతయును గ్రహించెను. ఇఁక నాలస్యముచేయుట మంచిది కాదని యాలోచించి యాతఁడాదరపూర్వకముగ నామెను గౌగలించుకొని బహిర్గతుఁడయ్యెను. అతడు ద్వారమువరకును బోయెను అంతలో సరళ యున్మాదినివలెఁ జటాలునబోయి యాతని హస్తమును బట్టుకొని "ప్రాణేశ్వరా! ఒక్క-మాట—నేనెఱుగుదును—ఇఁక నేను మిమ్ముఁ జూడజాలను—నేనెప్పటికిని మహారాజ్ఞినిగూడఁ గాజాలను—మహారాజ్ఞి కాఁదగినయామె యిచ్చటికి వచ్చియున్నది—ఆమెకే నేను యుంగరము నిచ్చితిని—అందుకొఱకు నా కంతగ విచారములేదు. కాని—కాని—కాని—నాధా!—" అనియెను.

రామరాయని నయనము లశ్రుజల పూరితములయ్యెను—ఆతని కంఠము రుద్ధమైపోవఁజొచ్చెను—అతఁ డతికష్టముతో "ప్రియతమా! సరళా! చెప్పుము! చెప్పుము! నీకేమి చెప్పవలయునని యున్నదో చెప్పుము—నా రాజ్యము, నా సింహాసనము, నా గౌరవము, నా ప్రాణము కూడ నాకు నీకంటెను బ్రియమైనవికావు" అనియెను.

అప్పుడు సరళ రుద్ధకంఠముతో గంపితస్వరముతో "ప్రాణేశ్వరా! నీవెవ్వరిని మహారాజ్ఞిగా జేసినను నాకుఁ గష్టములేదు—కాని—నాబిడ్డ—" అనియెను.

రామ—ప్రాణేశ్వరీ! నీకేమని చెప్పుదును? నీగర్భమునఁ గుమారుఁడే కానిమ్ము—కుమార్తెయే కానిమ్ము—ఈ విద్యానగరరాజ్య సింహాసనము నధిష్ఠించితీరును. పరమేశ్వరుని సన్నిధిని—ఆసన్న మృత్యు దేవతాసమ్ముఖమున—నేనీ శపథముం జేయుచున్నాను—శతసహస్ర వివాహములైనను నాకు నీవే మహారాజ్ఞివి.

సర—త్వరపడుడు! త్వరపడుడు! నలువంకలఁ గలకలధ్వనులు వినవచ్చుచున్నవి. తెల్లవాఱ వచ్చుచున్నది.

రామ—తెల్లవాఱుటకు ముందుగనే నేను వెడలిపోవలయును. నేను ప్రతిదినము నీక్షేమమును దెలిసికొనుచుండెదను.

అని చెప్పి రామరాయ లొకసారి సరళను ముద్దుపెట్టుకొని సత్వరముగ నచ్చటినుండి వెడలిపోయెను. ద్వారమునొద్ద సిద్ధముగనున్న యశ్వము నధిరోహించి రామరాయ లుత్తరాభిముఖుఁడై బయలుదేఱి పోయెను.

సరళ మూర్ఛితయై నిలిచినచోటనే పడిపోయెను. సఖులువచ్చి యామె కుపచారములు గావించిరి గాని యామెకుఁ దెలివి కలుగలేదు. అందఱు నామెను బరివేష్టించి దుఃఖింప నారంభించిరి. ఆమె యేమగునో యని యందఱును భయపడుచుండిరి. సఖులకందఱకు నామెయనినఁ బ్రాణము. ఇఁక వారెట్లు సహింపఁగలరు!

## ముప్పదియొకటవ ప్రకరణము

యువరాజు శయనమందిర ద్వారమునఁ గావలియున్న ద్వారపాలకుల కారాత్రి గడచుట లేదు. అంతటి భయంకరరాత్రిని వారెన్నడును జూచియుండలేదు. అంతట నంధకారబంధురముగ నుండెను. ఏమియు నగపడుటలేదు.

ఆ యంధకారము ఘనీభూతమై పిశాచరూపమును ధరించియుండెను. ప్రపంచమంతయు నంతర్హితమై పోయినప్పుడుకూడ నంతటి విశ్శబ్దభావ ముండదని వారు భావించుకొనుచుండిరి. ఆ విశ్శబ్దసమయమున నలువంకలనుండియు బిశాచములు కరతాళధ్వనులు చేయుచు నరకంకాళ గ్రాసార్థమై వచ్చుచున్నట్లుగ వారికి బోధయయ్యెను— నడుమనడుమ గ్రుడ్లగూబలు కూయుచుండెను; నక్కలు వికృతముగ నఱచుచుండెను.

యెల్లయెడల భయంకరముగ నుండెను. అంతట నేదియో యొక భయంకరచ్ఛాయ యావరించుకొనియెను. ద్వారపాలకులు మాటాడుటకు గూడ భయపడుచుండిరి—ఊపిరి విడుచుటకుగూడ వారికి భయముగ నుండెను—అప్పు డాయిరువురును శిలావిగ్రహములవలె నిలువఁబడి యుండిరి. వ్యాకులనయనములతో నొకరినొకరు చూచుకొనుచుండిరి ఇరువురును మాటిమాటికి దూరుపుదిక్కునకుఁ జూచుచుండిరి. ఎంతకును దెల్లవాఱుటలేదు.

అప్పుడొక భయంకర పిశాచమూర్తి తమవంకనే వచ్చుచున్నట్లు వారికిఁ దోచెను. అంధకారములో నారూపము బాగుగ నగపడుటలేదు. కావి యా యంధకారములో నాపిశాచనయనములు నక్షత్రములవలె మెఱయుచుండెను. ఆ పిశాచవిశ్వాసోచ్ఛ్వాసములనుండి యగ్నిస్ఫులింగములు వెలువడుచుండెను; పదశబ్దములచే రాజప్రాసాదమంతయుఁ బ్రకంపితమైపోవుచుండెను. వారావంకఁ జూడజాలకపోయిరి. వారు రాత్రియంతయు ననేక భయంకరదృశ్యములం గాంచుచునే యుండిరి; కావి యవియన్నియు ఛాయామాత్రములు—ఇప్పుడు వారా భయానక మూర్తిం గాంచి ప్రాణభయముచే నూర్ధ్వశ్వాసములు విడుచుచు నటనుండి పలాయితులై పోయిరి.

అది పిశాచముకాదు—మురళ!—పిశాచముకంటెను భయంకర స్వరూపిణియగు మురళ — రామరాయని రక్తమును బ్రవహింపఁ జేయుటకై మురళ యున్మత్తయై యాతని శయనమందిరమునొద్దకు

వచ్చుచుండెను. ఒకసారి నరశోణితముం జవిజూచిన క్రూరజంతువు మరల నట్టిరక్తముకొఱ కెట్లున్మత్తమై తిరుగుచుండునో మురళకూడ నట్లే తిరుగుచుండెను—అప్పుడు మురళకు హితాహితజ్ఞానములేదు—మురళ యాఁడుసింగమువలె నఱుకలు వైచుకొని వచ్చుచుండెను.

ద్వారపాలకులు పలాయితులై పోయిరి—ఇఁక నచ్చట నెవ్వరును లేరు. అప్పుడు మురళ ద్వారముపైఁ గరాఘాతము చేసిచూచెను; తలుపులు లోపలగొళ్లెము వేయఁబడియుండెను. రామరాయలు నిదురించినప్పుడు లోపలగొళ్లెము వైచుకొనియుండెను. ఆ గదిలోఁ బ్రవేశించుట కింకొక ద్వారముమాత్రమున్నది—ఆ ద్వారమార్గమున బ్రవేశింపవలసివచ్చినచో మహారాజు శయనించిన గదిమధ్యమునుండి పోవలసియుండును.

రక్తసిక్త శయ్యాభీకరంబగు మహారాజు శయనగృహమునఁ బ్రవేశించుటకు మురళహృదయముకూడఁ గంపించిపోవుచుండెను. అప్పుడామెకూడ నొక నిమిషమువఱకు నంతటను భయంకరదృశ్యములం గాంచెను. కాని యామె హృదయము వజ్రముకంటెను గఠినతరంబగు వస్తువుచే నిర్మింపఁబడినది!—అప్పుడు మురళ తన యధైర్యముంగూర్చి నవ్వుకొనుచు రాక్షసివలె నాయింటఁ బ్రవేశించెను. కాని ఆమె యాపర్యంకమువైపు చూచుటకు సాహసింపజాలకపోయెను. ఆమె యతి వేగముగ నాయింటిప్రక్కనేయున్న రామరాయల శయనమందిర ద్వారమును నిశ్శబ్దముగఁ దెఱచి యాలోపలఁ బ్రవేశించెను.

కాని పక్షి యెగిరిపోయినది. ఆగృహమున యువరాజు లేకుండుటచే నొక్కసారిగ మురళ హృదయము విఘూర్ణమానమైపోయెను. ఆమె కన్నులు చీకటులు గ్రమ్మెను—అప్పటి యామె భయంకర వికృత వదనమును గాంచినచో నెంతవారలకైనను హృదయము చెదరిపోక మానదు. అప్పుడు మురళ సంపూర్ణముగ నున్మాదినియైపోయెను—అధికసురాపానముచేసిన ట్లవశయైపోయెను. కాని శీఘ్రముగనే యామె

తెలివిదెచ్చుకొని "ఏమికావలయునో యట్లయినది. రామరాయ లీసంగతి నెట్లో తెలిసికొని పాఱిపోయినాఁడు. నిజముగ నాతడు భయముచే రాజధానినిగూడ విడిచిపోఁగలడు—అతడు బాలకునికంటె నధముఁడు—అతడు నిజముగ నీనగరమును విడిచిపోవును—ఇప్పుగునాయాసముగ నీ హత్యాపరాధమంతయు నాతనితలపై మోపవచ్చును. ఇదియే మంచి మార్గము—ఈతని శయ్యపైగూడ రక్తచిహ్నములంగావించి యీ కృపాణము నిచ్చట నుంచెదను. తెల్లవాఱినపిమ్మట నందఱకు నాతని మీదనే యనుమానము కలుగును—అందువలన నా కార్యము కొనసాగును—అందువలననే నేను మహారాజ్ఞీమణిని గాఁగలుగుదును" అని భావించుకొని మురళ మరల మహారాజ శయనగృహమున ప్రవేశించెను. మహారాజు మృతదేహమునుండి రక్తము ప్రవహించుచుండెను. దుగ్ధఫేన నిభంబగు పర్యంకమంతయు లోహిత రక్తరంజితమైపోయెను. ఆ దృశ్యముం గాంచినచోఁ బాషాణహృదయముకూడఁ గరగిపోవును—కాని మురళ హృదయము రాక్షసహృదయము. మెల్లమెల్లగ నామె యా శయ్యయొద్దకు వచ్చి తనపైటచెఱఁగు రక్తమునం దడిపి యచ్చటనుండి యువరాజ శయనమందిరమువఱకు నా రక్తమును జిమ్ముకొనుచుఁ బోయెను—రామరాయల శయ్యపైగూడ నట్లే రక్తమును జిమ్మి మెల్లమెల్లగ నటనుండి వెడలిపోయెను.

## ముప్పదిరెండవ ప్రకరణము

మురళ తన శయనమందిరమునకు వచ్చి చూచునప్పటికి విజయరాయలు తనచేతులను గడుగుకొనుచుండెను. ఎన్నిసారులోఁ గడుగుకొనియెను—ఎంతజలమునో యుపయోగించెను—గంటసేపటినుండి యాతఁడట్లే చేయుచుండెను. కాని యా రక్తచిహ్నములు పోయినవికావు. ఆకస్మికముగ మురళ యచ్చటకు వచ్చుటంగాంచి యాతడు పిశాచమేమో యని యదరిపడి గుభాలునలేచి నిలువఁబడిపోయెను. అప్పుడు మురళ వికటహాసము చేయుచు "ఇట్టి సాహసముతోడనా మీరిన్ని యుద్ధములం జయించినది?" అనియెను.

విజయరాయ లామాటలను వినిపించుకొనకయే "మురళా! దుస్తులను వదలివేయుము! చేతులను శుభ్రముగఁ గడిగికొనుము! నేను చిన్నుఁ జూడజాలకున్నాను" అనియెను.

ముర—నేనట్లు చేయఁజాలను—భయమైనచోఁ గన్నుల మూసికొనుము!

విజ—చూచినకొలఁది నాకు మతిపోవుచున్నది.

ముర—మీహృదయమున సాహసము కలదని నేనెఱుంగుదును-ఏమైననేమి? నేనిప్పుడే చేతులఁ గడిగికొనియెదను. అప్పుడైనను మీరు బాగుగ జూడఁగలరుగద! భయములేదుగద!

విజ—మురళా! బాగుగఁ బరిశీలింపుము! నాచేతులయందు రక్తచిహ్నము లేవియు లేవుగద?

ముర—ఏవియు లేవు.

విజ—ఇదిగో! ఇంకను స్పష్టముగ నగపడుచునే యున్నవి. ఎంతయోసేపు కడిగితిని. వదలలేదు. బాగుగ దీపము తెచ్చిచూడుము!

ముర—చాలుఁజాలు? నాకుఁ గోపము వచ్చుచున్నది. పోయి శయనింపుడు! నిద్రపట్టినచో నన్నియుఁ జక్కబడును.

ఇట్లుచెప్పి మురళ చేతులఁ గడుగుకొనఁబోయెను. చేతులను బాగుగఁ గడుకొని క్రొత్తదుస్తులను ధరియించెను; పిమ్మట రక్తరంజితంబులగు దుస్తులను గాల్చివైచెను. అకస్మికముగ నాయింటిలో నగ్నిజ్వాలలు ప్రజ్వరిల్లటం జూచి విజయరాయ లదరిపడి గుభాలునలేచి నిలువబడియెను. అప్పుడు మురళ నవ్వుచు "తెలిసిపోయినది—మీధైర్యము-చీమచిటుకుమన్నంతనే మూర్ఛలో మునిఁగిపోవునట్లగపడుచున్నది! మీరు యుద్ధముల నెట్లు చేసితిరి?" అనియెను.

విజయరాయ లేమియును మాటాడలేదు. అప్పుడు మురళ యాతని పార్శ్వమునకువచ్చి కూరుచుండెను. విజయరాయ లింకను భయముచే దొలగుచుండుటం గాంచి మురళ కోపముచే ముకుపుటము లదరుచుండ "చూడుఁడు! మూర్ఛమునుంగవలదు—" అని యతి గంభీరభావముతో "మీయవస్థం జూడగా మీకు మతిపోవుచున్నట్లు

బోధయగుచున్నది—మీమూలమున నాకుఁగూడ మతిపోవుచున్నది. ఇన్నాళ్ళు గడచిపోయినది ఇఁక మీరు మహారాజులగుట యెప్పుడు ?" అనియెను.

విజయరాయలు మాటాడలేదు. మాటాడుట కాతనికి శక్తికూడ లేకుండఁబోయెను. అప్పుడు మురళి "మహారా జిప్పుడు లేఁడు. యువరాజు పలాయితుఁడై పోయినాడు. అంతటి భీరుఁడు నిశ్చయముగ నీరాత్రియే ఈనగరమునుగూడ విడిచిపోయియుండును. ఇఁక నావిషయమున మీరు నిశ్చింతులై యుండవచ్చును. నేనా కృపాణమును నాతని పర్యంకముపై నుంచి వచ్చితిని. ఆతని యింటను బర్యంకమునను గూడ రక్తమునుజిమ్మి వచ్చితిని. అతఁడే మహారాజును జంపి పలాయితుఁడై పోయెనని తెల్లవాఱకుండగనే ప్రకటింపవలయును. అందఱు నట్లే విశ్వసింతురు. అందువలననే రేపటి యుదయమునుండియు నిరాటంకముగా మీరు మహారాజు లగుదురు—నాధా ! అప్పుడు నేను మహారాజ్ఞి నగుదును" అనియెను.

విజ—మురళా ! నీవా కృపాణమును రామరాయల శయ్యపై నుంచి వచ్చితినని చెప్పితివే ! ఆకత్తి యిదిగో !—

మురళి కోపముతో "కత్తియెక్కడ ? మీరు కాపురుషునికంటె నధములై పోవుచున్నారేమి ? మీచేష్టలం జూచిన నాకును సిగ్గగుచున్నది" అనియెను.

విజ—కత్తికాదా ? నాపిడికిటఁ గత్తిలేదా ? మురళా ! నాచేతుల రక్తమింకను బోలేదు—ఇదిగో ! రక్తములేదా ?—రక్తచిహ్నములు ! జలములఁ దెమ్ము ! ఇంకను జేతులఁ బరిశుభ్రపఱుపవలయును.

ముర—మీరు. మీరు సకలకార్యములను ధ్వంసము చేయుదురు. అందఱ యెదుటగూడ నిట్లే ప్రవర్తించినచో సమస్తవృత్తాంతమును బయలుపడిపోవును—అప్పు డేమగును ? అప్పుడిఁక నేమిచేయఁగలము ? ప్రధానోద్యోగులును, రాజబంధువులును, సరదారులు నేకమై మీశిరశ్ఛేదము గావింపకుండ నూరక విడిచెదరా ?

విజయరాయలు మౌనియై యించుకసే పాలోచించుకొని పిమ్మట "మురళా! ఆ యున్మాదిని మరణించినదికాదా?" అనియెను.

మురళి యా యున్మాదిని మాట మరచియేపోయెను. ఉన్మాదిని యింకను జీవించియున్నదని చెప్పినచో నాతఁడు మఱియును భయ భ్రాంతుడై పోవునని భావించి ప్రకాశముగా "ఉన్మాదిని యిక లేదు. ఆమె మరణించినది" అనియెను. విజయరాయ లుత్సాహముతో లేచి నిలువబడి "ఇక భయములేదు. ఉదయమున నాసామర్థ్యమంతయుఁ జూచెదవుగాక! నేనిక మునుపటి విజయరాయలునుగాను. ఇప్పటి నుండియు నేను మహారాజును" అనియెను.

ముర—నాథా! విన్న నేనెఱుఁగుదును. నీవే యీ విడుఁబ్రోలు మహారాజ్యమునకు మహారాజుగా నుండుటకుఁ దగినవాఁడవు.

అప్పు డిరువురును నిర్విచారముగ శయనించిరి. కాని నిద్రించుట లేదు. మహారాజును మహారాజ్ఞియు నైనతరువాత దా మేమేమి చేయ వలయునో యాలోచించుకొనుచుండిరి.

మనుష్యుడే రాక్షసుఁడు—భగవంతుడు స్వయముగ రాక్షసులను సృష్టించుటలేదు—ప్రవర్తనములే మానవుల దానవులఁగా మార్చివైచు చున్నవి!

ఇది ప్రథమఖండము.

# శ్యామల

## ద్వితీయ ఖండము

### మొదటి ప్రకరణము

రాజధాని విన్నటిదినమున నెంతటి పరమానంద విలాసములో మునిఁగి తేలుచుండెనో నేఁటి యుదయమునం దంతటి దుఃఖపూరితమై యుండెను—ప్రజల వదనముల యందు హాసచిహ్నమైనలేదు — మాటలేదు — నగరమం దంతటను విషాదచ్ఛాయ యావరించుకొని యుండెను. రాజోద్యోగులు శోకసంతప్త హృదయములతోఁ దత్తరమున నిటునటు దిరుగుచుండిరి. అంగడు లన్నియు మూసివేయఁబడియెను. సైనికులు దుర్గమునఁ దక్కడక్కడ గుంపులు గుంపులుగజేరి యేమియో మాటాడుకొనుచుండిరి. ప్రజలందరును భయవిస్మయాక్రాంత హృదయులై యుండిరి.

తెల్లవాఱకుండగనే నగరమందలి ప్రతిగృహమునందును మహారాజు మరణవార్త తెలిసిపోయెను. యువరాజు నగరమువిడిచి పలాయితుఁడై పోయినసంగతియు నందరకును దెలిసిపోయెను—ఈ దారుణ కృత్యమును గావించినవా రెవ్వరో యెవ్వరికిని బోధపడుటలేదు. విజయరాయని ప్రజలందఱును ప్రేమించుచుండిరి—అతని సద్గుణముల కెల్లరును ముగ్ధులైయుండిరి. అతనివలన నిట్టి కార్యము జరుగునని యెవ్వరు తలంతురు ! ఇట్టి యనుమాన మెవ్వరిహృదయమునందును గలుగుటలేదు. యువరాజు పలాయితుఁడై పోవుట యేమి ? అందువలననే విజయరాయలు నిర్దోషి యని బోధపడుచుండెను. కొలఁదిదినముల క్రిందటనే యాతఁడు సభామధ్యమున రామరాయలను భావిమహారాజని సంభాషించియుండెను. ఇంతేకాక మహారాజు మరణించినచో యువరాజే మహారాజు కాగలడు. కాని యిప్పుడాతఁ డెవ్వరికొఱకు భయపడి పాఱిపోయెను ? నగరప్రజ లావిషయముం గూర్చి యేమియు నిశ్చయింపఁజాలక యచ్చటచ్చట గుంపులుగూడి యీ సంగతిగూర్చియే చెప్పుకొనుచుండిరి.

ప్రాతఃకాలమునుండియు నశ్వారోహకులగు రాజోద్యోగులు నగరమంతటను దిరుగుచుండిరి. కొందఱు విజయరాయని ప్రాసాదము నుండి దుర్గమువకు బోవుచుండిరి. కొందఱు రాజబంధువుల యిండ్లకుఁ బరుగులెత్తుచుండిరి. మహారాజు మరణానంతరమున యువరాజు కనఁబడ కుండుటచే రాజ్యవ్యవస్థ యెట్లు గావింపవలయునో యాలోచించుటకై విజయరాయలు సభగావించుట కేర్పాటుచేసి యందఱ నాహ్వానించు చుండెను. రెండురోజులైన పిమ్మట దేశమునందలి మాన్యులగువా రందఱును సభకు వచ్చియుండిరి. సభారంగము పట్టజాలకుండెను. నగరమునందలి ప్రజలలో జాలమంది యచ్చటకు వచ్చియుండిరి. సభకు నెదుటనున్న విశాలప్రదేశమున పదివేలమంది సైనికులు వరుసలుతీరి సాయుధులై నిలిచియుండిరి. అందరును విషాదభయవిహ్వాలులై యుండిరి.

ఆకస్మికముగ వెలుపల జయజయ ధ్వనులు బయలుదేఱెను. కొలువుకూటమునకు రాజబిరుదాంకితుఁడగు విజయరాయలు వచ్చు చుండెనని యందఱకును దెలియవచ్చెను. విజయరాయ లంగరక్షక పరివేష్టితుఁడై యుత్తమాశ్వము నధిష్ఠించి రాజప్రాసాదమునకు వచ్చు చుండెను. ఆతని వదనమండలమున విషాదరేఖ యావరించియుండెను. ఒక్కరాత్రిలోఁ బదియేండ్లవయసు చెల్లిపోయినవానివలె నాతఁ డగపడు చుండెను. ప్రజలాతని మొగమువంకఁజూచి పితృమరణ దుఃఖముచే సహజముగనే యాతఁ డట్లయిపోయెనని భావించుకొనుచుండిరి. విజయ రాయలు మొట్టమొదట సేనాసమీపమునకువచ్చి నిలువఁబడియెను. పిమ్మట సేనానాయకులతో సమాదరపూర్వకముగ సంభాషించెను. తరువాత నశ్వారోహియై సైనికపంక్తులనన్నిటిని దర్శించి వారలతో మధురసంభాషణముం గావించెను. అంతటి వినయభావమును, నంతటి సద్భావమును సైనికులెన్నఁడును జూచియుండలేదు—సైనికులందరును విజయరాయని నెప్పుడును ప్రేమించుచుండిరి. కాని యిప్పటి విజయ రాయని చేష్టలవలన వారందఱును ముగ్ధులై మాటిమాటికి జయజయ ధ్వనులను జేయసాగిరి.

అప్పుడు విజయరాయలు గుఱ్ఱమునుండి దిగి సభామందిరమునఁ బ్రవేశించెను. కాని యచ్చటి సభ్యులెవ్వరును సైనికులవలె నాతని యెడల సమాదరభావముం జూపుటలేదు. కొందఱు కొంద ఱాతనిం గూర్చి జయధ్వనులం జేయుటకుఁ జాల బ్రయాసపడిరి. ఎల్లరు నేక గ్రీవముగ నంగీకరింపకుండుటచే గొందఱు జయధ్వను లర్ధోక్తులతోనే యాఁగిపోయెను. విజయరాయ లాసంగతి గ్రహించెను. అతని వదనమునం దప్పుడు విలక్షణచ్ఛాయ యావరించుకొనియెను. కాని యాతఁ డంతలోనే తన హృదయభావమును హృదయమునందే విలీనముచేసి మెల్లమెల్లగ సింహాసనపార్శ్వమునకు వచ్చి నిలువఁబడియెను-అప్పుడాతఁ డేమి చెప్పునో వినవలయునని సభాసదులందఱును వ్యగ్రులై యుండిరి. మొట్టమొదట గలకలధ్వని నలుదెసలను బయలుదేఱెను. కాని విజయరాయ లేమియో మాటాడుట కుద్యుక్తుఁడై యుండుటచే నంతలో సభారంగ మంతయు నొక్కసారిగ నిశ్శబ్దమైపోయెను.

## రెండవ ప్రకరణము

అప్పుడు విజయరాయలు సభవంకఁ జూచి "సభాసదులారా! మీకొక భయంకర సమాచారముం దెలుపుటకై మిమ్ముల నిటకు రప్పించితిని. భగవంతుడు నాకిట్టికష్టముం గల్పించునని నేననుకొనలేదు" అనునప్పటికి విజయరాయని కంఠము శోకరుద్ధమైపోయెను. ఆతనికన్ను లశ్రుధారాపూరితములయ్యెను. అది యంతయుం గాంచి సభ్యులుకూడ గన్నీటి నాఁపుకొనఁజాలకపోయిరి. గద్గదస్వరముతో విజయరాయలు మరలఁ జెప్పదొడగెను. "మీ మహారాజిఁక లేఁడు—ఘాతుకుల చేతులలో నాతడు మరణించినాఁడు — ఆనంద మహోత్సవదినముననే విడుఁబ్రోలురాజ్యమునకు నాశనము ఘటిల్లినది—ఏమని చెప్పుదును? హృదయము బ్రద్దలైపోవుచున్నది. ఇంతటి విపరీతము జరుగుటకు ముందుగనే నేనేల మరణింపనైతివి? ఇతరు లెవ్వరైన మహారాజును హత్యచేసినచో నేనట్టివారి శిరశ్ఛేదముం గావించియుందును. కాని—" విజయరాయలిఁక మాటాడలేదు-మొగముపై వస్త్రమును గప్పుకొని యేడువసాగెను.

సభ్యులుకూడ దుఃఖించిరి. అప్పుడు విజయరాయలు మరల "రామరాయలు చాల మంచివాఁడని మనమందరము నెఱుంగుదుము. అతఁడిట్టి తలంపుతో నున్నాఁడని నేను స్వప్నమునందైనఁ దలంచియుండలేదు— అతఁడే మహారాజగును. కాని యాతడు కాలవిలంబమును సహింపలేక పోయినాడు. ఈ హత్య గావించినవారెవ్వరో సభాసదు లందఱును జూచి తెలిసికొనుటకై నేను నా భవనమందిరద్వారముల నన్నిటిని దెఱచి యుంచితిని—రండు! అందరును దిలకింపుడు—పామరుఁడగు రామరాయలు వృద్ధమహారాజు నెట్లు చంపినదియు, నెట్లు భయముచే నగరమును విడిచిపోయినదియుఁ దెలిసికొందురుగాక!" అనియెను.

ఆమాట లాలకించి సభ్యులందఱును భయవిస్మితులై స్తంభితులై పోయిరి. ఎవ్వరు నేమియు మాటాడలేదు. అప్పుడు విజయరాయలు "మహారాజు కళేబర మిఁకను నట్లేయున్నది. ఆ యింటనుండి రామరాయల యింటివఱకు నెట్లు రక్తము చిందియున్నదో చూచెదరుగాక! ఇంతేకాదు—ద్వారపాలకులను బంధించి రామరాయలు మా తండ్రిని జంపినసంగతికూడ వారివలనఁ దెలిసికొందురుగాక—ఇప్పుడు మీయభిప్రాయ మేమియో చెప్పుడు! నేను మీ కందఱకును జిరకాల సేవకుఁడను—మీయిష్టమును నెఱవేర్పగలిగినచో నేను చరితార్థుఁడ నగుదును" అనియెను.

కొన్ని నిమిషములవఱకు నెవ్వరు నేమియు మాటాడలేదు. అప్పుడు సభలోనుండి మంత్రికుమారుఁడగు విద్యాధరుఁడు లేచినిలువఁబడియెను. ఆతఁ డేమిచెప్పునో వినవలయునని యందరును వీక్షించుచుండిరి. అప్పుడు విద్యాధరుఁడు "సభాసదులారా! ఇట్టి ధర్మసంశయ సందర్భమున నిదమిద్ధమని నిర్ణయింపగల ప్రధానమంత్రి యగు మా తండ్రి రోగశయ్యయందున్నాడు—అతనికిఁ బ్రతినిధిగ నేనొకటి రెండు మాటలను జెప్పవలసియుండెను. ఇంతేకాక యువరాజిట లేని సమయమున నాతనిఁగూర్చి కూడ నొకటిరెండు మాటలు చెప్పుట యావశ్యకము—నేనాతనికి బంధువుఁడనని యందఱకును దెలిసిన విషయమే—ఆతని జీవితములో నాతఁడెన్నఁడు నిట్టి దుష్కార్యమును

జేసియుండలేదు. ఈ దారుణవ్యాపార మాతనిమూలమున జరిగియుండ లేదు—ఈ మహారాజు మరణవృత్తాంతమును నేనే యాతనికి మొదట నివేదించితిని. అప్పుడాతఁ డతికష్టముతో నాదురాత్ములు తన్నుఁగూడ జంపెదరేమో యను భయముచే నగరమును బరిత్యజింపవలసినవాఁ డయ్యెను. ఇంతియ కాని యాతఁడీదారుణ కృత్యముంగూర్చి యెంత మాత్రము నెఱుంగడు" అనిచెప్పి యూరకుండెను.

అప్పుడు సభ్యులలోఁ గొందఱు "ఈసంగతి మొట్టమొదట నీకెట్లు తెలిసినది? నీవెట్లు యువరాజుతోఁ జెప్పితివి? అప్పుడాతఁ డెట్టి యవస్థలో నెచ్చటనున్నాఁడు?" అని ప్రశ్నించిరి. కాని విద్యాధరుఁడు కమల కపాయమువచ్చునను నుద్దేశముతో "నేనిప్పుడీ ప్రశ్నల కన్నిటికిని బ్రత్యుత్తరము చెప్పఁజాలను. కాని యాతఁ డీహత్య చేయలేదని మాత్రము ఘంటాపథముగఁ జెప్పగలను. విశేషించి యిప్పు డాతఁడు మహారాజైనాఁడు—రాజశాసన విషయంబున నాతఁడు తగిన యేర్పాటులనుగూడఁ గావించి పోయినాడు—అతడు పోవునప్పుడు ప్రధాన మంత్రి యస్వస్థుఁడై యుండుటచే నన్నుఁ బ్రధానమంత్రిగను సర్వా ధ్యక్షునిగను నియమించియున్నాడు" అనియెను. ఆమాటల నాలకించి యందఱును బరిహసింప నారంభించిరి. అందువలన విద్యాధరునిపై నందఱకు నయిష్టము కలిగెను. అప్పుడు సభామధ్యమునఁ గోలాహలము పుట్టెను. ఒకరితో నొకరు మాటాడుకొనఁ జొచ్చిరి. స్పష్టముగ నేమాటలను వినవచ్చుటలేదు.

అనంతరము సభ్యులుపోయి రాజభవనమును డిలకించిరి. ద్వారపాలకులవలన నెల్లసంగతులను దెలిసికొనిరి. తుదకు యువరాజే దోషియని నిర్ధారణచేసిరి. అప్పుడు రాజబంధువులలో వృద్ధుఁడగు సదాశివరాయలు సభ్యులనుద్దేశించి "యువరాజు దోషియై పలాయితుడై పోయినాఁడు—మహారాజ సింహాసన మిప్పుడు శూన్యమై యుండ గూడదు—ఇప్పుడు మహారాజ కుమారుఁడగు విజయరాయలే మహారా జగుఁగాక!" అనియెను. సభ్యులందఱును జయజయ ధ్వనులను జేయసాగిరి.

ఆ సమయమున విద్యాధరుఁడు మరలలేచి మృదులస్వరముతో "సభాసదులారా! యువరాజు సింహాసనమును వీడిపోయినాఁడని మారు చెప్పవచ్చును—సత్యము బయలుపడువఱకు—ఆతడు దోషి యనియే మీరు పరిగణింపవచ్చును—కాని యాతడు లేనప్పు డాతని దేవియగు—ఆతనికిఁ బట్టమహిషియగు సరళ గర్భమునం జనించు శిశువున కీ రాజ్య సింహాసనము జెందవలసి యుండును—తండ్రిచేసిన దోష మాతని సంతానమునకు వర్తింపదు—ప్రసవించువఱకు సరళయే మహారాజ్ఞిగా నుండుట న్యాయము" అనియెను.

ఆతని మాటలను బాటించువా రెవ్వరును లేరైరి. సభ్యులలోఁ గోలాహలధ్వనులు బయలుదేరెను. విజయరాయ లెవ్వరి యనుమతిని నిరీక్షింపక తనకుఁదానే సింహాసనము నధిష్ఠించెను. ప్రజలందరును జయ జయ ధ్వనులం గావించిరి. వెలుపల సైనికులు కూడ జయధ్వనులం జేయసాగిరి. అప్పుడు విజయరాయలు సభ్యుల సంబోధించి "మహారాజ మరణశోక సూచకముగ నగరమునం దొక నెలవఱకు నుత్సవముల నాపివేయవలయును—అనంతరము పట్టాభిషేక మహోత్సవము జరుగఁ గలదు. నా దుఃఖముల నన్నిటిని మఱచి కర్తవ్యకార్యములం దేమఱి యుండక ప్రజల బిడ్డలంబోలెఁ బరిపాలింతునని శపథము చేయుచున్నాను. మహారాజును హత్యగావించిన రామరాయలకు మరణ దండనము గావింపవలయును. ఆతనిఁ బట్టి యొప్పగించినవారికి లక్ష నిష్కములను బహుమానముగ నొసంగుచున్నాను. విద్యాధరుఁడు రాజసభలో బహిరంగముగ రాజద్రోహమును బురికొల్పి యున్నాడు. కావున నాతనిని బట్టి కారాగారమునం దుంపవలయును. పిమ్మట నాతనిం గూర్చిన విచారణము జరుఁగగలదు. ఇఁక సభ చాలింతముగాక!" అనియెను.

జయజయ ధ్వనులతో సభ ముగిసెను. రాజభటులు విద్యాధరుని బంధించి తీసికొనిపోయిరి. అప్పు డున్మాదినియగు శ్యామల జనసంఘమును ద్రోసికొనుచు వచ్చి సభారంగమున బ్రవేశించి కరతాళములు వైచుచు "నేను విదుబ్రోలురాజ్య మహారాజ్ఞీమణిని-నేను-నన్నెరుఁగరా

యేమి ? ఎరుఁగరా ? నన్ను మఱచిపోయితిరేమి ? మఱచిపోయితిరేమి ? నన్ను మఱచిపోయితిరేమి ?" అనియెను.

ఆకస్మికముగ నామెంజూచి విజయరాయలు భయకంపితుఁడై గద్గదస్వరముతో "పట్టుకొనుడు ! ఈ యున్మాదిని బట్టి బంధింపుడు" అనియెను.

అప్పుడు శ్యామల వికటహాసము చేయుచు "వలదు—వలదు—వలదు—రాక్షసుఁడా !—క్రూరరాక్షసుఁడా !" అని కేకలు వైచుచు నటనుండి యదృశ్యయై పోయెను—విజయరాయని గుండె గుభిల్లు మనిపోయెను.

## మూఁడవ ప్రకరణము

మూఁడు మాసములు గడచిపోయెను రామరాయల సమాచార మేమియు దెలియుటలేదు. విద్యాధరుఁ డాతని కెట్టివార్తను బంపజాలకపోయెను. విజయరాయలు సింహాసనము నధిష్ఠించిన దినమునందే విద్యాధరుఁడు కారాగారమునం దుంపబడియెను. సర్వదా రాజభటుల కావలియం దుండవలసివచ్చుటచే నాతనికి దప్పించికొని పోవుట కవకాశము కలుగుటలేదు—అట్టి యాశ యును లేదు. అందుచే రామరాయలటును విద్యాధరునకును బరస్పరము సమాచారములఁ దెలిసికొనుటకుగాని కలసుకొనుటకుగాని యవకాశము లేకపోయెను.

భర్తృవియోగముచే సరళ రేయుంబవలు కన్నీటిలో మునిఁగి తేలుచుండెను. రామరాయలు వెడలిపోవుచున్నప్పుడు తన క్షేమసమాచారములం దెలుపుచుండెదనని చెప్పియున్నాఁడు—కాని మూఁడు మాసములైనను నాతఁడెట్టిసమాచారమును దెలిపియుండలేదు. ఆమె దుఃఖమను దినదినము వర్ధిల్లుచునే యుండెను. ఇంతేకాక సరళ యిప్పుడు రాజధానియందుఁగూడ లేదు. ఆమె రాజధానియం దున్నచో బ్రజల కామెయం దభిమానము కలుగునను నుద్దేశముతో మురళ యాలోచనము ననుసరించి విజయరాయ లామెను దూరమునఁ గేతకీ

దుర్గమునం దుంచెను. అచ్చట సరళ కేవలము వకుళ మాత్రము సహాయముగ నతిదుఃఖము ననుభవించుచు నివసించి యుండెను. విడుబ్రోలు రాజ్యమునకు మహారాజ్ఞీమణియై సుఖింపవలసిన యామె యిప్పు డచ్చట దీనురాలింబోలి దుఃఖములపాలై యుండెను. అందుకొఱ కామె దుఃఖించుటలేదు. స్వామిపాదదర్శన మిఁక లభింపదేమో యనియే యామె దుఃఖము. సరళ యేకాంతముగ దన స్వామికొఱకు బిగ్గఱగ నేడ్చుచుండును. ఇట్టి దుఃఖసమయమునం దామె నందఱును విడిచి వైచిరి. కేవలము వకుళ యొక్కతెమాత్ర మామెతోఁ గష్టసుఖముల ననుభవించుచుండెను. వకుళ యామె నెన్నియోవిధముల నూరడించుచుండెను. కాని సరళ మాత్రము తేరుకొనుటలేదు.

నిర్జనంబగు నా కేతకీదుర్గమున సరళ యొక కుమారునిఁ గనియెను-ఎవ్వని శుభోదయసమయమున రాజ్యమంతయు నానందోత్సవములతో దులదూగవలసి యుండునో యాతని జననసమాచారమే యెవ్వరికిని దెలియకుండ బోయెను. తెలిసికొనుటకైన నెవ్వరును బ్రయత్నింపలేదు. సరళ తనచిన్నకుమారుని నొడియందుంచుకొని పరమాదరముతో బదివేల ముద్దులు పెట్టుకొని యేడ్చుచుండెను—ఆమె కిఁకఁ దనజీవితముతో నెట్టి ప్రయోజనమును లేదు—ఆశయును లేదు—కోరికయును లేదు—ఆ శిశువు దక్క నామెకిక దిక్కేమియునులేదు. వకుళ యప్పుడామె చేతులను బట్టుకొని యశ్రుజలంబులఁ దుడుచుచు "సఖీ! కష్టములు కలకాలము నుండబోవు—అవశ్యముగ రామరాయలు తిరిగి రాఁగలడు—ఆతడే విడుబ్రోలురాజ్యమునకు మహారాజగును—ఎప్పటివలె నాతడు నిన్నుఁ బ్రేమించి యాదరించును" అనియెను.

సరళ వకుళమాటల కెట్టి ప్రత్యుత్తరము నీయలేదు. కేవలమామె కన్నులనుండి దుఃఖాశ్రుధారలు ప్రవహించుచుండెను. ఆమె యప్పుడు తలయూఁచుచు "సఖీ! వకుళా! నాకిట్టిభాగ్య మికలేదు. ఇట్టి సందిగ్ధ సమయమున బ్రధానమంత్రియగు నా పితామహుఁడు మరణించినాఁడు—

నాతండ్రి కారాగారమున బద్ధుఁడై యున్నాఁడు—ప్రజలందఱు నుదా సీనులై యున్నారు—ఇఁక నాస్వామికి సహాయులెవ్వరు? నాకెట్టి యాశలేదు" అవియెను.

మురళ సుఖమునకుఁ బరిమితిలేదు. మురళ యాశ లన్నియును ఫలించినవి. మురళ యిప్పుడు మహారాజ్ఞియైనది. ఆమెకు దాసదాసీ జనులును సఖులును లెక్కలేకుండనుండిరి. ఆమె విలాసములు వర్ణనాతీతములై యుండెను. ఆమె సామర్థ్యమున కవధిలేదు. ఆమెయే యిప్పుడు మహారాజై యున్నది. విజయరాయ లామె చేతులలోని కీలుబొమ్మయై పోయెను. అధికసుఖానంద నిమగ్నయై మురళ దుఃఖినియగు సరళ మాటయే మఱచియుండెను. సరళ యనునామె యీ ప్రపంచమునం దున్న దను మాటయే యామెకుఁ దెలియకుండబోయెను. మురళ తన ప్రాసాదమున నిత్యోత్సవములతో గాలక్షేపము చేయుచుండెను. ఆ యుత్సవ తరంగములలో నొక నిమిషమైన దుఃఖినియగు సరళకు స్థానములేకుండ బోయెను.

విజయరాయలు మహారాజైనపిమ్మట గ్రమక్రమముగఁ బ్రజ లందఱును విభ్రాంతిమూలకమైన తమ యకృత్యమునకు వగవసాగిరి. విజయరాయని రాజుగా జేసినప్పటియానంద మిప్పుడు వారికిలేదు. ప్రబలపరాక్రమములతో జండశాసనుఁడై మహారాజగు విజయరాయలు ప్రవర్తింపఁదొడగెను. ప్రజాపీడనము ప్రారంభమయ్యెను. విజయ రాయలు తాను సింహాసన మధిరోహించు కాలమున నెట్టి శపథములం గావించెనో యవి యన్నియు నిప్పుడు విపరీతములై పోయెను. విజయ రాయని హృదయము నిరంతరము దారుణాగ్ని జ్వాలాధీనమై మండిపోవు చుండెను—కాని యీ బాధంగూర్చి చెప్పుకొనుటకుఁ దావులేదు— బిగ్గరగ నొక్కసారి యేడ్చుటకైన నవకాశములేదు—ఆ యగ్ని జ్వాలలఁ జల్లార్చుటకైన నుపాయములేదు — అసహనీయంబగునట్టి యాతని లోలోపల నాతఁడే యనుభవింపవలసి యుండెను. కాని యాతడు దాని నెట్లుసహింపఁగలఁడు?

అందుకొఱ కాతడు సురాపానమునుజేయ నారంభించెను. ఇఁక రేయుంబవ లాతని కదేపని—నిరంతర మాతని ప్రాసాదము నృత్య గీతములతో మెరసిపోవుచుండెను. దేశదేశములనుండి యందగత్తెలగు వారాంగనలు నిత్యమును రావింపబడుచుండిరి—విజయరాయల కిప్పుడు రాజకార్యములపై మనసులేదు—రాజభండారమును రెండుచేతుల వ్యయ పెట్టుచుండెను.

ప్రధానమంత్రి యీవఱకే మరణించెను. పూర్వపు రాజో ద్యోగులలో నొక్కరు నిప్పుడులేరు. వారి స్థానములయందు నీచులును, ఉద్ధతులును, అజ్ఞులును, విలాసప్రియులును నగవారు ప్రతిష్ఠింపఁబడిరి. దినదినమును ధనము కావలసివచ్చుచుండెను. అందుకొఱకు పన్నులు వృద్ధియయ్యెను. ప్రజలు దరిద్రులై పడరానిపాట్లం బడుచు రామ రాయలం దలంచుకొని దుఃఖింప నారంభించిరి. ప్రధానపరిషత్సభ్యు లందఱును మహారాజగు విజయరాయనిచే నిరంతర మవమానింపఁ పడుచు దమ యజ్ఞానమునకై సిగ్గుపడుచు క్రమముగ యువరాజుకొఱకు శోకింప నారంభించిరి. కాని యిప్పు డేమియు నుపాయములేదు. దుర్దాంతుఁడును బరాక్రమవంతుఁడునగు విజయరాయని నెదురించుట కెవ్వరికి సామర్థ్యమున్నది ?

ఎంతటి వినోదములలో మునింగినను, ఎంత సురాపానము చేసినను విజయరాయని హృదయసంతాపము తీరుటలేదు. అతని హృదయ మెప్పుడును జ్వలించిపోవుచుండెను. ఇంతేకాక వృద్ధమహారాజు ప్రేత రూపమును ధరించి యాతని కన్నులయెదుటఁ దన రక్తాక్తహృదయముం జూపి యేమేమో శపియించుచున్న ట్లాతనికి బొడకట్టుచుండెను. ఇట్టి భయంకరదృశ్య మెప్పుడు నాతని కన్నుల కగపడుచునే యుండెను. కాని రేయుంబవలు మురళి తన రాక్షసబలము నాతని హృదయమునం దావేశింపఁజేయుచుండెను. అట్లే కానిచో నిశ్చయముగ నా విజయరాయ లీపాటికిఁ బిచ్చివాఁడై పోయియుండును.

ఇంతేకాక యరణ్యశిబిరమునఁదాతడు కాంచిన భయంకర స్వప్నము దినదినమును నాతని కగపడుచునే యుండెను—నిరంతరమును శ్యామల

కృపాణపాణియై యాతని పార్శ్వములం దిరుగుచున్నట్లే యాతనికి గోచరించుచుండెను—నిత్యమును విజయరాయని నయనోపరిభాగమున మృత్యుదేవత నాట్యము చేయుచున్నట్లుండెను—అతని యాజ్ఞచే దేశమునందలి పిచ్చివాండ్రందఱును గారాగారమునందుంచఁబడిరి—నిరపరాధినులగు దీనబాలికలు శ్యామల యను ననుమానముచే గారాగారమునం దుంపఁబడిరి—కొందఱు బాలికలు చంపఁబడిరి. రమణీమణుల రక్తవాహినులచే రాజధాని దూషితమైపోవుచుండెను—కాని శ్యామల మాత్రము మరణింపలేదు—ఆమె దొరకనులేదు—ఎవ్వరికి నామె యగపడనులేదు.

శ్యామలకొఱకు విజయరాయలు కోయల పల్లెయం దనేకములగు నత్యాచారములఁ జేయింపసాగెను. ఇంతచేసినను విజయరాయని హృదయమున శాంతి యుదయింపలేదు. అతఁ డప్పుడు దేవీమందిరమునం గాంచిన సన్న్యాసిని వెదకించుట కారంభించెను. రాజ్యమంతటను నా సన్న్యాసిని బట్టుకొనవలయునని యాజ్ఞ ప్రకటింపబడియెను. ఎక్కడ నేసన్న్యాసి దొరికినను బట్టుకొని రాజధానికిఁ దీసికొని వచ్చుచుండిరి. వారి ననేకవిధముల దండించి ముద్రలువైచి కారాగారములం ద్రోయుచుండిరి. మహారాజునకు వారిని విచారించుట కవకాశమే లేకయుండెను. దేశమునందంతటను నిట్టి దారుణకృత్యములవలన నశాంతి కలిగెను. సన్న్యాసులు, బ్రాహ్మణులు, ధర్మపరాయణులు మొదలగువారిని హింసించుటవలన రాజ్యప్రజలందఱును విజయరాయని యెడల నసంతుష్టులైపోయిరి—కాని యుపాయమేమియును లేదు—రామరాయ లెచ్చట నుండెనో యెవ్వరికిని దెలియుటలేదు.

## నాలుగవ ప్రకరణము

ఒకనాఁడు మంచి సమయమును గనుపెట్టి రాజోద్యోగి యొకఁడు విజయరాయని యొద్దకుఁబోయి "మహారాజా! చాలమంది సన్న్యాసులు కారాగారమునం దుంపఁబడియున్నారు. ఒకసారి దయచేసి చూడవలయును. మీరు

చూచియే తెలిసికొనవలసియుండెను" అనియెను. అప్పు డాతఁడు కారాగారమునొద్దకుఁ బోయెను. అప్పుడు చాలామంది సన్యాసులు బంధింపబడియుండిరి. మహారాజు వారినందఱను బరీక్షించెను. అందొక్కనిపై నాతనిదృష్టి పడియెను. అప్పుడు విజయరాయ లాతని గుఱుతుపట్టి చెంతనున్న యుద్యోగిఁజూచి "ఈ సన్న్యాసిందక్క దక్కిన యందఱను వదలివేయుము! నే నెవ్వరికొఱకు నిరీక్షించుచుంటినో యాతఁడు దొరికినాఁడు. ఇఁక సన్యాసులను బట్టుకొన నక్కఱలేదు" అనియెను కొలఁది నేఁటిలో దక్కిన సన్యాసుల కందరకును విడుదల కాఁబడియెను. అందఱును దమతమ నివాసములకు వెడలిపోయిరి.

మహారాజుచే నిరూపింపబడిన సన్న్యాసికూడ వారితోఁగలసి వెడలిపోఁజూచెను. కాని యొక ప్రతీహారి యాతనినడ్డగించి "అయ్యా! నీవు పోవలదు—ఆగుము" అనియెను.

సన్యాసి —ఏమి? ఎందుచేత?

ప్రతీ—నిన్నుంచమని మహారాజు సెలవైనది.

సన్యా—నేను బోగముదానను గానే!

ప్రతీ—బాగుగ మాటాడుము! కానిచో బ్రాహ్మణుఁడవని యూరకుండను.

సన్యా—అవును—అట్లయినచో నూరకుండెదను.

దక్కిన సన్న్యాసు లందఱును వెడలిపోయిరి. తరువాత విజయరాయ లా యుద్యోగిం జూచి "మీరందఱు నావల నాకొఱకు నిరీక్షించి యుండుడు! ఈ సన్న్యాసితో నేను రహస్యముగ మాటాడవలయును" అనియెను. అందరు నటనుండి వెడలిపోయిరి. అప్పుడు విజయరాయలు సన్యాసియొద్దకుఁబోయి "మీరు నన్నెఱుఁగుదురా?" అనియెను.

సన్యా—ఎరుఁగుదును — మీరిప్పుడు విద్యానగరరాజ్యమునకు మహారాజులు—

విజ—మీరు చెప్పినట్లే యైనది.

సన్యా—అవశ్య మట్లే కావలయును-జ్యోతిశ్శాస్త్ర మెన్నఁడును నసత్యముకాదు—

విజ—మీరెన్నాళ్ళనుండి యీ చెఱసాలయం దుంటిరి ?

సన్యా—ఎన్నాళ్లీ నీభటులు నన్నిందుంచిరో యన్నాళ్లనుంటిని.

విజ—సరే. ఇఁక మీరు కారాగారమున నుండనక్కఱలేదు. అతిగౌరవముతో మిమ్ము రాజసభయం దుంచెదను.

సన్యా—మీ దయ.

విజ—మీమూలమున నింకను నెన్నియో సంగతులను దెలిసికొన దలఁచియుంటిని.

సన్యా—అడుగుము ! శ_క్తికొలఁది చెప్పెదను

విజ—మీరు చెప్పినట్లు జరగినది.

సన్యా—అది యగపడుచునే యున్నది.

విజ—మీ మందిరమున నేనొక బాలికను జూచియుంటిని.

సన్యా—ఔను.

విజ—ఆమె మీ తనయా ?

సన్యా—కాదు.

విజ—ఆమె యెవ్వరు ?

సన్యా—ఎప్పుడైనవచ్చి యామె దేవీమందిరమున పూజ చేసికొను చుండును.

విజ—ఆమెకూడ నాకొక భవిష్యత్ఫలముఁ జెప్పియున్నది, అదికూడ ఫలించునా యేమి ?

సన్యా—ఆ సంగతి నేనెట్లు చెప్పఁగలను ?

విజ—మీరు నాకొఱ కించుక శ్రమపడవలయును. మీరు గ్రహగణముచేసి నేను మహారాజునగుదునని చెప్పితిరి—అట్లే యైతిని—నేనెట్లు మరణింతునోకూడ గుణించి చెప్పవలయును.

సన్యా—మహారాజా ! మేము మృత్యుగణము చేయఁబోము.

విజ—ఇది యొక్కటియు మాత్రము చూడవలయును.

సన్యా—చూడకున్నచో ?

విజ—మరణ పర్యంతము మీరీకారాగారమునం దుండవలసినదే.

సన్యా—సరే—ఉండుము! గుణించి చూచెదను.

అనిచెప్పి సన్యాసి నేలపై నొకపుల్లతోఁ గొన్నియంకెలనువైచి లెక్కించుచు గొంతసేపైనతరువాత "మహారాజా! ఏస్త్రీచేతను మీరు చంపఁబడరు" అనియెను.

విజ—సరే! తరువాత?

సన్యా—ఏపురుషుని హస్తమునందును నీకు చావులేదు.

విజ—కావచ్చును. ఇంకను జూడుడు!

సన్యా—ద్వంద్వయుద్ధమునందక్క నిన్నెవ్వరును జంపజాలరు.

విజ—అట్లయినచో నాకేమియును భయము లేదనుకొనియెదను.

సన్యా—అవును.

విజ—నేనెన్నాళ్ళకు మరణింతును?

సన్యా—ఒక సంవత్సరము లోపలఁ గావచ్చును—కానిచో బదునొకండేండ్ల లోపలనైనఁ గానవచ్చును. ఇరువదియొకటవవత్సరమునకు లోపలనైనను గానవచ్చును.

విజ—నేనాఁడుదాని చేతులలో మరణింపకుండుట స్థిరమేకద?

సన్యా—ఔను—పురుషహస్తమునందుఁగూడ నీకు మరణములేదు. ఇదియును సత్యమే.

విజ—అట్లయినచో నాకెట్టిభయమును లేదు.

సన్యా—ఎంతమాత్రమును లేదు.

విజ—నేను యీ విషయమై చాల సంతసించితిని. మీకేమి కావలయునో కోరుఁడు!

సన్యా—మహారాజా! సన్యాసిని నాకేమి కావలయును?

విజ—మీకుఁ జాల శ్రమయిచ్చితిని. ఇఁక మీరు స్వేచ్ఛగ మీయాశ్రమమునకు దయచేయవచ్చును.

సన్యాసి వెడలిపోయెను. విజయరాయలు పరమానందముతోఁ నంతఃపురమునకుఁబోయి మురళకీ యానందసమాచారము నెఱింగించెను. ఇరువురును మహానందమున మునిగియుండిరి.

## ఐదవ ప్రకరణము

మురళీధ్వని బయలు దేరుచున్నది. గిరిశృంగము నుండి గిరిశృంగమునకు వేణువు ప్రయాణము చేయుచున్నది; పల్లెలనుండి పల్లెలకుఁబోవుచున్నది. ఒక సంవత్సరమునకుఁ దరువాత మరల వనరాజు మురళి కోయల ప్రతిగృహమునకును బరుగులెత్తుచున్నది. మరల నిప్పుడు కోయలలో గోలాహలధ్వనులు బయలు దేరెను. అందరును దేవిమందిరాభిముఖులైరి. ఎల్లయెడల జయధ్వనులే— అంతటను గోలాహలమే.

కోయలందరును దేవీమందిరమునకు బ్రయాణమై గుంపులు గుంపులుగ నచ్చటకువచ్చి చేరుచుండిరి. ఈసారి తప్పక యుద్ధమగునని వారందఱును బరమోత్సాహముతో నొక్కచో గుమిగూడి యుండిరి. చిరకాలమునుండి వారికి యుద్ధమున కవకాశము కలుగుటలేదు. ఎవ్వరు నిరంతరము యుద్ధప్రియులో; ఎవ్వరు పరస్పరకలహములచే నిరంతరము రక్తపానములఁ గావించుచుందురో యట్టి కోయలకు వనరాజవతరించి నప్పటినుండియు యుద్ధవిగ్రహములు లేకుండఁబోయెను.

ఈసారి యుద్ధము కావచ్చును. ఈసారి యుద్ధముకొఱకే వనరాజు వారినందరును నాహ్వానముచేసియుండెను. కేవలము వారందఱు నీసారి తప్పక యుద్ధము కావలయునని తలంచుకొనుచు బరమోత్సాహముతో దేవీమందిరమునకు వచ్చుచుండిరి — ఈసారి కోయపల్లెలలో యుద్ధము చేయదగిన వీరుఁడొక్కడైన లేకుండ నందఱును యుద్ధసన్నద్ధులై దేవీమందిరము నొద్దకు వచ్చుచుండిరి. ఈసారి తప్పక యుద్ధముజరగును.

కాని యెవ్వరితో నెచ్చట యుద్ధము జరగునో యాసంగతి వారి కెవ్వరికిని దెలియుటలేదు. కాని వనరాజు వారికిఁబ్రభువు- వనరాజే వారికి సేనానాయకుడు—వనరాజే వారికి రక్షకుడు—వనరాజే వారికి బ్రత్యక్ష దైవము!—అట్టి వనరాజు వారిని బిలిపించెను—అందువలననే వారందఱును వచ్చుచుండిరి. వనరాజు వారిని నరకాగ్నిజ్వాలలయందురుకుఁడని యాజ్ఞాపించినను బరమోత్సాహముతో వారందఱు నట్లు చేయగలరు.

ఇంకను గోయు లెవ్వరును దేవీమందిర సమీపమునకు వచ్చి యుండలేదు. ఇప్పుడా దేవీమందిర ప్రాంతము జనశూన్యముగనే యుండెను—ఎక్కడను మానవసంచారమేలేదు—అప్పు డా దేవీమందిర ద్వారమునం దొక బాలికామణి కూర్చుండి వీణవాయించుకొనుచు నీవిధముగఁ బాడుకొనుచుండెను.

" కోకిలం బారకయ పాడు • కొనుచునుండె;
పలుకు పలుకున సుస్వరం • బొలయుచుండె;
స్వరలహరిలోన నమృతంబు • గురియుచుండె;
అమృతరస మెంతొ మాధుర్య • మగుచుండె;
ఇట్టి సమ్మేళనం బగు • టెందుకొఱకు ?
ప్రేమకొఱకుఁ బ్రేమకొఱకుఁ • బ్రేమకొఱకు—

* * * *

హృదయపథమున నెల యుద • యించు టేమి ?
కలశవారాశి మిన్నంది • తొలఁకు టేమి ?
తలఁపుదరగలగమి దరి • దట్టు టేమి ?
మెఱపుఁదీగెలు మిలమిల • మెఱయు టేమి ?
ఇట్టిఘటనా పరంపర • లెందుకొఱకు ?
ప్రేమకొఱకుఁ బ్రేమకొఱకుఁ • బ్రేమకొఱకు—

* * * *

రాసమండలములో • రాధికారమణి
బాలకృష్ణుని లీల • భావించి సొగసి
తన్మయత్వంబుచేఁ • దన్నుఁదా మఱచి
సుఖియించుచుండఁగా • జూపోపలేక
షట్పదస్వరముతో • ఝూంకరించెదవు
మతిలేఁదటే నీకు • మల్లికా వల్లి ?

* * * *

మమత గ్రమ్మినదమ్మ • మధురరూపమునఁ
దెలివి దప్పినదమ్మ • దివ్యతేజమున

మధురమోహనునిపై • మనసు విల్వుటయె
యపవాధ మౌనచే • యళినీమతల్లి ? "—

ఆమె యీ విధముగా నేకాకియై పాడుకొనుచుండెను—ఆకస్మికముగఁ దన పాటలలోఁ దానే మగ్నయై తన్ను దానే మఱచిపోవుచుండెను. కొంతసేపటి కొక సన్యాసి మెల్లమెల్లగవచ్చి యా బాలిక వెనుకభాగమున నిలిచియుండెను. అట్టి యవస్థలో నామె నాతఁడు పిలుచుటకు సాహసింపజాలకపోయెను. అతడుకూడ నా మధురవీణాగానమునకు ముగ్ధుడై కొంతసేపటివఱకు నిశ్శబ్దముగ నట్లే నిలువఁబడియుండెను. అట్లు కొంతసేపైన తరువాత నా సన్యాసి "అమ్మా!" అని పిలిచెను. బాలిక యులికిపడి సన్యాసి వంకఁదిరిగి చూచి "మీరెప్పుడు వచ్చితిరి ?" అనియెను.

సన్యా—ఇప్పుడే—నీవిప్పుడు మిగుల మధురముగ వీణానాదనము గావించుచుంటివి.

బాలి—నాకేమియు దోచనప్పుడు వీణవాయించుకొనుచుందును—ఇక నేమిచేయుదును.

సన్యా—ఈమాటలకేమి ? నీతో మాటాడవలసిన పనియున్నది—నీకుఁ దోచినట్లే నీవు చేయుట మంచిదా ?

బాలి—మీకిదివఱకే చెప్పియుంటిని. నేనట్లు చేయజాలను—సరళకు మాటయిచ్చితిని. విశేషించి నాకట్టికోరికయును లేదు.

సన్యా—రామరాయని కొరకు — సరళ కొరకు—విద్యుద్రోలు రాజ్యముకొరకు—ప్రతీకారము కొరకు-నీవీ కార్యమునుజేసి తీరవలయును-నీవు తోడుపడకుండినచో రామరాయలకు మరల రాజ్యము వచ్చునను నాశలేదు.

బాలి—నేను విద్యుద్రోలు రాజ్యమునకు మహారాజ్ఞిని గావలయునా?

సన్యా—ఇది పరమేశ్వరుని సంకల్పము !

బాలి—పరమేశ్వరుని సంకల్పమైన గావచ్చును—కాని నాకు మాత్ర మట్టిసంకల్పములేదు.

సన్యా—అట్లయిన నేమి చేయుదువు ?

బాలి—చిరకాల సన్యాసినినై యట్లే యరణ్యములఁ దిరుగుచుందును.

సన్యా—నీవు రామరాయలను ప్రేమించుటలేదా ?

బాలి—ఆప్రేమ మీకెట్లు తెలియును ?

సన్యా—రామరాయలు దుర్లభుడని తోచినన్నాళ్ళు నాతనికొరకే పరితపించితివి. ఆతడు సులభుఁడై యున్నప్పుడు పరిగ్రహించుట సంకోచించెదవు ?

బాలి—అప్పటికి నేను సరళను జూచియుండలేదు—నావలె నింతగాఢముగ నాతని నింకొకరు ప్రేమించియే యున్నారని నాకప్పటికి దెలియదు—ఇంతయకాక యాతఁడు నన్ను బ్రేమించుచుండెనోలేదో నాకుఁ దెలియదు—తండ్రీ ! మీరు నేను దుర్బలహృదయనని భావించుచున్నారా ? మాటిమాటికి నా హృదయమును గలఁగించుచు నన్నుఁ బ్రలోభురాలిగా జేయవలదు.

సన్యా—నీవు సరళను బ్రేమించుచుంటివి—రామరాయలగూడఁ బ్రేమించుచుంటివి. ఆ యిరువురు యిప్పుడు కష్టములలో మునిఁగి యున్నారు. నీపించుక ప్రయత్నించినచో వారి కష్టములన్నియు వదలి పోఁగలవు—నీవింతమాత్రము చేయవలదా ?

బాలిక మఱియేమియు మాటాడలేదు. అప్పుడు సన్యాసి మరల "నీవు విడుబ్రోలు మహారాజ్ఞివి కావలదు—యుద్ధానంతరమున నిక రామరాయలను జూడవలదు. నిర్మానుష్యంబగు నేగిరి గహ్వరమునకైనను బోయి యోగాభ్యాసము చేసికొనుచుండుము ! " అనియెను.

అప్పటికి బాలిక మాటాడలేదు. సన్యాసి మరలఁ దీవ్రముగ "సరే ! ఇప్పుడేమిచేయుటకు నిశ్చయి చుకొంటివి ?" అనియెను.

బాలి—మీరు నాకెప్పుడేమి చెప్పినను జేయుచునే యుంటిని. పిచ్చిదాననై విడుబ్రోలు పోయితిని—పిచ్చిదాననై విజయరాయుని భయపెట్టి వచ్చితిని—ఎంతటి దుస్పృహముగ నున్నను రామరాయలతోఁ

గలసి మెలంగుచుంటిని—తండ్రీ ! ఇఁక నేను సహింపజాలను. నేనందఱి స్త్రీలవంటిదానను గాను—నా కంతటి మనోదార్ఢ్యము లేదు. ఈ హృదయ తాపముచే నాలో నేనే మండిపోయెదను గాని యితరుల మనోధనము నపహరింపజాలను—మీరు స్త్రీహృదయము నెఱుంగజాలరు. మీకెట్లు తెలియును ? స్త్రీలైనచో దెలిసికొనగలుగుదురు ?—స్త్రీలై మనసునిండ నెవ్వరినైన బ్రేమించినచో మీకప్పుడు తెలియును. ఇతర స్త్రీలవంటి దాననేయైనయెడల నేనిట్టి భాగ్యమును వదలుకొని యుండను—వదలుకొన జాలకయే యుండును. ఇంత ప్రయత్నముచేసి—ఇంత యాయాసపడి— నాకు మీరింతటి విద్య నెందులకు నేర్పితిరి ?

అని యాబాలిక యేడ్చుచు నంతలోనే కన్నీటిని దుడుచుకొని " ఇంత చేయదలచుకొన్నవారు నన్నా సరళయొద్ద కెందులకు బంపితిరి ? ఆమెను జూడకున్నచో నాకింతటి యాతనయే కలుగకుండ నుండును " అనియెను.

సన్యా—అమ్మా ! విధివిధాన మట్లున్నది. ఇప్పుడు రామరాయల కొఱకు సరళకొఱకు నాయాజ్ఞను బాలించుట నీకు గర్తవ్యము.

బాలిక యేమియును మాటాడక యేడువసాగెను.

సన్యా—నీకును రామరాయలకును వివాహము కావలయును. అనంతరము నీవు రాణివి కాకున్నను సరియే—యుద్ధానంతరమున నీవెవ్వరికి నగపడకుండ నంతర్హిత వగుదువుగాక !

బాలి—అట్లెవ్వరు చేయఁగలరు ? హృదయమున కంతటిధైర్య మెక్కడ నున్నది ?

సన్యా—అట్లయినచో నా పరిశ్రమ యంతయు నిరర్థకముగఁ బోవలసినదే ?

బాలి—ఇప్పుడు—వివాహముతో నావశ్యక మేమున్నది ?

సన్యా—ఆవశ్యకమున్నది — కోయలు వనరాజునాజ్ఞను దమ ప్రాణములనైన వినియోగించి పరిపాలించుచున్నమాట సత్యమే—కాని సుశిక్షితులగు విడుబ్రోలు సైనికులు వారిపైబడి నుఱుమాడుచున్నప్పుడు వారు వెనుకంజవైవక మానరు. ఆ కోయలందరును శ్యామలను గాళికావ

తారముగ భావించి సేవించుచున్నారు. శ్యామలా! నీవు రామరాయలను బెండ్లియాడినచో నప్పుడు కోయలందఱును నీకొఱకు రామరాయలను దమవానిగా భావించి యాతని పక్షమునఁ దమ ప్రాణములనైన నర్పించి పోరాడుటకు సంసిద్ధులై యుండుదురు.

శ్యామల—తండ్రీ! మీరు నన్నుఁ జిన్నపిల్లనుగా భావించు చున్నారా? నన్ను నిడుద్రోలు రాజ్యమునకు మహారాజ్ఞిగా జేయకుండ విడువదలచుకొనలేవా?

సన్యా—తల్లీ! నేనేమి చేయుదును? ఇది విధివిధానము!

శ్యామ—ఈసారి—కడసారి—దేవిసన్నిధిని ప్రతిజ్ఞచేసి చెప్పుచున్నాను. మీరిక నన్ను నిర్భంధింపవలదు.

సన్యా—సరే!

అప్పు డా యిరువురును మెల్లమెల్లగ దేవీమందిరమున బ్రవేశించి తలుపులను మూసికొనిరి.

## ఆఱవ ప్రకరణము

ఆ దేవీమందిరమునకు వెనుకభాగమునం దనతి దూరమున నొక సరోవరముకలదు. ఆ సరోవర తీరమున రామరాయ లొక్కఁడును గూరుచుండి చింతించుచుండెను. ఒక సంవత్సరము గడచిపోయినది. అతనికి నరళ వృత్తాంత మేమియును దెలియుటలేదు. వేటకానికి భయపడి సంచరించుచున్న హరిణివలె నాతడు సంవత్సరమునుండి ప్రాణభయముతో మహారణ్యమున బరిభ్రమించుచున్నాడు. అతనిఁ బట్టుకొనుటకై విజయరాయలు నలుదెసలకును సైనికులను బంపియుండెను. రామరాయలను జంపుటకై కొందరు ఘాతుకులు గుప్తచారులై తిరుగుచుండిరి. రామరాయల కొక్కచో స్థిరముగ నుండుట కవకాశము లేకుండబోయెను.

రామరాయలు రాజధానిని బరిత్యజించి పలాయితుండై తిరిగి తిరిగి భద్రారణ్యమును జేరెను. అప్పుడు దేవీమందిర సాన్నిధ్యమున నాతనికి వనరాజ దర్శనమయ్యెను. వనరా జాతని దుఃఖచరిత్రము

నాలకించి కరుణాళుఁడై యాతని కథయమొసంగెను. అది మొదలు వారిరువురు నాప్తమిత్రులై యుండిరి. వనరాజు రామరాయల సంరక్షణమునకై తగిన యేర్పాటుల నన్నిటిని గావించెను.

ఒక సంవత్సరము గడచిపోయినది. రామరాయలకు మరల రాజ్యము లభించుననునాశ యెంతమాత్రము నగపడుటలేదు. అతడు వనరాజును బాగుగ నెరుంగడు. అప్పుడప్పుడుగాని తఱచుగ నాతనికి వనరాజ దర్శన మగుటలేదు. వనరా జెక్కడకుఁ బోవునో యెప్పుడు వచ్చునో యాతనికి దెలియుటలేదు. వనరాజు రామరాయల నొకచోట నుండి మఱియొకచోటికి బంపించుచుండెను. అట్లెందులకుఁ జేయుచుండెనో రామరాయలకు దెలియుటలేదు; తన నిమిత్తమైన వనరా జెట్టి ప్రయత్నములఁ జేయుచున్నదియును దెలియుటలేదు. రామరాయ లెప్పుడైనఁ దన వృత్తాంతముంగూర్చి చెప్పవలయునని ప్రయత్నించి నప్పుడు వనరాజు మురళీగానముచేయుచు నాతని మఱపించివైచుచుండెను. రామరాయ లాతని మధురగానమున ముగ్ధుడై పోవుచుండెను. ఆ మధుర సంగీతములో నాతడు తన రాజ్యమును, దన ప్రియురాలగు సరళను— తన యదృష్టమును సమస్తమును గూడ మఱచిపోవుచుండెను.

ఈ విధముగా నొక సంవత్సరము జరగిపోయినది. అతని కుపాయము తోచుటలేదు—నిరంతరము ప్రాణభయశంకితుడై యుండెను. ఇక నాతఁడేమి చేయగలడు? ఎక్కడకు బోగలడు? ఏమి చేయుటకును స్థిరపఱచుకొనజాలక యుండెను—అతని హృదయము సర్వదా సరళ కొఱకు బరితపించుచుండెను. అతఁ డామెను బ్రాణములకంటె నెక్కుడుగ బ్రేమించుచుండెను—అట్టి సరళ—ముగ్ధబాలికాసదృశయగు సరళ—శత్రు మధ్యమున నెట్టికష్టముల ననుభవించుచుండెనో యాతనికి దెలియుట లేదు. తండ్రియగు విద్యాధరుఁడామెను రక్షింప గలుగునా? అతడు తన కెట్టి సమాచారమును బంపుటలేదేమి? రామరాయ లెప్పుడైన వనరాజు నీవిషయములంగూర్చి ప్రశ్నించినప్పుడు వనరాజు "సరళ క్షేమముగ నున్నదను సమాచారము వచ్చినది" అని చెప్పుచుండును—ఇంత మాత్రముచే నాతని హృదయమున కూఱట కలుగునా?

సరోవర తీరమున గూరుచుండి రామరాయ లనేక విధముల జింతించుచుండెను. అతని యాలోచనల కంతములేదు. అప్పు డాకస్మి కముగ నాతని వెనుకభాగమున నెవ్వరోవచ్చి నిలువబడిరి. ఆనీడ సరోవర జలంబులఁ బ్రతిబింబించుచుండెను. రామరాయ ఉలికిపడి వెనుదిరిగి చూచెను—అతడు వనరాజు!

రామ—వనరాజా! సరళ క్షేమవార్త లేమైన దెలిసినవా?

వన—సరళాదేవి క్షేమముగ నున్నదని తెలియవచ్చినది.

రామ—ఈమాటనే యెన్నాళ్ళనుండియో వినుచుంటిని—ఇంత మాత్రముచే నాకు సంతోషములేదు.

వన—నీకొక కుమారుఁడు గలిగినాడు.

రామ—సరళ కెట్టికష్టమును గలుగలేదుగద?

వన—లేదు—అట్టి దేమియునులేదు—కాని యామెకు సుఖము లేదు—అమె కేతకీదుర్గమున నిర్బంధింపబడి యున్నది.

రామరాయలు చాలనేపటివఱకు మాటాడజాలకపోయెను. కొంత నేపటి కాతఁడు "వనరాజా! ఈ ప్రపంచమున నీకంటె నాకెట్టి బంధువు లునులేరు. నాకు రాజ్యముపై నెట్టి యాశయునులేదు. నాయొద్ద దాఁప వలదు ఆశపెట్టుకొని కష్టపడుచుండుటకంటె హతాశుఁడనగుటయే మేలు.

వన—మహారాజా! నేనుమాత్ర మూరకుంటినా యేమి?

రామ—మిత్రమా! కోపమువలదు — నా హృదయావస్థను గ్రహించినచో నీవిట్లు మాటాడవు.

అని పలుకుచు నాతడు వనరాజుకంఠమును కౌగిలించుకొని దుఃఖించుచు "ఈ ప్రపంచమున నాకు నీకంటె సహాయు లెవ్వరునులేరు. రాజ్యముతో నాకు పనిలేదు—సింహాసనముతో బ్రయోజనములేదు—సరళాదుఃఖ విమోచనముం గావించి నన్ను బ్రతికింపుము! ఆమె నాకంట పడునట్లు చేయుము! మేమిరువురము నీ యరణ్యమునం దొక కుటీరమును వైచుకొని జీవింతుము?" అనియెను.

వనరాజునకును గన్నుల నీరు నిండిపోయెను. కాని యాతడు కన్నీటి నడఁగించుకొని "ఆమెను దీసికొని వచ్చుటకు యుద్ధముకంటె వేఱొండుపాయ మేమియునులేదు. మహారాజా! ఇఁక గొలదిదినములు

మాత్రమే యోపిక పట్టుము. నేనంతయును సంసిద్ధము చేసితిని ఒకటి రెండు దినములలో ముప్పదివేలమంది కోయలు యుద్ధసన్నద్ధులై ఈ దేవీ మందిరము నొద్దకు వచ్చెదరు. వారందఱు నీకొఱకు ప్రాణములనైన నర్పించుటకు సంసిద్ధులైయున్నారు—కాని—

రామ—అది యేమి? వేగముగ జెప్పుము!

వన—కోయల కొక పిచ్చిబాలిక యున్నది.

రామ—శ్యామలయా?

వన—ఔను. ఆమెను గోయలందఱును దమ దేవతగ భావించుచుందురు—మీరా పిచ్చిదానిని బెండ్లియాడవలయును.

రామ—ఎందులకు?

వన—ఆమెను బెండ్లియాడినచో కోయలందఱు మీకొఱకు దమ ప్రాణముల నర్పింపగలరు.

రామ—అట్లు చేయక తప్పదా? పిచ్చిదానితో వివాహమా? ఇది నామమాత్ర వివాహమే—అందులకు నేను సమ్మతించెదను—సరళకొఱకే పని చేయమన్నను జేయుదును.

వన—మహారాజా! మీరు సరళాదేవి నంతగా బ్రేమించుచుంటిరా?

రామ—నీవెవ్వరినైన నెప్పుడైన బ్రేమించియున్నచో నాసంగతి నీకుఁ దెలియును!—నా హృదయమునందలి ప్రేమభావమును నీవెట్లు గ్రహింపగలవు?

ఆకస్మికముగ వనరాజునయనము లశ్రుపూరితములయ్యెను—అతని నఖశిఖపర్యంతమును సర్వాంగకములును గంపించిపోవుచుండెను; రామరాయ లాతనిం జూచి "ఇదియేమి? వనరాజా! నీవు దుఃఖించుచున్నావు?" అనియెను.

వన—లేదు—నా కన్నులలో నేదియో పడినది.

ఇట్లుచెప్పి వనరాజు రామరాయలతో మఱి మాటాడకుండ సత్వరముగ నటనుండి వెడలిపోయెను. రామరాయలు విస్మితుఁడై చాలసేపటివఱకు నాతని వంకనే నిరీక్షించుచుండెను.

# ఏడవ ప్రకరణము

ఇంచుమించుగ ముప్పదివేల కోయలు యుద్ధవేషధారులైవచ్చి దేవీమందిరమునకు నలువంకల శిబిరములలో విడిసియుండిరి. అప్పుడచ్చట నొక మహానగరము వచ్చి వాసము చేయుచున్నట్లుండెను. వారితో మూఁడునాలుగు వందల యేనుగులును, నైదాఱువేల గుఱ్ఱములును వచ్చియుండెను. ఒకటిరెండు మాసములకు సరిపడిన యాహారపదార్థములుకూడ వారియొద్ద నుండెను. అంతవఱకు నెట్టి విచారమును లేదు.

అప్పుడు వనరాజు స్వయముగవచ్చి కోయల శిబిరములఁ దిరుగుచు నెవ్వరెవ్వ రెట్టి పనులం గావింపవలయునో యాజ్ఞాపించుచుండెను. యుద్ధవిద్యానభిజ్ఞులగు వారికి యుద్ధవిద్యల నేర్పుచుండెను. అస్త్రములు లేనివారి కస్త్రముల నొసంగుచుండెను మందిరమునకు వెనుకనున్న యంతర్భవనమునం దాతఁ డనేకాయుధముల నిక్షేపించియుండెను. ఇప్పు డాతడు వారలకు సర్వసేనాధ్యక్షుడై యుండెను.

అసభ్యులగు నయ్యారణ్యకు లింతకుఁ బూర్వము యుద్ధవిద్య యన్న నేమియో యెఱుంగకయుండిరి. కాని వారు మిగుల సాహసులు—బలిష్ఠులు—పరాక్రమవంతులు—యుద్ధమనిన వారికి భయములేదు—వనరాజు నధీనమునందుండుటచే నిప్పటికి వారు పరాక్రమ వంతులును యుద్ధవిద్యానిపుణులునై యుండిరి వారెన్నడు నింతమంది యొక్కచో జేరియుండలేదు. ఇన్ని యాయుధములుకూడ వారియొద్ద నెన్నడునులేవు. వనరాజ శిక్షణమున, వనరాజ బోధనమున, వనరాజ పరిశ్రమమున వారిప్పటికిఁ బరమపరాక్రమ శిక్షాశీలురగు సైనికులుగఁ బరిణమించిరి. వనరా జెవ్వరి కేమికావలయునో యిచ్చుచుండెను—ఎవ్వరి కేమి నేర్పవలయునో నేర్పుచుండెను.

వారందఱు నిచ్చటకువచ్చి యేడుదినములైనది. కాని యెక్కడకు పోవలయునో యెవ్వరితో యుద్ధము చేయవలయునో యెందుకొఱకు యుద్ధయాత్ర చేయవలయునో యెవ్వరికిని దెలియదు. క్రమముగ

నందుఁ గొందఱు నిడుబ్రోలుసైనికులతో యుద్ధము చేయవలయుననియు విజయరాయనిఁ బదచ్యుతునింగాంచి రామరాయుని నాస్థానమునందు నిలుపవలయుననియు గ్రహించిరి అందువలన వారి యుత్సాహ మినుమ డించెను. విజయరాయలు పరాక్రమవంతులగు సైనికులతోవచ్చి తమ పర్వత ప్రదేశములఁ బ్రవేశించి గ్రామముల దోచియు, గృహముల దగులబెట్టియు, దుర్బలబాలికాబాలక స్త్రీపురుష శిశుహత్యలం గావించి యుండెను—అతని దారుణకృత్యములు దుస్సహములై యున్నను నింత వఱకు నపరిహార్యములై యుండెను. వారందఱు నిట్టి విపత్తుల నందు చుండియు వనరాజు నాజ్ఞ లేకుండుటచే నతి కష్టముతో నింతవఱకుఁ గాలము గడపుచుండిరి. ఇప్పటికి విజయరాయనికిఁ దగిన శిక్షచేయుట కవకాశము తటస్థించుటచే వారందఱును బరమోత్సాహము నందుచుండిరి.

దేవీమందిరమునుండి చిరపరిచితంబగు మురళీధ్వని వినవచ్చు చుండెను. వనరాజు మురళి—యమునాతీరమున వేణుగోపాలకృష్ణుని మురళీమధురగానము నాలకించి వ్యాకులితహృదయులగు గోపాలబాలికలు తమతమ గృహములను వదలి యెట్లు పరుగెత్తుకొని వచ్చిరో యట్లే వనరాజ వేణుధ్వని నాలకించి కోయలందరు దమతమ కార్యములను బరిత్యజించి యతి త్వరితముగవచ్చి మందిరసమ్ముఖమున వరుసలుతీరి నిలుచుట కారంభించిరి—ఎంతటి యపూర్వదృశ్యము ! అంతరాంత రమునను బంక్తి పంక్తిని గోయలు యుద్ధవేషాలంకృతులై నిలువఁబడి యుండిరి. వారు తమతమ నాయకుల పార్శ్వమున వీరదర్పముతో నిలువఁబడి యుండిరి. ఒక్కొక్కదళ మొక్కొక్క విధముగ నుండెను. సైన్యమంతయు సమచతుష్కోణంబగు చతుర్భుజవ్యూహముగ గూర్పబడి యుండెను. దళమునకును దళమునకును యోధునకును యోధునకును నడుమ వ్యవధానమగపడుచుండెను.

ఈసమస్తసైన్యమునకు నుభయపార్శ్వముల నంతరాంతరములుగ నశ్వారోహిగణంబును, సైన్యమున కంతకును వెనుక నలంకృత గజయూధమును నిలువబడియుండెను. అందఱును గూడ ననంతర కరణీ యంబులఁ దెలిసికొనవలయునను నుత్సాహముతో వేగిరపడుచుండిరి.

మందిరద్వారము తెఱవబడియెను. అలంకృతులగు నిరువురు కోయ బాలకులు పతాకాహస్తులై వచ్చి యా సైన్యమున కగ్రస్థానమున నిలిచి యుండిరి. కోయలందరు నా వనరాజు విజయపతాకం గాంచి గగన విదారణంబులగు విజయధ్వనులం జేయసాగిరి. వారి జయధ్వనులు కాననమునందలి నిశబ్దభావమును భంగపఱచుచు జాలదూరము వఱకును బ్రతిధ్వనించుచుండెను. అప్పుడు వనరాజు రామరాయల హస్తమును బట్టుకొని మెల్లమెల్లగ దేవీమందిరమునుండి యీవలకు వచ్చెను. కోయలందఱు నొక్కపెట్టున నత్యుత్సాహముతో జయధ్వనుల నారంభించిరి.

## ఎనిమిదవ ప్రకరణము

అప్పుడు వనరాజు దేవీమందిర సోపానములపై నిలువఁబడి తన దక్షిణహస్తము నెత్తి "సోదరులారా! మరల సంవత్సరమునకుఁ దరువాత మిమ్మిచ్చట సమావేశము గావించితిని—ఈసారి నిజముగ యుద్ధముకొఱకే—వెనుకటిసారి మీకే విషయముం గూర్చి బోధించితినో యందుకొఱకే మిమ్మందఱ నిప్పు డిచ్చటి కాహ్వానము గావించితిని-విద్యానగరరాజ్య మిప్పుడు విపత్తులలో మునిఁగియున్నది. విజయరాయ లిప్పుడు తన తండ్రినిజంపి సింహాసనము నాక్రమించినాఁడు—ఆతడు మనకెట్టి యపకారములను జేసియున్నాడో—చేయనున్నాడో మీకందరకును దెలిసిన విషయమే--ఇప్పుడు మీ సమ్ముఖమున మీ సాహాయ్యము నపేక్షించి నా పార్శ్వమున నిలువఁబడియున్న యీ మహాపురుషుడు న్యాయముగ—సత్యముగవిద్యానగరరాజ్యమునకు మహారాజు—"

"మహారాజునకు జయమగుగాఁక!" అని యందఱును జయ జయ ధ్వనులఁ గావించిరి. అప్పుడు వనరాజు మరల "న్యాయముగ సింహాసనము నధిష్టింపవలసిన యీ మహారాజు దీనునివలె దేశత్యాగియై తిరుగుచున్నాడు. ఈతఁ డిప్పుడు మీ సహాయ్యమును గోరుచున్నాడు— సోదరులారా! ఈసమయమున మీరీతనికి సహాయ్యము చేయవలదా?"

అనియెను. నలుదెసలనుండియు "ప్రాణముల నర్పింతుము—మహారాజాజ్ఞకై ప్రాణముల నర్పింతుము—దురాత్ముఁడగు విజయరాయనిఁ బదభ్రష్టునింగావింతుము!" అను ధ్వనులు బయలుదేఱి యయ్యరణ్యము నంతను సమాందోళితముగఁ జేసివైచెను.

పిమ్మట వనరాజు "నడువుఁడు! మనమందఱమును బోయి యా పాపాత్ముని శిక్షించి నిడుప్రోలు సింహాసనమున నీ ధర్మమూర్తిని నిలుపుదము-అరణ్యరాజ్యమును నిష్కంటకముగ జేయుదము" అనియెను.

"మహారాజా! నడువుము!—ఇంకను నాలస్య మెందులకు? ఇప్పుడే బయలుదేఱి పోవుదము" అను సుత్సాహపూరితధ్వనులు సేనలనుండి బయలువెడలెను.

మరల వనరాజు "మఱియు నీ యువరాజు మనవాఁడగుటకు గురుదేవుఁడగు శారదానందస్వామి యాజ్ఞానుసారముగ మన శ్యామలను బెండ్లియాడుట కిష్టపడుచున్నాడు—నిడుప్రోలు రాజ్యమునకును మనకును వింతవఱకు విజయరాయని మూలమున గర్భశత్రుత్వ మేర్పడినది—ఇప్పుడీ యువరాజు మూలమున నదియంతయును నిర్మూలమగుటయే కాక విశేషించి పరస్పరము శాశ్వతబంధుసంబంధ మేర్పడఁగలదు—అందుకొఱకే యీ యువరాజు మన శ్యామలను వివాహము చేసికొనుట కంగీకరించి యున్నాడు. ఇంతటినుండి మన శ్యామలయే నిడుప్రోలు రాజ్యమునకు మహారాజ్ఞీమణి కాగలదు" అనియెను.

"శ్యామలాదేవికి జయ! శ్యామలాదేవికి జయ!" అను ధ్వను లంతటను బ్రతిధ్వనింపసాగెను.

కోలాహలధ్వను లడఁగిన పిమ్మట వనరాజు "ప్రాతఃకాలమున శ్రీ శారదానందస్వామివారు శ్యామలతోఁ గలసి యీ మందిరమున సాక్షాత్కరించెదరు. రేపు దేవీసమ్ముఖమున మీ సమక్షమున శ్యామలా వివాహం జరుగును. కళ్యాణోత్సవానంతరమున మనమందఱమునుగలసి జగన్మాత నారాధింపము-తరువాతనే విజయయాత్ర-ఇంక మీతో విశేషముగ జెప్పవలసిన దేమియును లేదు. ఇన్ని దినములనుండియు నేను మీ కుపదేశించిన యాయుధవిద్య సఫలమగునట్లుగ మీరు దురాచారుఁడగువిజయ

రాయని శిక్షించి పదభ్రష్టునిం జేయఁగలిగినచో నా సకలపరిశ్రమలును సార్థకములు కాగలవు. ఇది మొదలుగ మీకు నేను సర్వసేనాధ్యక్షుఁడను గాను—ఇప్పటినుండి యీ యువరాజే మీకందరకును సర్వసేనాధిపతి—మీకందఱకును మహారాజు-ఎల్లవిధముల నీతని యాజ్ఞల శిరసావహించుచు నందరును బ్రవర్తింపవలయును—నేనిప్పుడు రహస్యముగ విడుబ్రోలు నగరమునకుఁబోయి విజయరాయని గూఢతంత్రముల గ్రహించుచుండెదను. మీరందఱు నీ మహారాజు ననుసరించి రెండుదినములకుఁ దరువాత దండయాత్రకు బయలుదేరవలయునని నేను వేరుగఁ జెప్పనక్కఱలేదు" అనియెను.

అంతలో నా ముప్పదివేలమంది కోయలును దేవీమందిర సమ్ముఖమున మోకాళ్ళపై నిలువబడి చేతులనెత్తి యేకగ్రీవముగ "ఓ జగన్మాతా! మేమిప్పుడు నీసన్నిధిని శపథము చేయుచున్నాము—యుద్ధమున శత్రువుల జయింతుము—కాదేని మరణింతుము—కాని యుద్ధక్షేత్రమునుండి పిఱికిపందలమై వెనుదిరుగఁబోము" అని బిగ్గఱగఁ బలికిరి. అనంతరము వారందఱునులేచి నిలువఁబడిరి.

అప్పుడు రామరాయలు "సోదరులారా! నేను చిరకాలము మీకు ఋణస్థుడనై యుండెదను—సమయమైనప్పుడు నా కృతజ్ఞతను వెల్లడించెదను" అనియెను.

"మహారాజునకు జయమగుగాక!" అను ధ్వనులు దశదిశల నిండిపోయెను. ఆనాఁటిరాత్రియే వనరాజా మందిరమును బరిత్యజించి విడుబ్రోలు పురాభిముఖుడై బయలుదేఱెను. పోవునప్పుడు రామరాయలాతనిం జూచి "మిత్రమా! ముందుగ సరళ సమాచారమును దెలిసికొనుము" అనియెను. అప్పుడు వనరాజాతనింజూచి "నాకీమాట చెప్పవలయునా?" అనియెను.

మఱునాఁటి యుదయమున శారదానందస్వామి శ్యామలతో దేవీమందిరమునఁ బ్రత్యక్షమయ్యెను. చిరకాలమునకు గురుదేవునిం దర్శించి కోయలందఱు నానందధ్వనులఁ జేయనారంభించిరి. ఆనాఁడే కోయలందఱ సమక్షమునను దేవీసమ్ముఖమున యువరాజునకును గోయల

శ్యామలకును వివాహమయ్యెను. ఏమోగాని పిచ్చిశ్యామల పెండ్లివేళ నేమియు మాటాడలేదు. వివాహమైనతరువాత నామె కోయలలోఁగలిసి యాడుచుఁ బాడుచు దిరుగనారంభించెను. ఈ వివాహమహోత్సవమున కోయ లనేకవిధములు నాడుచుఁ బాడుచుఁ నానందించిరి.

మఱునాడు శారదానందస్వామి మహాసమారోహముతో దేవీపూజ గావించెను. ఆ సమయమున గోయ లనేక బలిప్రదానములంగావించి జగన్మాతను బూజించిరి. అనంతర మందరును సురాపానముగావించి యానందోన్మత్తులై యా పగలును రాత్రియు నానందముతో గడిపివైచిరి. పరదినమునఁ బ్రాతఃకాలముననే వారందఱును శిబిరములవిడిచి పిడుఁ బ్రోలు దండయాత్రకు బయలుదేఱిరి. శ్యామల మౌనముతో నొక్కచో నిలువబడి వారి ప్రయాణసంభరమును దిలకించుచుండెను.

ప్రయాణ సమయమున రామరాయలు శారదానందస్వామికి నమస్కరించుటకై వచ్చెను. అప్పుడు స్వామి యాతని నాశీర్వదించి "వత్సా! పొమ్ము! యుద్ధమున విజయుఁడవగుము! శ్యామల యిచ్చటనే నాయొద్ద నుండును. ఈ పిచ్చిదానిని మహారాజ్ఞిగా జేయ వలయునని తోచినప్పుడు నీవీమెను దోడ్కొని పోవచ్చును" అనియెను. రామరాయలు మౌనముతో స్వామికి నమస్కరించి కోయసైన్యముతోఁ గూడ యుద్ధయాత్ర గావించెను.

## తొమ్మిదవ ప్రకరణము

సన్యాసి చెప్పిన మాటలవలన మహారాజగు విజయరాయలు నిశ్చితుఁడై యుండెను. ఆతని హృదయమునందున్న భయంకర బాలికామూర్తి యంతర్హితయై పోయెను. ఆ బాలిక హస్తములయందు మరణింతునేమో యను సందేహము వదలిపోయెను. ఇఁక నాతనికి భయంకర స్వప్నములు తోచుటలేదు. కాని పితృహంతకుని హృదయమున శాంతి యెట్లుండును? పితృహత్యా మహాపాపపూరితంబగు హృదయమున నెట్టి యగ్నిజ్వాల

ప్రజ్వరిల్లుచుండునో దానిని జల్లార్చుటకు సమర్థమగు జల మీ ప్రపంచ మునం దెచ్చటనులేదు. విజయరాయ లానందప్రమోదములో మునింగి యాయాతనను మఱచిపోవలయునని చూచుచుండెను. సురాపానాదుల వలన నొడలుమరచి యా దుస్సహ పరితాపమును మఱచిపోవలయునని ప్రయత్నించుచుండెను—కాని యా పరితాపమును మఱచిపోవుటయెట్లు?

మహారాజ్ఞియై మురళ సకలదుఃఖముల నొక్కసారిగా మఱచి పోయెను—విలాస సాగరతరంగముల నీదుచు నామె తన్నుఁ దానే మఱచియుండెను. ఈ ప్రపంచమున దుఃఖమనిగాని, కష్టమనిగాని యొకటి యున్నదను జ్ఞానమే యామెకు లేకుండఁబోయెను. పుట్టినది మొదలుగ నెట్టికోరిక నామెతన హృదయమునఁ గ్రమక్రమముగఁ బెంచి పోషించినదో యట్టికోరిక యిన్నాళ్ళకు సఫలమైనది. కేవల నామ మాత్రముచే నామె మహారాజ్ఞియై యుండలేదు. విజయరాయలు రాజ్య మును జూచుకొనుటలేదు—అతడు నిరంతరము నామోదవిలాస నిమగ్నుఁడై యుండెను. అందుచే మురళయే యిప్పుడు మహారాజు—ఇతరులపై నధికారమును బ్రదర్శించుటయం దెట్టి సుఖమున్నదో కేవలము మురళ కొక్కతెకే తెలియును. ఆమె సుఖమునకుఁ బరిమితి లేదు—పోలికయును లేదు.

కాని సుఖము మిగులఁ జంచలమైనది—ఆకస్మికముగ మురళ సుఖాకాశమున దుఃఖమేఘోదయ మయ్యెను. మురళ శాంతిపూర్ణ హృదయమున నశాంతి యావరించుకొనియెను. సరళ కుమారునిఁ గన్నదను సంగతి మురళ వినియెను. మురళకు సంతానములేదు. సరళ కట్టి భాగ్య మెందులకు? తనకు లేనిది యితరులకు లభించినది—ఇఁక మురళ యెట్లు సహింపగలదు? ఇతరులయినచోఁ గొంచెము సహింప వచ్చును—కాని సరళ పుత్రవతియైనది! మురళ దీనినెట్లు సహింపగలదు?

ఆనందప్రవాహమున మునిఁగి తేలుచున్న మురళ సరళ వృత్తాంతమునే మఱచిపోయినది—ఇప్పుడామెకుఁ బుత్రజనన మైనదని విన్న తోడనే మురళ కుత్సాహభంగ మయ్యెను. అప్పుడామె తనలో "అది యింకను బ్రదికి యున్నాదా?—అట్లు బ్రతికియున్నంతవఱకు నాకు సుఖములేదు" అనుకొనియెను.

ఏమి మురళా! సరళ నీమార్గమున కెన్నఁడును గంటకముగ నుండలేదే! ఇతరులను దుఃఖపెట్టుట యెట్లో యామెకుఁ దెలియనే తెలియదే! ఆమె మూలమున నెట్టి యల్పకీటకమునకైన నపకారము కలుగుట కవకాశములేదే! మురళా! అట్టి సరళస్వభావయగు సరళను మార్గకంటకముగను సుఖాంతరాయముగను భావించుచున్నావేమి?—

సరళ కుమారునిఁ గన్నదనుమాట విన్నప్పుడే మురళ హృదయానందమంతయు నంతర్హితమైపోయెను. ఏమూలనుండియో వచ్చి యామె హృదయాంతరాళమునం దొక మహానలజ్వాల యుదయించి ప్రజ్వలింపసాగెను. ఆ దుస్సహాగ్నిజ్వాలలచే నామె హృదయము మండుకొని పోవుచుండెను. అప్పుడామె "ఎంతపని జరగినది? ఇంత కష్టపడి చేసిన ప్రయత్నమంతయుఁ దుదకు ధ్వంసమైపోయినది! ఈ విధముగా సరళయే మహారాజ్ఞియైనది—ఇంతేకాదు—మహారాజ మాతకూడ నైనది—నాకింకను నొక్క కుమారుఁడైన కలుగలేదేమి? సరళకే ముందుగఁ బుత్రోదయమయ్యెను—అతడు మహారాజగును. ఆమె కొడుకే మహారాజైనచో నేనప్పుడు దాసికంటె నధమురాలనై పోవుదును—సహింపజాలను—ప్రాణముతో నిఁక సహింపజాలను" అని యనుకొనియెను.

మురళ మునుపటి మురళకాదు. ఒక సంవత్సరమునకుఁ బూర్వమొకప్పుడామె యెట్టి దురాలోచనలలో మునిగియుండెనో యిప్పుడు మరల నట్టి యాలోచనములతో దినదినమును గ్రుంగిపోవుచుండెను. క్రమక్రమముగ నామె వదనమండలమునఁ గాలమేఘచ్ఛాయ యావరించుకొనుచుండెను. మరల నవ్వులును విలాసములును బోయినవి.

దాసదాసీజనులు భయముచే నామెయెదుట బడుట మానుకొనిరి. సఖులు చనవుతో మాటలాడుటకు వెఱచుచుండిరి. మురళ యెవ్వరితోడను మాటాడక తనలోఁదానే విచారించుచుండెను.

# పదియవ ప్రకరణము

మురళ కిప్పుడు తఱచుగ మహారాజదర్శన మగుటలేదు. అతడు ప్రమోదోద్యానమున వారాంగనా పరివేష్టితుఁడై వారి యాటపాటలలోఁ బ్రొద్దుబుచ్చు చుండెను. మురళ యాతనికి రెండు మూఁడు సారులు వార్తనంపెను. కాని యాతఁ డంతఃపురమునకు రాలేదు. అతనితో నాలోచింపకుండఁ బనిచేయుట మంచిదికాదు—ఇతర కార్యముల విషయమున మురళ స్వామియాలోచనకు నిరీక్షించుటలేదు కాని యిప్పుడు తన హృదయ తాపము నడఁగించుకొనుట కేమి చేయవలయునో యాతనితో నాలో చింపక తప్పినదికాదు-అందుచే మురళ విజయరాయని కనేక పర్యాయము లంతఃపురమునకు రమ్మని వార్తనంపెను. కాని విజయరాయలు విలాస నిమగ్నుడై యున్నాడు-మురళం జూచుట కాతని కవకాశము లేకుండెను.

అప్పుడు మురళ క్రోధపరవశ యయ్యెను. ఆమె భయభావము శతగుణాధిక మగుచుండెను. అందుచే నామెయే స్వయముగఁ బ్రమోదో ద్యానమునకుఁ బోవుట కుద్యుక్తురాలయ్యెను. ఆమె వచ్చుచున్నదని తెలిసి రాజపార్శ్వవర్తులు భయముతో నుద్యానమును విడిచిపోయిరి. నాట్యస్త్రీలందఱును దాఁగుకొనిరి. పరిచారికలు భయప్రకంపితలై పోయిరి. ఈ ప్రపంచమున నెవ్వరికి నింతగ భయపడరు. మురళ యుద్యానమునకు వచ్చి చూచునప్పటి కందఱును దాగియుండిరి. మహారాజు మద్యపాన మత్తతచే సగము చచ్చియుండెను. అతడు సంజ్ఞాహీనుఁడై పడియుండె ననుట యత్యుక్తి కానేరదు.

ఇది యంతయును జూచి యసహ్యముతో నభిమానముతోఁ గ్రోధముతో గర్వముతో మురళకూడ నించుమించుగ నున్మత్తురాలై పోయెను. మురళ భర్తయొద్దకువచ్చి బలవంతముగ నాతనిని నిటునటు దొరలించి పిలిచెను. అప్పుడు విజయరాయ లతికష్టముతోఁ గన్నులను విప్పి కాదంబరీ! మద్యపాత్రమును దెమ్ము" అని యస్పష్టముగ బలికెను. మురళ యింకఁ గోపము నడఁచుకొనజాలక "విజయరాయా! నీవింతవఱ కథఃపతితుడవై పోయితివా?" అనియెను.

మురళ వాక్యములు శీతలతమతుషారశీకరములం బోలి విజయ రాయుని హృదయమున బ్రవేశించెను. భయముచే నాతని మైకము నిమిషములో వదలిపోయెను. ఆతడు లేచి కూర్చుండి విస్ఫారిత నయనములతో మురళవంకఁ జూడసాగెను.

ముర—తండ్రినిజంపి సింహాసనము నధిష్ఠించుట యిందుకొరకా?

భయముచే గడగడ వణకుచు విజయరాయలు "ఊరకుండుము! ఊరకుండుము! ఎవ్వరైన వినిపోయెదరు!" అనియెను.

ముర—ఇంకను ద్రాగుబోతవై పశువువలెఁ బడియుండుము! అదియే మేలు!—అట్లయినచో నీ నగరమునందలి ప్రతిగృహమునకును నేనె స్వయముగఁ బోయి పితృహత్యచేసి రాజ్యమును సంపాదించిన పాపాత్మున కేమైనదో, ఎట్టి యధోగతి సంప్రాప్తించినదో, యా పాపమున కెట్టి ప్రాయశ్చిత్తమైనదో—యందఱును వచ్చి చూడుఁడని చెప్పుదును.

విజ—మురళా! నీపాదములఁ బట్టుదును—ఊరకుండుము!

ముర—ఎట్లూరకుండగలను? నీవంటి బుద్ధిహీనున కిట్టి శిక్ష కాకయుండినచో జ్ఞానము కలుగదు.

విజ—నేనేమి చేయవలయునో చెప్పుము?

ముర—లెమ్ము! ఇచ్చట నితరు లెవ్వరును లేకుండఁజూడుము.

అనిచెప్పి మురళ నలువంకలఁ దిలకించి యుద్యానద్వారమును బంధించివచ్చి యాతనింజూచి "సరళకుఁ గుమారుడు కలిగెనట! వినలేదా?" అనియెను.

విజ—ఎవరికి?

ముర—వినబడలేదా? సరళకు—

విజ—చాల సంతోషము!

ముర—చాల సంతోషమా? నీవంటి గాడిద యీ ప్రపంచమునఁ బుట్టి యుండదు.

విజ—ఏమి మురళా! మరల నేనేమితప్పు చేసితిని?

ముర—సరళ కుమారుఁడే నిడుప్రోలు మహారాజగును—అప్పుడీఁక నేమున్నది?

విజయరాయలు పార్శ్వమునందున్న మద్యపాత్రమునకై చేయి చాచెను. అప్పుడు మురళ "అంతటి దారుణకృత్యమును జేసి సింహాసన మెక్కినను లాభము లేకపోయినది. నాకు సంతానమున్నను సరళ కుమారుఁడే రాజగును" అనియెను.

విజయరాయలు సురాపాత్రమును బెదవులయొద్ద నుంచుచుండుటను జూచి మురళ సత్వరముగ నాతని హస్తమును బట్టుకొని క్రోధముతో గర్జించుచు "ఇంకను నీవిధముగ విషపానముం జేయుచుండుటయే పనియా?" అనియెను.

విజ—ఇంచుక త్రాగనిమ్ము! నా మనోబలము తగ్గిపోవుచున్నది.

ముర—ఇఁక బలముతోఁ బనిలేదు—కావలసినంత బలమున్నది.

విజ—పనియున్నది-నీవు చెప్పదలచుకున్నదేమో నేనెరుగుదును.

ముర—చెప్పుము! చూతము!

విజ—సరళ కుమారుని జంపుమందువు.

ముర—నీకు సాహసము లేకపోయినను బుద్ధియున్నదని యిప్పటికిఁ దెలిసినది! ఈపని చేసితీరవలయును.

విజ—నేనెందులకు? నాతోఁ జెప్పుట యెందులకు? నీవే మహారాజవు! నీవాజ్ఞాపించినంత మాత్రముననే పనిజరగిపోవును.

ముర—ఈపని చేయక తప్పదు.

విజ—నన్ను క్షమింపుము—మురళా! నన్నుఁ బట్టుకొనుము—ఆ కరవాల మదిగో! అదిగో—అదిగో—ఆ యున్మాదిని—ఎవరక్కడ? నా కృపాణముం దెమ్ము!—చావవలసియున్నచో ద్వంద్వయుద్ధముననే చచ్చెదను.

అసహ్యముతో మురళ విజయరాయని నోటిలో సురాపాత్రమును వంచెను—ఆ యుష్ణాసవ ముదరస్థమైనతోడనే విజయరాయనికి జ్ఞానోదయ మయ్యెను. అతఁ డప్పుడు నలుదెసల వ్యాకుల నయనములతోఁ జూడదొడంగెను. పిమ్మట నాతడు "మురళా! నీవా! మరల నేనా స్వప్నమునే గాంచితిని" అనియెను.

ముర—నీవలన నిఁక రాజకార్యములు నెఱవేఱునను నాశలేదు. నీవిచ్చటనే మధ్యపానముచేయుచు నధఃపతితుఁడ వగుము. ఇఁక నీతోఁ

జెప్పిన నేమిప్రయోజనము! అనిచెప్పి మురళ యటనుండి వెడలిపోయెను. విజయరాయ లామెను మఱి పిలువలేదు. మహారాజ్ఞిపదశబ్దము వాయు మండలమునఁ గలసిపోయిన తరువాత నాతడు తన సహచరులను బిలిచెను. పిమ్మట మరల సురావాహిని ప్రవహించెను-సంగీతతరంగము లుప్పొంగెను-ఉత్సాహప్రభంజనము చెలరేగెను—కాని విజయరాయని హృదయమున నా యగ్నిజ్వాల చల్లారలేదు.

ఆయగ్ని చల్లారునదికాదు—ఎవ్వడు విద్యుద్బోలురాజ్య సర్వ సేనాధ్యక్షుఁడై యుండెనో, ఎవ్వని పరాక్రమముచే సమస్త శత్రుమండలమును భయప్రకంపిత మయ్యెనో, ఎవ్వని నామశ్రవణ మాత్రమున సకలారణ్యకసమూహమును బలాయితమయ్యెనో యాతఁ డిప్పుడు బాలువికంటె నధముఁడును, నాఁడు దానిచేతి కీలుబొమ్మయు నైపోయెను. ఆ భయంకరాగ్నిచే నాతని హృదయమునందలి యా బలమును—ఆ తేజమును—ఆ సాహసమును—భస్మీభూతములై పోయినవి.

## పదునొకండవ ప్రకరణము

మురళ రాజప్రాసాదమునకుఁ బోయి నగరాధ్యక్షుఁడగు నరసింహరాయలను బిలిపించెను. అతడు వచ్చిన తరువాత దాసదాసీజనమును సఖులనుగూడ నవ్వలకుఁ బంపివైచి యాతనితో "నీకార్యసామర్థ్యమునకు నేను మిగుల సంతసించితిని" అనియెను. గౌరవపూర్వముగ నరసింహరాయలు "మహారాజ్ఞీమణి యనుగ్రహము!" అనియెను.

ముర—నీవు సర్వసేనాధ్యక్షుడ వగుటకు దగినవాడవు.

నర—ఏలికకృప!—

ముర—ఒక ఘనకార్యభారమును నీపైనుంచుటకు మే మిచ్ఛయించుచున్నాము. ఆ కార్యము సఫలము చేయగలిగినచో నప్పుడు మేము నీకు సర్వసేనాధిపత్యము నొసంగదలచితిమి.

నర—మహారాజ్ఞి యాజ్ఞయిచ్చినంత మాత్రమున సేనాకార్యమును నిర్వహించెదను. ఇది యొకటేకాదు. మహారాజ్ఞి సెలవైనచో నెన్ని ఘనకార్యములనైనను జేయుటకు సిద్ధముగ నున్నాఁడను.

మురళ—నేనెఱుంగుదును. నీవంటి సమర్థుఁ డీరాజ్యమునం దొక్కఁడును లేడు—

నర—అదియును మీ యనుగ్రహమే.

మురళ—సరళ కొక కుమారుఁడు కలిగినాఁడు—

నర—ఎంతపని జరగినది ! ఆమెకుఁ గుమారుడా ?

మురళ—ఏమైన నేమి—ఆ కుమారుడు బ్రదికియున్నచో సింహాసనమునకై దేశమున మరల విప్లవము ప్రారంభమగును. రాజ్యశాంతి కొఱకై యా శిశువును దుదముట్టింపవలయును.

నర—ఔను—బ్రదికియున్నచో నన్నియు ననర్థకములే.

మురళ—గురుతరమైన యీ రాజకార్యము నీమూలముననే నిర్వహింపబడవలయును.

నరసింహరాయలు తలఁ దడవుకొనుచు 'ఈదాసున కేమియాజ్ఞ?' అనియెను

మురళ—నీవిప్పుడే కేతకీదుర్గమునకు బొమ్ము ! తరువాత నేమి చేయవలయునో నీకు వేఱుగ జెప్పనక్కఱలేదు.

నర—మహారాజ్ఞీ ! నేను యుద్ధముచేయుట యెఱుంగుదును—కాని నేనెన్నడును ఘాతుకవిద్య నభ్యసించి యెఱుంగను.

నరసింహరాయని స్వరముంబట్టి మురళ మఱియొకలాగున భావించెను. ఆతని యాంతరికోద్దేశమును గ్రహింపవలయునని యామె యుద్దేశము. నరసింహరాయ లవనతమస్తకుఁడై నిలువబడియుండెను. అప్పుడు మురళ "అట్లయినచో నీ మూలమున నీకార్యము నెఱవేఱునను నాశలేదా ?" అనియెను.

నర—దేవీ ! ఎట్లు చేయవలయునో యుపదేశించినచో నట్లు చేసెదను.

మురళ—నీ కుపదేశించుట యన నేమి ?

నర—నేనేవిధముగ నేకార్యమును జేయవలయునో యాజ్ఞాపింపుము—ఇప్పుడే బయలుదేఱి పోయెదను.

మురఁ—నీవు కేతకీదుర్గమునకు బోయి యా శిశువు నెట్లయినఁ దల్లినుండి యెడబాపి దూరముగ దీసికొనిపోయి కత్తితో బొడిచిగాని—మెడనులిపిగాని—

నర—ఇక విననక్కఱలేదు—నేనిప్పుడే బయలుదేఱుచున్నాను.

అనిచెప్పి నరసింహరాయలు గౌరవసూచకముగఁ దలవంచి సెలవుగైకొని యటనుండి వెడలిపోయెను—ఆసమయమునం దెవ్వరో తనుఁ జూచిన ట్లాతఁ డనుకొనియెను. అతడు నిశ్చయముగ నచ్చట నేదియో భయంకర దృశ్యమును గాంచియే యుండెను.

నాఁడంతయు నరసింహరాయ లనేకవిధముల నాలోచించు కొనియెను. ఒకవైపున సర్వసేనాధిపత్యము—మఱియొక వైపున శిశుహత్య—ఇది చేయుటయెట్లు? రాక్షసుఁడు తక్క మనుష్యమాత్రుఁ డెవ్వడైన నిట్టి ఘోరకార్యమును జేయగలుగునా?—సేనాపతిత్వము లభించుననులోభ మిట్టి సందేహముల నుండనీయదు—కాని యందుకొఱ కిట్టి దారుణకార్యము చేయవచ్చునా? ఈ విధముగ నాతఁ డనేకవిధముల నాలోచించుకొనియెను. కాని యేమియును స్థిరపఱచుకొనజాలకపోయెను. అతడు మహోన్నతుఁడు కావలయునను కోరికకలవాఁడు—అట్టి యాశ యాతనికిఁ జిరకాలమునుండి యున్నది. ఇప్పుడా యుద్దేశము క్రమ క్రమముగ బలపడసాగెను. తుదకాతడు "ఈకార్యము నామూలమునఁ గానేరదు—కాని ద్రవ్యము నొసఁగినచోఁ జాలమంది యిట్టి కార్యమును జేయుట కొడఁబడగలరు. అట్లేల చేయింపరాదు? సామాన్యమైన దయకును-మమత్వమునకును లోబడి సర్వసేనా పతిత్వలాభమును వదలుకొనుటయును మంచిదికాదు. కాని యిందువలనఁగూడ నొకకష్టమున్నది. ఎట్లయిన నీరహస్యము బయలఁపడినచో లోకులయెదుట దలయెత్తుకొని తిరుగుట యెట్లు? ఇంతే కాదు—ఎట్లయిన నీ భయంకరకృత్యము వెల్లడి యైనచో రాజబంధు లందఱును మరణదండనము గావింతురు—ఇప్పుడేమి చేయవలయును?—నాకు సేనాపతిత్వముతోఁ బనిలేదు" అనుకొనియెను.

నరసింహరాయలు రాత్రియంతయు నాలోచనా నిమగ్నుడై యుండియు నేమియును స్థిరపఱచుకొనలేక పోయెను. రాత్రి యాతఁ

దొక్కసారియైనను గన్నుమూయలేదు ఈ జీవితమునం దాతఁ డెన్నడు నింతగ నాలోచింపలేదు. సేనాపతి కావలయునను నాశ సామాన్యమైనది కాదు. ఆ యాశచే నాతఁ డాకర్షింపబడుచుండెను. మరల శిశుహత్య యనుమాట తోచినంతనే యాతని సర్వాంగకములును ప్రకంపితములై పోవుచుండెను-అతఁ డేమిచేయగలడు? తుదకు బిచ్చివాడై పోవునా యేమి?

మఱునాటి యుదయముననే లేచి నరసింహరాయ లొంటిగ నెచ్చటికో వెడలిపోయెను. ఇంత యాకస్మికముగ నాతడు నగరమును విడిచిపోవుట కందఱును విస్మితులైరి. మేమెఱుఁగుదుము! అతడు కేతకీదుర్గమునకే బయలుదేఱినాడు!—ఇప్పుడు పాపమునకును బుణ్యము నకును ప్రబల యుద్ధము జరిగినది—ప్రలోభమునకును నహింసకును మహారణము జరగినది-తుదకు బాపలోభములకే విజయము కలిగినది.

నరసింహరాయ లొంటరిగనే కేతకీదుర్గమునకు బోయెను. అతడు తనలో "రణక్షేత్రమున నేనెన్నియో హత్యలఁ గావించితిని. అరణ్య క్షేత్రమునఁగూడ లెక్కలేనన్ని హత్యలఁ గావించితిని—ఒక్క శిశుహత్య గావింపజాలనా? విశేషించి యీ కార్యము రహస్యముగ నేనే చేసినచో నెవ్వరికిని దెలియబోదు" అనుకొనెను.

పాపాత్ము డిట్టే తలంచుకొనును-కాని పాపముమాత్ర మెప్పటికైన బయలుపడక మానదు—చాలమంది పాపకార్యములఁ జేయుపట్టున నీ విధముగనే మనస్సును ప్రబోధించుకొనుచుందురు— అప్పుడు హృద యాంత రాళమునుండి యస్పష్టస్వరమున "పాపము చేయవలదు" అను మాటలు వినఁబడుచునే యుండును కాని కొంద ఱామాటలను వినిపించుకొనరు కొందరా హితవచనములను గ్రహింపజాలరు— కొందరా పవిత్రభావములను భావింపజాలరు.

## పండ్రెండవ ప్రకరణము

నరసింహరాయలు కేతకీదుర్గమున బ్రవేశించెను. కాని రాజకుమారియగు సరళాదేవిని దర్శించుట కాతడు సాహసింపజాలకపోయెను. అతడు మొట్టమొదట సరళ వృత్తాంత మంతయును దెలిసికొనియెను. సరళ కెట్టి వినోదములునులేవు. ఆమె

యెవ్వరితోడను మాటాడుటలేదు ఆమె ఎప్పుడోగాని శయ్యాగృహమందిరమును విడిచి వచ్చుటలేదు. భోజనమునకైన పిలువగా బిలువగా నెప్పుడో యొకప్పుడు భుజియించును. ఆమె మొగముఁజూచిన గుండెలు బ్రద్దలైపోవును. ఆమె కన్నులనుండి యశ్రుధారలు నిరంతరము ప్రవహించుచునే యుండును. దాసదాసీజన మామె సమ్ముఖమున నుండుటలేదు. కఠినహృదయులగు ప్రతీహారులుకూడ నామె కష్టములకు దుఃఖించుచుందురు. వకుళకూడ నామెతో మాటాడుటకు సాహసించుటలేదు. ఏమి మాటాడబోయినను నామెకేమి జ్ఞప్తికివచ్చునో యేమిచెప్పిన నామె హృదయ మెంత నొచ్చునో యని వకుళకూడ నేమనుటకును శంకించుచుండెను. ఆమెకు జెప్పవలసిన మాటలుమాత్ర మేమున్నవి? రామరాయనిమాట — సింహాసనముమాట — పాప మాశిశువుమాట — మాట యెత్తినంతనే యామె శోకము పొంగిపోవుచుండును — కన్నుల నీరు నిండిపోవుచుండును — ఇఁక నెవరేమి మాటాడగలరు?

సరళ యేడ్చుటలేదు గట్టిగ యేడ్చినచో నామె హృదయమున నింతటి వేదనయే యుండకపోవును. ఆమె పైకి దుఃఖించుటలేదు; ఆ దుఃఖమునకు వికాసములేదు — స్ఫుటత్వములేదు; కేవల మాంతరికమై యుండెను — అందుచేతనే యామెను జూచిన గుండె పగిలిపోవును — అందువలననే యామె దుఃఖము దుస్సహమైయుండెను. ఆమె మొగము చూచినచో నెట్టి కఠినహృదయుల కైనను గన్నీరు రాకమానదు.

సరళ తన కుమారుని నొక నిమిషమైనను విడువక తనచెంతనే యుంచుకొనుచుండెను. తుదకు వకుళకైన నిచ్చుటలేదు. ఈప్రపంచమున విశ్వసింపదగిన వారామె కెవ్వరునులేరు. మందభాగ్యురాలగు నామె రేయంబవలు కుమారుని నొడియందుంచుకొని యేడ్చుచుండును. ఆమెకు బుత్రుడే జీవితాలంబనము—సరళ పుత్రుని నొక నిమిషమైనఁ జూడక యుండజాలదు—కుమారుని నెప్పుడు నెత్తుకొనియే యుండుటచే నామె శరీరమంతయు మలినమైపోయెను. శిశుసంరక్షణమునందే నిరంతరము నిమగ్నయై యుండుటచే నామె శరీరస్వాస్థ్యము చెడిపోయెను. సరళకు

మునుపటి రూపములేదు—మునుపటి సౌందర్యములేదు—మునుపటి లావణ్యములేదు—ఒకప్పు డానందసుఖస్వరూపిణియైయున్న యామె యిప్పుడు దుఃఖస్వరూపిణియై యుండెను.

ఈ సంగతులన్నియును విని నరసింహరాయలు చాల విచారించెను. అప్పుడాతడు తనలో "ప్రేమావతారమూర్తియగు విట్టితల్లి యొడినుండి యా ముద్దుబిడ్డను నేనెట్లు వేఱుసేయఁ గలుగుదును? ఇట్టి మందభాగ్యురాలికి మఱియు నిట్టిపుత్రశోక దుఃఖమును నేనెట్లు కల్పింపగలుగుదును? ఆమెకష్ట మీవరకే పరిపూర్తి నందియున్నది. ఆమె శోకము పరమావధి నందియున్నది—ఇఁక నామె యించుక కష్టమునైనను, వించుక శోకమునైనను సహింపగలదా? ఆమె నిశ్చయముగ మరణింపగలదు. అప్పుడు నన్ను శిశుహత్యాపాపమే కాక స్త్రీహత్యాపాతకము కూడఁ జుట్టబెట్టుకొనును—నేనింతటి దారుణకృత్యమును జేయఁజాలను" అని భావించుకొని యాతడు సరళను జూడకుండగనే మరలిపోవుట కుద్యుక్తుడయ్యెను.

కాని యాతఁ డట్లును జేయజాలకపోయెను. మరల దనలో "నేనీకార్యమును సాధింపకుండ రాజధానికిఁ దిరిగిపోయినచో మురళ నాపై దారుణక్రోధమును వహింపఁగలదు. నిశ్చయముగ నామె యేదియో మిషకల్పించి నా యుద్యోగమును నూడఁబెఱికించును. నన్నుఁ గారాగారములో గూడ ద్రో[illegible] ఆ మరణము నేను నిర్బంధితుడనై యుండవలసినదే. [illegible] నాకీకార్యము చేయుటకంటె గత్యంతర మేమిఁ[illegible] భావించుకొనియెను.

[illegible]న్నయో విధముల నాలో నిశ్చయించుకొనియెను. [illegible]టకచోటికిఁ దీసుకొని [illegible]కపోయినను బాధలేదు. [illegible]ను జంపివచ్చితినని [illegible]రళయొద్ద నుండి [illegible] యా బిడ్డను [illegible]సింహ

బ[illegible]
తప్పిం[illegible]
తీసికొనఁ[illegible]
రాయలు సర[illegible]

దాసివచ్చి "రాజకుమారీ! రాజధానినుండి నగరాధ్యక్షుఁడగు నరసింహరాయలు వచ్చియున్నాడు. ఆవశ్యకంబగు రాజకార్య విషయమున మాటాడుటకై యాతడు మీదర్శనమును గోరుచున్నాడు" అని మనవిచేసెను. సరళ యా దాసిమాటలను బాగుగ దెలిసికొనఁ జాలక వ్యాకులిత నయనములతో నామెవంకఁ జూచుచుండెను. అప్పుడు దాసి మఱియేమియు మాటాడఁ జాలకపోయెను

అప్పుడు వకుళ సరళం జూచి "సఖీ! యించుక ధైర్యము వహింపుము. అధైర్యపడవలదు. ఈ విధముగ నున్న నిన్నుఁజూచి లోకు లేమనుకొందురు. యువరాజు రాజ్యమున లేనంతవఱకు నీవే విద్యుద్బోలు మహారాజ్ఞి వను మాట మఱచియుంటివా యేమి?" అనియెను "మహారాజ్ఞి" అను మాట వినుటతోడనే సరళ మెల్లగఁ దలయూచి తన యంగీకారమును సూచించుచుండును. ఇప్పుడు కూడ నామె యట్లే చేసెను. ఇంతేకాక యిప్పుడు తన పసిబిడ్డను వక్షమునం జేర్చుకొని దాచుకొనియెను—తన ముద్దుబిడ్డ నెవ్వరో యెత్తుకొనిపోవుటకు వచ్చియుండిరని యామె మనసున బోధయగుచుండెను—ఆమె యేమియు మాటాడకుండుటం జూచి వకుళ "సఖీ! దర్శనమునకై నరసింహరాయని రమ్మని చెప్పవచ్చునా?" అనియెను.

ఇంతసేపటికి సరళ "నగ[illegible] [illegible]వ్వరు?" అనియెను.

వకు—అతడు నగ[illegible] [illegible]జకార్యము కొఱకు వచ్చియున్నాడు.

సరళ కొంతసే[illegible] [illegible]నేను మందభాగ్యురాలను. న[illegible] లేదా? నా ముద్దుబిడ్డను[illegible] వచ్చియున్నారని నా [illegible]

వకు—సఖీ [illegible] పోపునంతటి [illegible]

నగ[illegible] [illegible]మ్మట

"రమ[illegible]

[illegible]పోయెను.

# పదమూఁడవ ప్రకరణము

నరసింహరాయలు వచ్చెను. మూర్తీభవించిన శోకదేవతవలె నున్న సరళాదేవిం జూచిన తోడనే యాతని హృదయము భగ్నమైపోయెను—అకస్మికముగ నాతని తలపై పిడుగుపడినట్లయ్యెను. ఆతని హృదయకందరమునఁ దటాలున నొక భయంకరాగ్నిజ్వాల యుదయించి ప్రజ్వలించుచుండెను. ఆపాద మస్తకమును సర్వాంగకములును విద్యుత్ప్రవాహ పూరితములైనట్లుండెను. ఆతఁ డప్పుడు తాను భావించుకొన్న దానికంటె సరళ దుఃఖము శత గుణము అధికముగనే యున్నట్లు ప్రత్యక్షముగఁ దెలిసికొనియెను. ఇంత కంటె నధికదుఃఖములను నెవ్వరు నెన్నడు ననుభవించి యుండరని యాతడు భావించుకొనియెను. ఆతఁ డామెనుజూచి కొంత సేపటివఱకును గొయ్యవలె నిలువఁబడిపోయెను.

పిమ్మట నాతఁడు " నేనెంతటి పాషండుడను !—ఎంతటి నరాధముఁడను ! ఎంతటి క్రూరజంతువను ! ఈ మందభాగ్యురాలి యొడిలోని పసిబిడ్డను—ఈమె ప్రాణముల కేకమాత్రావలంబ స్వరూపమైయున్న యీ చిన్నశిశువును-ఈమె హృదయసర్వస్వమైయున్న యీ పసిపాపను-ఈ చిన్నబిడ్డను నిర్దయుడనై యపహరించుకొని పోవుటకై వచ్చితినే! నాకు సేనాపతిత్వ మక్కఱలేదు—విద్యుత్ప్రోలు రాజ్యమునందే కాదు—జగత్తునందలి సకల సామ్రాజ్యముల యందునుగల సకలైశ్వర్యములను నా కొసంగినను నేనిట్టి దారుణకృత్యమును జేయజాలను—చేయఁజాలను—" అని యనుకొనియెను.

ఆతని హృదయము దుఃఖముతో నిండిపోయెను. ఇఁక నాతఁడు సహింపజాలక బిగ్గరగ నేడ్చుచు రాణియగు సరళాదేవి సమ్ముఖమున మోకాళ్లపై వంగి " మహారాజ్ఞీమణీ ! నేనిప్పుడొక దారుణకృత్యమును గావించుటకై యిచ్చటకు వచ్చియుంటిని. ఆ మాటలలో నిఁకఁ బ్రయోజనములేదు. భగవంతుడు నన్నా భయంకరకూపమునం బడిపోవ కుండ గటాక్షించినాఁడు—దేవీ ! నేను మొదలు నరసింహరాయలు

నీదాసాను దాసుఁడు—ఇప్పుడే నేను యువరాజుతో గలియుటకై పోవు చున్నాడను—ఇఁక భయములేదు. ఆతడు శతసహస్రారణ్యాసైనిక సమేతుఁడై రాజధానికి వచ్చుచున్నాఁడని నేను విశ్వాసపాత్రులగు వారి మూలమున వినియున్నాడను-అతఁడచిరకాలముననేవచ్చి నీదుఃఖములను దొలఁగింప జేయగలడు" అనియెను.

సరళావకుళ లిరువురును నరసింహరాయల చర్యలకు విస్మితలై పోయిరి. వారి కేమియును బోధపడలేదు; అట్లే యాతనివంకఁ దదేక దృష్టితో జూచుచుండిరి. అప్పుడు నరసింహరాయలు "మహారాజ్ఞీమణీ! అనుజ్ఞయైనచో సేవకుఁ డిప్పుడే సెలవు గైకొనుచున్నాడు—ఒకమాట— రాజకుమారుని జాగరూకతతోఁ గాపాడకొనవలయును—ఆ శిశువును నీయొడినుండి వేఱువేయుటకై యెన్నియో కుతంత్రములు జరుగు చున్నవి" అనియెను.

సరళ భయముతో జిన్నిబిడ్డను వక్షమునం జేర్చి దాఁచుకొని కన్నీటితో వకుళం జూచుచు "సఖీ! వింటివా! నా మనసు చెప్పుచున్నట్లే యైనది" అనియెను. వకుళకూడఁ గన్నీరు పెట్టుకొనియెను. "సఖీ! నా ప్రాణములుండఁగా నెవ్వరినైన నింతపని చేయనిచ్చెదనా!" అనియెను.

అప్పుడు నరసింహరాయలు సన్మానపూర్వకముగ "దేవీ! నేనిప్పుడే యువరాజునొద్దకుఁ బోవుచున్నాను. ఏమైనఁ జెప్పవలసి యున్నచో ననుజ్ఞ యీయవలయును" అనియెను.

సరళ చాలసేపటివఱకు మాటాడఁజాలక ఏమ్మట నీకాయన దర్శన మైనచో నిట్లు చెప్పవలయును. "సరళ యిక నెంతయోకాలము జీవింపదు- ఆమె మీతో జెప్పవలసిన దేమియునులేదు—మీరు సుఖముగా నున్నట్లు వినుటయే సరళకు సుఖము—కాని—నీ చిన్నకుమారుఁడు—"

సరళ యిఁక మాటాడఁజాలక పోయెను. వకుళ కంఠమును గౌగిలించుకొని యామె వక్షమున మొగమానుకొని యేడువసాగెను. వకుళయును సరళను గౌగిలించుకొని యేడ్చుచుండెను. ఆ దుఃఖమును జూడజాలక నరసింహరాయలు సత్వరముగ నటనుండి వెడలిపోయెను.

ఇట్లు జరగిన కొలఁదికాలమున కొక దినమునఁ బ్రాతఃకాలము నందు రాజధానీనగరమంతటను నొక ప్రవాదము బయలుదేఱెను—నగరాధ్యక్షుఁడగు నరసింహరాయ లైదువేల యశ్వసైన్యముతో నగరమును విడిచిపోయెనని యందఱును జెప్పుకొనుచుండిరి. యువరాజగు రామరాయనితోఁ గలయుటకే యాతఁ డట్లు పోయియుండునని యందఱును భావించిరి. ఈవార్త వాయుక్షిప్తంబగు నగ్నిజ్వాలవలె నొక గృహమునుండి యొక గృహమునకు నగరమంతటను వ్యాపించెను. చూచుచుండగనే యీ వార్త నగరమంతటను బ్రాకెను. నగరమంతయు నీవార్తతోడనే సంక్షోభించిపోవుచుండెను. అందఱును విజయరాయనిచేఁ బీడింపబడి కష్టముల నొందుచున్నవారే కాని యింతవరకు బహిరంగముగ నిట్లు శత్రుపక్షమున నిర్భయముగఁ జేయుటకు సాహసించినవా రొక్కరునులేరు. అందువలన నాతడే ప్రథమ విద్రోహిగా బరిగణింప బడియెను—ఆతడు సామాన్యుడు కాఁడు—నగరాధ్యక్షుఁడు ! రాజ సైనికులలో బ్రధానుఁడు—మహారాజునకు విశ్వాసపాత్రులగు నంగ రక్షకులలో నొకఁడు—నరసింహరాయని యిట్టి సాహస పరివర్తనమున కందఱు నాశ్చర్యనిమగ్నులైరి.

ఈవార్త క్రమముగ మురళకు దెలియవచ్చెను. నరసింహరాయలు మురళ యాజ్ఞాప్రకారము చేయకుండుటయేగాక శత్రువులలోఁ గూడఁ జేరిపోయెనే ! ఈ సంగతి వినినంతనే మురళ క్రోధ దుఃఖాభిమానములచే నున్మత్తప్రాయయైపోయెను.

ప్రమోదోద్యానమునందలి విజయరాయనికిఁ గూడ నీవార్తం దెలుపుటకై యొక ప్రధానోద్యోగివచ్చి "మహారాజా ! నరసింహ రాయలు పంచసహస్రాశ్వ సైనికులతో రామరాయని పక్షమున జేరుటకై పోయినాఁడు" అని చెప్పెను. అప్పుడు విజయరాయలు మదవి భ్రమముతోఁ దేలగన్నులవైచుచు 'ఏరిబోఁడీ! పొడవెతోడీ!' అనియెను.

## పదునాలుగవ ప్రకరణము

ఎచ్చటినుండియో యొక గాయిక వచ్చినది. ఆ కోకిల కంఠస్వరమునకు సాటిలేదు. దేశమం దంతటను నా గాయిక నామము వ్యాప్తమైయుండెను. అపూర్వంబును నసాధారణంబును నగు నామె మధురసంగీతము నాలకించుటకై బాలురును వృద్ధులును, స్త్రీలును, బురుషులును సర్వజనులును వేడుకపడుచుండిరి. కాని సులభముగ నట్టి యదృష్టము లభించుట కుపాయములేదు ; ఆమె యింటింటను గానముచేయు గాయికగాదు. లక్షనిష్కములు విచ్చినఁగాని యామె సభారంగమునఁ బ్రవేశింపదు !

ఆమెరూప మపరూపమైనది—అంతటి సుందరీమణి యీ లోకము నందేలేదు—ఆమె వదనమండలము నొక్కసారి చూచినచో నా యతిలోక రామణీయకమున కెంతవారలైన నింతలో విముగ్ధహృదయులు కాక మానరు-ఆమె వదనమునుండి నిరంతరము నమృతము వర్షించుచుండును-ఆ సుందరవదన మండల సందర్శనముచే హృదయకమల మాశాతరంగ సంచలితమైపోవును. జనులందఱు నామెను జూచి యున్మత్తులై పోవుచుండిరి--ఆమె మధురమోహన సంగీతశ్రవణమునకై యువ్విళ్ళూరు చుండిరి— కాని యామె దర్శనమైన లభియించుటలేదు—ఆమె రాజ మార్గమున బయలుదేరుటలేదు—తన యింటి కెవ్వరును రానిచ్చుటలేదు—తానెవ్వరి యింటికిని బోవుటయులేదు.

ఆమె కీర్తియును గానకౌశలమును బ్రతిగృహమునందును బ్రతి ధ్వనించుచుండెను. కాని యింతవఱ కెవ్వరు నామెను జూచియుండలేదు-ఎవ్వరు నామె గానమును వినియుండలేదు—ఆమె యప్పుడప్పుడు తన యింట నొంటిగఁ గూరుచుండి పాడుచు వీణ వాయించుచుండును— అందుచే నామె గానమును దూరమునం దుండియైనఁ గొందరు కొందరు వినఁగలిగిరి. ఆమె యప్పుడప్పుడు మందిరగవాక్షద్వారముకడ నిలువబడి

రాజమార్గమును దిలకించుచుండును. అందువలనఁ గొందరు కొంద రామెను జూడఁగలిగిరి. అట్లామె గానమును విన్నవారే యట్లామె రూపమును గన్నవారే తమతమ మిత్రులతోఁ బ్రశంసించుచుండిరి. ఈవిధముగా నానోటనానోట నామె ప్రతిభ దేశమందంతటను వ్యాపించెను.

విద్యుల్లోలు నగరమునకు మునుపటిదినములు పోయినవి. ఇప్పుడా యానందవిలాసములులేవు. పూర్వమువలె నిప్పుడింటింటను నృత్య గీతములులేవు. దేశమంతటను భయమే రాజ్యము చేయుచుండెను. మహారాజగు విజయరాయలు స్వయముగ రాజకార్యములఁ జూచుకొన కున్నను మురళ ప్రబలపరాక్రమముతో రాజ్యశాసనములఁ గావించు చుండెను. అంతఃపురమునందే యున్నను నామె తేజము దేశమంతటను వ్యాపించియుండెను. సకల రాజోద్యోగులు నామె పిడికిటిలోనుండిరి. సకల సైనికులు నామెకు దాసానుదాసులై యుండిరి. సకల సామంతులు నామెకు భయపడుచుండిరి. ఎల్లప్పుడు నామె గూఢచారులు దేశమంతటను దిరుగుచునే యుందురు. ఎవ్వరేమి యనుకొన్నను నిమిషములో నామె చెవిని బడుచుండెను. ఎవ్వఁ డెట్టి యపరాధముచేసినను, నెవ్వఁడెట్టి రాజద్రోహముచేసినను దత్క్షణమే మహారాజ్ఞి యట్టివారిని గఠినముగ దండించుచుండెను. ఇతరులకుఁగూడ భయము కలుగుటకై యామె సూక్ష్మపరాధములకైనను గఠినదండనములఁ గావించుచుండెను.

ఈవిధముగ గొందఱు రాజోద్యోగులు కారాగారమున బంధింప బడిరి. చాలమంది ప్రజలకు మరణదండన మయ్యెను. ఒకరిద్దఱు సేనానాయకులుకూడ నవమానింపబడి చంపబడిరి—ఏమని చెప్పుదము! ఒక సామంతప్రభునిగూడ బహిరంగముగ నామె శిరశ్ఛేదము గావింపఁ జేసెను. ఇంతేకాదు—ఆమెచే నియమింపబడిన ఘాతుకులు గుప్తచారులై తిరుగుచుండిరి. రాణి కోపమునకు గుఱియై రహస్యముగఁ గూడఁ జాలమంది యకాలమరణమువాతఁ బడిపోయిరి.

ఇన్నికార్యములవలన విద్యుల్లోలు రాజ్యమునం దెవ్వరి హృద యమునను నానందములేదు — ఉత్సాహములేదు — అందఱును భయ విహ్వలులై కాలముగడపుచుండిరి. ఎప్పు డెవ్వరి ప్రాణములఁ దీయించునో

యెప్పు డెవ్వరిని గారాగారమునఁ బెట్టించునో, యెప్పు డెవ్వరిని దేశము నుండి వెడలగొట్టించునో యెట్లు తెలియును! ఇద్ద ఱొక్కచోఁజేరి రాజ్యమును గూర్చిగాని రాజసింహాసనమును గూర్చిగాని మాటాడుటకు భయపడుచుండిరి. ఇట్టి దురాచారములు దుస్సహములై పోయెను—కాని నివారించుట కుపాయములేదు. ఈ దుష్టత్వములం దలఁచుకొన్నంతనే గుండెలు పగిలిపోవుచుండెను.

మురళ యీ విధముగ రాజ్యమును బరిపాలించుచుండెను. విదుఁబ్రోలు రాజ్య మిప్పుడింతటి కష్టస్థితిలో నున్నది. ఇఁక దేశమునం దానందవిలాసము లెక్కడనుండును? దేశ మిట్టి యవస్థలో నుండగా నా యపూర్వప్రతిభాశాలిని యగు గాయిక రాజధానిం బ్రవేశించెను. కాని యెవ్వరి హృదయములయందును నిప్పు డుత్సాహములేదు. మహారాజు కూడ నిరంతరము సురాపానలోలుఁడై ప్రమోదోద్యానమునఁ గాలము గడపుచుండెను. అతఁ డెప్పుడును వారవనితాగణపరివేష్టితుఁడై యుండెను. ఎట్లయిన నాతని కా గాయిక సంగతి తెలిసినచోఁ దప్పక రప్పించుకొనుననియు నామె గానము నాలకించినచో మహారాజునకుఁ దమయెడల గౌరవము తగ్గిపోవుననియు నూహించి యా వారాంగన లామె మాటయే విజయరాయలకుఁ దెలియకుండజేసిరి. రమణీ మాయ జాలములం దగులుకొన్నవానికి వివేక మెక్కడనుండును!

గాయిక వృత్తాంతము సమస్తజనులకును దెలిసెను. కాని మహారాజగు విజయరాయని కించుకంతయు దెలియలేదు. దేశమునందలి ధనికులగు వారందఱు నామె గానము నాలకింపవలయునని వేడుక పడుచుండిరి. కాని యెవ్వరును మురళ భయమువలన నామెను బిలిపించుటకు సాహసింపజాలకపోయిరి. తుదకు సామంతరాజగు నారాయణరాయ లామెను దనమందిరమునకు బిలిపించెను. నారాయణ రాయలు నవయౌవనుడు. అతని కింకను నిరువదియేండ్లు నిండలేదు. ఇప్పుడాతడు పితృమరణానంతరమున రాజ్యలాభమును బొందియుండెను. ఇంతవఱకు నాతడు రాణిభయముచే నెట్టి వినోదములను గావించుటలేదు. ఇఁక నట్లూరకుండఁ జాలకపోయెను. అతడు తనలో "నేను నా మందిరమున వినోదోత్సవములఁ జేసికొందును—అందువలన రాణికేమినష్టము—

నేనొక గాయిక గానము నాలకింతును—అందువలన రాజ్యమున కేమి నష్టము ? ప్రజల కింతమాత్రము స్వాతంత్ర్యమైన లేవి రాజ్యమున నుండుటవలన నేమి ప్రయోజనము ?" అని భావించుకొనియెను.

ఆతడు గాయికను బిలుచుటకు స్వయముగనే యామె యింటికి బోయెను. నారాయణరాయ లామెను జూచి ముగ్ధుఁడై పోయెను. ఆమె రూపము జగన్మోహనకరమై యుండెను. ఆతఁ డప్పుడు "నీవొకసారి మా మందిరమున గానము చేయవలయును. నీవు కోరిన ధనమిచ్చెదను" అనియెను.

గాయి—ఆర్యా ! గానమే నా వృత్తి !—నీ సభలో గానము చేయుట కేమి ?

నారా—నీకేమి కావలయునో చెప్పుము !

గాయి—నేనెంతయో యాశతో నిచ్చటకు వచ్చియుంటిని—ఎంతయోధనము సంపాదింపవచ్చునని యనుకొంటిని—ఈ మాసము లోపల నొకసభయైన గాలేదు.

నారా—ఈ నగరమునకు మునుపటి దినములు పోయినవి. మునుపటివలెనే యున్నచో నీకెప్పుడును విశ్రాంతియే లేకుండును.

గాయి—అందువలననే నేనిక నిట నుండఁగూడదని నిశ్చయించుకొంటిని.

నారా—కాని మాయింట నొకసభచేసి మఱిపోవలయును—ఈపాటి భాగ్యము నాకుఁ గల్పింపగూడదా ?

గాయి—ఈ దాసియెడల మీవంటివారి యనుగ్రహ ముండవలయును. ఇట నింతమంది గొప్పవారున్నారు. కాని యెవ్వరు నీదాసి ననుగ్రహించినవారు లేకపోయిరి. కేవలము గుణగ్రహణ పారీణులు మీరొక్కరే యగపడుచున్నారు. అందుచే నేనొకనాఁడు మీ సభలో గానము చేయుదును అందు నిమిత్తమై మీరు నాకేమియు నీయనక్కర లేదు. కాని యొక కోరికయున్నది.

నారా—అదియేమో చెప్పుము ! అవశ్యకముగ నట్లే కావింతును.

గాయి—నేను గానముచేయు దినమున నా సభకు రాజధాని యందలి పెద్దమనుష్యుల నందఱ నాహ్వానము చేయవలయును. కేవలము పిలుచుటయే కాదు—తప్పక వారు వచ్చునట్లుకూడఁ జేయవలయును—ఇట్లు చేయకున్నచో నేనొక్క గీతమైనఁ బాడను—మీరు నాయెత్తుధనము పోసినను నేను గానము చేయఁబోను.

నారా—నేనందఱ నాహ్వానము చేయుదును—వారు వచ్చెదరో రారో యిప్పు డెట్లు చెప్పఁగలను ?

గాయి— ఎట్లు వచ్చెదరో యట్టి ప్రయత్నమునే చేయవలయును-

నారాయణరాయ లించుక యాలోచించి " అట్లే చేసెదను—ఎట్లయిన వారల నందఱను సమావేశము గావించెదను " అనియెను.

## పదునయిదవ ప్రకరణము

మహోత్సాహముతో నారాయణరాయల మందిరమున గొప్ప గానసభ జరగును. ఆతఁ డిందు కొఱకు విశేషప్రయత్నములను జేసియుండెను. నగరమునం దాతఁ డాహ్వానముచేయని గొప్పవా రెవ్వరును మిగిలియుండలేదు. రాజబంధువులు మురళి భయముచే రాఁజాలమని ముందుగనే చెప్పివైచిరి. కాని నారాయణరాయ లందఱ యిండ్లకును బోయి వారలతో " ఇంతటి యస్వతంత్రుల మైనచో నీ రాజ్యమునం దుండుట యెందులకు ? " అనియెను. ఈ మాట యందఱిహృదయములను నాటెను. అందువలన నెల్లరును రాణిభయము విడిచి యానందముతో నారాయణరాయల సభకుఁ బోయిరి. ఆనాఁడు మహానందముతో సభావినోదములు సంపూర్ణముగ జరగెను.

అందరును సభకువచ్చిరి. కాని యెవ్వరికిని మనస్థైర్యములేదు. రాణి యేమని తలంచునో, యిందరు నిచ్చటజేరి సభచేసిన సంగతి యామెకుఁ దెలిసిన నేమిచేయునో యెట్లు తెలియును ? గాన మారంభమయ్యెను.

ఆ గానమున నామె యమృతమును గురియించెను; ఆత్మవిస్మృతి యొదవించెను; ఆనందమును బ్రసాదించెను; కుసుమములఁ గ్రుమ్మరించెను; తావులఁ దరలించెను; వెన్నెలల వెలయించెను; మెఱపుల మెఱయించెను; ఆ మధురవీణాస్వరములందా మోహనకలకంఠస్వరములం బోయి యా భావగీతములలో నా సభ్యుల హృదయభావములు లీనములై పోయెను. అందఱ హృదయములను గానము చేయుచుండెను. ఆ మధుర నాదబ్రహ్మ మానందబ్రహ్మమున లీనములగుచుండెను. సభ్యులందరును దదేకధ్యానమునం దుండిరి.

అప్పు డా సంగీతసరస్వతి యీ క్రిందివిధముగ గానముచేయ నారంభించెను.

" ధరణీధరమునె_త్తి • దావాగ్నిమ్రింగి
చెలువుగందక యుండఁ • జిన్నికృష్ణుండు
రాసమండలములో • రమణులందఱను
వివిపించుచున్నాఁడు • వేణుగానంబు
కన్నులున్నఫలంబుఁ • గనుఁగొందమమ్మ !
కామినీమణులార ! • కలసిరారమ్మ !

* * * *

దెసలెల్లఁ దెలివందెఁ • దిమిరంబుడిందెఁ
జలువతెమ్మెరవీచె • జాబిల్లిదోఁచె
మనసులోఁ గుందుచు • మానదర్పమున
నెన్నాళ్ళులిటులున్న • నేమగునమ్మ ?
జగదేక విభుఁడైన • శ్యామసుందరుని
సుందరీమణులార ! • చూచిరారమ్మ !

ఇట్లు గానముచేయుచు నామె వృద్ధుఁడగు సదాశివరాయని సమ్ముఖమున హస్తాభినయనముం గావించుచు నృత్యము చేయసాగెను. ఆ వృద్ధుని దృష్టి యామె కోమలహ_స్తముపై బ్రసరించెను. క్రమముగ నాదృష్టి యామె యమూల్యాంగుళీయకముపైఁ బడియెను. అప్పుడాతఁ డదరిపడి చటాలునలేచి నిలువబడియెను. అంతలో సిగ్గుపడి మెల్లమెల్లగ

నెప్పటియట్లు కూర్చుండెను. యువతి తన సమ్ముఖమున నృత్యము చేయుటచే నా వృద్ధుఁ డట్లుదరిపడియెనని భావించి యందఱును నవ్వసాగిరి. ఆ గాయిక యచ్చే యగ్రవర్తులగు మాన్యసభాసదుల యందఱ యొద్దకును బోయి నృత్యముచేయుచు నభినయింపసాగెను.

అప్పుడు సభ్యు లొకరిమొగ మొకరు చూచుకొనఁదొడంగిరి. అందఱ హృదయములును జలించిపోవుచుండెను. అంతలో గానముకూడ నాఁగిపోయెను. అప్పుడు సదాశివరాయలు లేచి " ఓ సంగీతసరస్వతీ ! నీ మోహగానములో ముగ్ధులమైయున్న మాకు శ్రీకృష్ణుఁడు గోప బాలికలతో గలసి మురళీగానము చేయుచు సాక్షాత్కరించి యున్నట్లు తోఁచుచున్నది — ఇది సత్యముగనే భావించుచున్నాము " అనియెను.

అప్పుడా గాయిక యవనతవదనయై " రసగ్రహణపారీణులగు మీమూలమున నా పరిశ్రమ సఫలమైనది " అని సెలవు దీసుకొని వెడలి పోయెను. క్రమముగ నందఱును వెడలిపోయిరి. కాని యేదియో మిష పెట్టుకొని రాజబంధువులుమాత్ర మచ్చటనే నిలిచియుండిరి. అప్పుడు వృద్ధుఁడగు సదాశివరాయలు స్వయముగఁ బోయి మందిరద్వారములను గవాక్షములను మూసివచ్చెను అప్పుడు సదాశివరాయలు మిగిలిగ బంధువులం జూచి " నిశ్చయముగ యువరాజు జీవించియున్నాఁడు ! మనము విన్నమాట సత్యమే. అతదే బుద్ధిమతియగు నీ గాయికను దనదూతగా మనయొద్దకు బంపియున్నాడు. అతడు కోయలతోఁ గలసి వచ్చుచు మనకీ విధముగ వార్తనంపియున్నాడు. రామరాయ నామాంకిత మగు గాయిక యంగుళీయకముం బట్టియే యిది యంతయు సత్యమని మనము నిశ్చయింపవచ్చును మన మిదివఱకే చాల బొరపాటుపడి తగినఫలము ననుభవించుచున్నాము. ఇట్టి పాపమునకు ప్రతీకారముగ నిప్పుడు మనమందఱము నేకీభవించి యే సుగుణరాశి కీ సింహాసనము న్యాయముగ లభింపవలసియుండెనో యాతని పక్షమునఁ బ్రాణములనైన విడిచి ప్రభుఋణమునుండి విముక్తులము కావలయును. ఈ విషయమున నా బంధువులగు మీయభిప్రాయ మేమియో వెల్లడింతురుగాక "అనియెను.

అప్పు డందొకడు "మీరు చెప్పినమాటలు బాగుగనే యున్నవి. కాని రామరాయలు మహారాజును హత్యగావించి పలాయితుఁడయ్యెను గాదా? అట్టివాని పక్షమున మనము చేరుట న్యాయముగ నుండునా?" అని యెను.

సదా—వృద్ధమహారాజును రామరాయలు చంపెననుమాట యసత్యము!

ఒకడు—మఱియెవ్వడు చంపిరి?

సదా—విజయరాయలు—

ఒక—విజయరాయలు తండ్రి నెందులకుఁ జంపుకొనును? ఈమాట విశ్వాసార్హముగలేదు.

సదా—లోకమందఱ నిట్టి బుద్ధిహీనులను జేయవలయుననియే మురళి యీ యంత్రమును బన్నినది.

ఒక—మురళి యేమిచేసినది?

సదా—విజయరాయని గాడిదం జేసి యాతనిచేఁ దండ్రిని జంపించినది.

ఒక—ఈసంగతి మీకెట్లు తెలిసినది?

సదా—వృద్ధమంత్రి తన మరణకాలమునందు నాకీసంగతి యంతయు జెప్పియున్నాడు.

ఒక—పాప మాతఁడా విచారముచేతనే యాకస్మికముగ మరణించియుండును. అప్పుడు విద్యాధరుడుకూడ నీవిషయముం గూర్చి వాదించియున్నాడు. సభ్యుల ప్రశ్నములకు బదులుచెప్పక యూర కుండెనేమి?

సదా—ఏమని చెప్పును? ప్రప్రథమమున మురళి చెలియగు కమల యాతనికీ వృత్తాంతముం జెప్పినది. ఆమెపేరు బయటఁబెట్టినచో నామెకొంప మునుంగునని యెంచి స్వార్థత్యాగియగు విద్యాధరుఁడు కారాగారమునఁ దానే బంధింపబడినాఁడు. అందువలననే యాతని కట్టి కష్టమువచ్చినది—అందువలననే మనకిట్టి కష్టము వచ్చినది—

అందఱు నామాటల నాలకించి పశ్చాత్తప్తహృదయులును గోపోద్రిక్తమానసులు నై పోయిరి. అందఱును రామరాయల పక్షమునఁ జేరుట కేకగ్రీవముగ శపథములఁ జేసికొనిరి. మరల నొకసారి యా గాయికిం దర్శించి యువరాజ సమాచారములం దెలిసికొనుటకై సదాశివ రాయలు నియమింపబడియెను.

## పదునాఱవ ప్రకరణము

మురళి యిప్పుడు క్రోధముచే రాక్షసియై పోయెను. ఆమెకు గౌరవపాత్రుడును, విశ్వాస నీయుఁడునగు నగరాధ్యక్షుడు నరసింహరాయలు శత్రువులలోఁ గలసి పోయెను. ఇంతేకాదు—ఆమె యనుమతిలేకుండ నారాయణరాయలు గానసభ గావించెను. రాజబంధువులందఱు నామె యాజ్ఞలేకుండ నా సభకు బోయియుండిరి. ఇంతవఱ కెవ్వరు నామె యనుమతిలేకుఁడ దినకృత్యములను గూడ జేసికొనుటకు సాహసింపలేదు. అట్టివా రిప్పు డామె నుపేక్షించి వినోదక్రీడల మెలంగుచుండిరి ఇంతేకాక సభానంత రమున రాజబంధువు లందఱును గలసి యేదియో యేకాంతాలోచనము గావించినట్లుకూడ నామెకుఁ దెలియవచ్చెను.

అఁడుసింగము వలలోఁజిక్కి యతిక్రోధముతో దన శరీరము నెట్లు కొఱికి పారవైచుకొనునో యట్లే మురళియుఁ గ్రోధముచే నోడు గఱచుచు గాలుచేతులఁ గొట్టుకొనుచు బఁడ్లు పటపటఁ గొఱుకసాగెను. ఎవ్వరు నామె యెదుటఁ బడుటలేదు. ఆమె భయంకరచేష్టలచేఁ బ్రాసాద మంతయు గంపించుపోవుచుండెను. ఇప్పు డేదియో మహాదారుణ కృత్యము జరుగనైయున్నదని యందరును భయపడసాగిరి

మురళి క్రోధపరవశయై పోయెను. ఏమి చేయవలయునో యామె కేమియు దోచుటలేదు. రాజధానియందలి సమస్త ప్రజలకును మరణ దండనము గావించినను నామె కోపము తీరునట్లగపడుటలేదు. అంత శక్తియే యున్నచో నిప్పుడామె నిడుబ్రోలు రాజ్యమంతయును భస్మీ భూతము చేసివేయును. ఆమె క్రోధమంతయు నరసింహరాయనిపై నున్నది—కాని యాతని దండించుట కేఁక నుపాయములేదు—ఆమె

క్రోధమంతయు నారాయణరాయలపై నున్నది. తెల్లవారుటకు ముందే యామె నారాయణరాయలను బట్టి బంధింపవలయునని యాజ్ఞను బ్రకటించియుండెను—ఇంకను గోపము చల్లారలేదు—వృద్ధ సదాశివ రాయలు మొదలు రాజబంధుల నందఱ నేకకాలమునందే దండింప వలయునని యామె మండిపడుచుండెను-కాని యది యెట్లుసాధ్యమగును? ఆమె క్రోధాగ్నిజ్వాల మంతయు మందభాగ్యురాలగు సరళమీఁద—సరళ తల నరములతో నూడఁబెఱికించినను మురళ కోపము చల్లారదు— అన్నిటిని మించిన క్రోధ మామెకు తన భర్తమీఁదనే—విజయరాయలే మనుష్యుడైనచో నాతనియెదుట నిందఱ కిట్టి యాటలు సాగునా? అట్లయినచో నారాయణరాయలు గానసభ గావింపఁగలఁడా? అట్లయినచో రాజద్రోహులగు రాజబంధువులు రాత్రివేళ రహస్యాలోచనములం జేయుటకు వారికెన్ని గుండెలున్నవి?-అట్లయినచో నగరాధ్యక్షుఁడగు నరసింహరాయ లింతపని చేయఁగలఁడా?—మురళ కేమిచేయుటకును దోచుటలేదు. ఆమె హృదయాంతరాళమునం దప్పుడెట్టి యగ్నిజ్వాలలు ప్రజ్వరిల్లు చున్నవో యెట్టి యుల్కాపాతము లగుచున్నవో, యెట్టి ధూమకేతువులు విజృంభించుచున్నవో యెవ్వరు గ్రహింపగలరు?

సంధ్యాసమయమున మురళ కొలఁది పరివారముతోఁ గేతకీ దుర్గమునకుఁ బ్రయాణ మయ్యెను. సఖుల నెవ్వరిని దీసికొనిపోలేదు. పోవునప్పు డామె "నామనసు చెదరిపోయినది. సరళను జూడవలయునని యున్నది. ఆమె నిచ్చటికిఁ దీసికొనివచ్చి కొన్నాళ్ళిరువురమును గలసి యుండవలయునని యున్నది" అని చెలికత్తెలతోఁ జెప్పెను. సఖులా మాటలను విశ్వసించిరో లేదో మేము చెప్పజాలము—కాని వారేమియు మాటాడలేదు. మురళ కేతకీదుర్గమునకు బోయెను. పోవునప్పుడు నగర రక్షణమునకుఁ గఠినశాసనములఁ గావించి మఱిపోయెను.

చాలదినములకు మురళ తన చిన్నకోడలగు సరళను జూచుటకై బయలుదేఱిపోయెను. ఆమె బయలుదేఱినవేళకు సరిగ నక్కడ సరళ వకుళను గౌఁగిలించుకొని యేడ్చుచుండెను. వకుళ యామె నూఱడించు చుండెను. కాని సరళ హృదయము తేఱుకొనుటలేదు. సరళ యేడ్చుచు వకుళం జూచి "సఖీ! నేనిఁక బ్రదుకను—నా స్వామి నిఁక నీకన్నులతో

జూడను—నా చిన్న బిడ్డను—" అని యిక మాటాడజాలకపోయెను. వకుళ కూడ నేడ్చుచు "సఖీ! నేనెంతని చెప్పుదును?" అనియెను.

సర—చెప్పవలసిన దేదియునులేదు నా ముద్దుబిడ్డ నెవ్వరు పెంచెదరు?

వకు—ఇంత యధైర్య మెందులకు తల్లీ!

సర—ఇంత యధైర్య మెందులకా?—ఇంక నేను బ్రదుకను—సఖీ! నా బిడ్డను జూచుకొనుచుండుము!

వకు—సఖీ!—సఖీ!—ధైర్యము తెచ్చుకొనుము!

సర—నేనింక బ్రదుకను—

సరళ బేలతనముం జూచి వకుళకూడఁ గళవళపడిపోయెను. సరళ యింక నేడువజాలకపోయెను అప్పుడప్పు డామెకు స్మృతి తప్పిపోవు చుండెను. కాని యా సమయములోఁగూడ నామె పుత్రుని వక్షమునఁజేర్చి పట్టుకొనియే యుండెను. ఎంత ప్రయత్నించినను వకుళ యా శిశువు నామె చేతులలోనుండి తీసుకొనజాలకపోయెను శిశువుకూడ నేడువ సాగెను—ఆ శిశురోదనము చెవులఁబడినప్పుడు మాత్రము సరళ కించుక స్మృతి కలుగుచుండెను అప్పుడామె వ్యాకుల హృదయముతో నలు గెలంకులఁ జూచుచు బిడ్డ నూఱడించుచుండెను. సరళ దేహము శుష్కించిపోయెను. ఆమె శరీరము రక్తహీనమైపోయెను—చంపక కుసుమ సదృశ్యంబగు నామె శరీరకాంతి పాండురచ్ఛాయా పరిణతమై పోయెను. వకుళ చాల భయపడుచునే యుండెను. కాని యామె యేమి చేయగలదు? ఎక్కడకుఁ బోవగలదు? ఎవ్వరితోఁ జెప్పగలదు?—

మఱునాటి యుదయమున వకుళా సరళ లిరువురును గూరుచుండి చిన్నకుమారుని బాలక్రీడలఁ గాంచుచుండిరి ఎవ్వరు నేమియు మాటా డుటలేదు. అప్పుడు సరళ యేడ్చుటలేదు. ఆమె బిడ్డనెత్తుకొని యాతనితో నాడుకొనుచుండెను. చిన్ని యానందరాయలు తల్లియొడిలో నవ్వుచు నవ్వుచు నాడుకొనుచుండెను పాపము! తల్లి హృదయమునందలి దుఃఖ మాతని కేమితెలియును? ఆ పసిపాపని యాటలఁజూచి వకుళకూడ బరమానందమునందెను. సరళ యిట్టి యానందభావమును వకుళ కొలఁది సేపుమాత్రమే చూడఁగలిగెను.

ఆకస్మికముగ వెనుక నేదియో పదశబ్దము వినవచ్చెను. ఇరువురును చకితులై వెనుకకుఁ దిరిగిచూచిరి. యెట్టయెదుట మురళ—నిమిషములో సరళ బిడ్డ నక్కున జేర్చుకొని భయముతో మేనత్తవైపు చూచి గడగడ వడఁకుచు నేడువసాగెను. అత్తే యేడ్చుచు నామెలేచి నిలువబడియెను. పిమ్మట సరళ తన ముద్దుబిడ్డను దన యత్త యొడిలో నుంచుట కుద్యుక్తయై "అత్తా! నేనిఁక బ్రదుకను—ఇఁక నాకెవ్వరున్నారు? నా బిడ్డను దీసికొనుము! ఈతని యపరాధమేమియును లేదు—ఇఁక—ఇఁక ఈ చిన్ని బిడ్డనే నాకు మాఱుగఁ జూచుకొనుము! ఈ ప్రపంచమున నీకుఁదక్క—ఇఁక నాబిడ్డ నెవ్వరి కొప్పగించి పోవుదును" అనియెను.

ఇన్ని మాట లొక్కసారిగా సరళ యెన్నడును జెప్పలేదు—ఇఁక నామె కంఠస్వరము రుద్ధమైపోయెను. సరళ యిప్పుడు సంజ్ఞాహీనయై పడిపోయెను. అంతలో వకుళ చటాలున లేచి సరళను శిశువును బట్టుకొనియెను. మురళ యాపాదమస్తకమును గంపించిపోవుచుండెను. ఆమె నిశ్చేష్టయు, నీరవయు స్తంభితయు నైపోయెను. ఒక్క నిమిషములో నామె ప్రాణము లెగిరిపోయినట్లయ్యెను. ఆకస్మికముగ నామె తలపై నేదియో పిడుగుపడినట్లయ్యెను. మురళ గోలుగోలున నేడువసాగెను. ఆమె వదనమండలమున నొక భయంకరభావము ప్రతిభాసితమగుచుండెను.

మురళ బాలికవలె నేడ్చుచుండెను. అట్లేడ్చుచు నున్మాదినివలె నటనుండి వెడలిపోయెను. ఆమె రోదనధ్వని సరళ చెవులఁబడియెను. అప్పుడు సరళ కన్నులఁదెఱచి వ్యాకులభావముతో 'సఖీ! నా యానందము నా బిడ్డ—' అనియెను.

వకుళ సత్వరముగ నాశిశువును సరళ యొడియందుంచి "ఇదిగో జూడుము! నీ చిన్ని యానందుఁడు!" అనియెను.

సరళ భయముతో నలువంకలఁ దిలకింపసాగెను. పిమ్మట బిడ్డను వక్షమునం జేర్చుకొని పదివేల ముద్దులు పెట్టుకొనియెను. తరువాత నామె వకుళం జూచి "సఖీ! నేను కలగంటిని—అది భయంకర స్వప్నము! అత్త నా బిడ్డను నా యొడినుండి లాగికొనిపోవుటకై

వచ్చినది! సఖీ! ఈ స్వప్నము సత్యమే యగునా?" అనియెను. సరళ మాటలకు వకుళ హృదయము దద్దరిల్లసాగెను. అప్పుడు వకుళ మురళ వచ్చినసంగతి సరళతోఁ జెప్పుటకు సాహసింపజాలక యేడ్చుచు నేడ్చుచు "సఖీ! స్వప్నము లెన్నఁడైనా సత్యములగునా?" అనియెను. సరళ మఱి మాటాడలేదు? చాలసేపు వకుళవంకఁ జూచుచుండెను. అంతలో నామె కన్నులు నీరు నిండుచుండెను. అప్పుడు సరళ వకుళను గౌగిలించుకొని వెక్కివెక్కి యేడువసాగెను.

## పదునేడవ ప్రకరణము

మురళ తనజీవితకాలములో నెన్నఁడు నింతటి పరితాపము ననుభవించి యుండలేదు. ఆమె నిజముగ సరళ హృదయరత్నమగు నానందుని నపహరింపవలెనని వచ్చియున్నది—పాప మా చిన్న యానందకుమారునిఁ దనపొట్టఁబెట్టుకొని తానే యెన్నటికైన రాజమాత కావలయునని భావించియుండెను. కాని యామె నిజముగ రాక్షసియేయైనను స్త్రీప్రకృతి—సరళ సరళత్వమును, వాత్సల్యమును, విశ్వాసమును, ప్రేమమును మురళ హృదయమునఁ దీవ్రముగ నాటుకొనియెను. అప్పుడామె హృదయము సహస్రసహస్ర నిశితభల్లెములచే విదారితమై పోవుచున్నట్లుండెను. అందుచే నామె వచ్చినపని చేయఁజాలకపోయెను-సరళనుగూడ నిక జూడజాలకపోయెను. ఆమె యా నిమిషములోనే కేతకీదుర్గమును విడిచిపోదలఁచెను.

కాని హృదయోద్దేశమును మాత్రము మార్చుకొనలేదు. కఠినాత్ములగు నిరువురు ప్రతీహారుల రహస్యముగఁబిలిచి "మీరు సరళ కుమారు నెట్లయిన సంహరింపగలిగినచో నేను మీకున్నతోద్యోగముల నొసంగెదను మఱియు బహుమానముగ లక్ష నిష్కముల నొసంగెదను. ఇప్పుడు మీకీహారము నొసంగుచున్నాను" అని చెప్పెను. అమూల్యంబగు నా రత్నహారమును బడసి ప్రతీహారులు పరమానందమును నందిరి. కార్య సిద్ధింగాంచినచో లక్షనిష్కములు——ఎన్ని జన్మములెత్తిన వారి కింత ధనము లభించును? ఇంకను బెద్ద యుద్యోగము—ఇన్నాళ్ళకుఁ దమ యదృష్టము ఫలించినదని భావించి వారు విశేషానందము నందిరి. ఇంతటి

సుఖమును, నింతటి యానందమును వారెన్నడు ననుభవించి యుండలేదు. మరణదండనమును విధించి న్యాయాధిపతి యాస్థానమునుండి సత్వరముగ నెట్లు వెడలిపోవునో యట్లే మురళ యట్టి దారుణకృత్యమున కాజ్ఞాపించి యంతటి భయంకరవ్యాపారమును జూడజాలక వేగముగ నాస్థానమును వదలిపోయెను.

అప్పుడు ప్రతిహారులు సురాపానమున కారంభించిరి. వారెంత కఠినాత్ములైనను మనుష్యులు—వారు సరళను జూచియుండిరి—అట్లు దుఃఖించుచున్న యామె యొడిలోని పసిబిడ్డను వారెట్లు లాగికొనఁ గలుగుదురు? అందుచేతనే వారు సురాపానమును జేయుచుండిరి. ఒడలు తెలియకుండ నున్నప్పు డెట్టి దారుణకృత్యమునైనఁ జేయవచ్చునని వారి యుద్దేశము-కాని వారి సురాపానముతోఁగూడ హృదయ భావమును వర్ధిల్లుచుండెను—ఇంచుకంతయు నావేశము కలుగుటలేదు—మరల మరల నట్లే యింకను ద్రాగుచుండిరి. కాని సాహసము కలుగుటలేదు.

అప్పు డందొకఁడు హతాశుఁడై "నావలనగాదు-ఈపని నావలన గాదు. నేనిట్లే దరిద్రుడనై యుండెదను—కాని యిట్టి దుష్కృత్యముచేసి ధనికుఁడను గాఁజాలను" అనియెను.

రెండవ—అదేమిరా! అట్లయినచో నిన్నందఱును పిరికివాఁ డనుకొనరా?

ఒక—అనుకొననిమ్ము! నాకేమి నష్టము?

రెండ—ఈపని చేయకున్నచో మహారాజ్ఞి మనలను బ్రదుక నిచ్చునా? మన తల లూడిపోవును.

ఒక—ఔనురా! ఆమాట నిజమే—

రెండ—ఇఁకఁ జంకుట యెందులకు? చేసియే తీరవలయును.

ఒక—అయినచో గొంచము గంజాయికూడఁ ద్రాగుదము.

రెండ—సరిగఁ జెప్పితివి! వహ్వా!

ఇరువురును గూర్చుండి తీవ్రముగ గంజాయిని గూడ సేవించిరి. పిమ్మట వారిరువురును రెండు వాడికత్తులను దీసికొని సరళ మందిరము నకుఁ బోవుచుండిరి. అట్లు పోవుచు నొకడు " ఆ యిరువురు నొక్కచోటనే యుందురు. వారిరువురు మరల నడ్డగింతురేమో " అనియెను.

రెండ—ఓరి గాడిదా! ఇరువురు నాడువాండ్రేగా ?

గంజాయిపొగ వారి తలల కెక్కిపోయెను. వారికన్నులు నెత్తురు ముద్దలవలె నుండెను; శరీరము బిగుసుకొనియుండెను. వారి మొగములపై పైశాచికచ్ఛాయలు తాండవమాడుచుండెను. వారిప్పుడు విఘూర్ణిత నయనులై తూలుచుఁ దూలుచు వక్రగమనములతో సరళ గదిపైపునకుఁ బోవుచుండగా ముందుగ వకుళ వారికంటఁ బడియెను. అప్పుడామె సరళ కాహారమును దీసికొనిపోవుచుండెను. అప్పుడు వారిరువురును లేడింజూచిన బెబ్బులులవలె రాక్షసులవలె నొక్క యుదుటున వకుళపై బడిరి. ఒకఁ డామె గొంతునుబట్టుకొనియెను. రెండవవాఁ డామె హృదయమధ్యమునం దానిమిషముననే తీవ్రముగఁ గత్తితోఁ బొడిచెను. అప్పుడు వకుళ "సఖీ!" యని యఱచి భూమిపై బడిపోయెను. ఆ ఘాతుకు లిరువురు నా కత్తిని లాగుకొని సత్వరముగ నటనుండి వెడలిపోయిరి. ఆ యిల్లంతయు రక్తసిక్తమైపోయెను

ఒకసారి నరశోణితము నొలికించినచో నిరంతరముఁ దలలో నదియే తాండవమాడుచుండును—ఒకసారి యొక హత్యను గావించినచో నింకను బదిహత్యలు గావింపవలయునని యే పిచ్చియెత్తుచుండును— ఆ నరఘాతుకు లిరువురును వకుళ రక్తపాతముం గావించి యింకను నరశోణితముం బ్రవహింపఁ జేయవలయునని యావేగ పడఁజొచ్చిరి వారిఁక నిమిషమైన నాలస్యము చేయకుండ సత్వరముగ సరళ గది యొద్దకుఁ బరుగెత్తిరి

సరళ యొంటిగఁ గూరుచుండి యానందునితో నాడుకొను చుండెను. ఆబిడ్డ యామె యొడిలో గిలగిల నవ్వుచు నాడుకొనుచుండెను.

అంతలో నడుగుల చప్పుడు వినవచ్చుటచే "సఖీ! ఇంత యాలస్యము చేసితివేమి?" అని సరళ వెనుకకుఁ దిరిగిచూచెను—తిరిగిచూచినది—ఎదుట రక్తసిక్తాంగులగు నిరువురు రాక్షసులు—అప్పుడామె మనసు మనసులోలేదు—ఆమె తన చిన్నబిడ్డను వక్షమున కానుకొని వారివంక భయముతో జూడసాగెను—క్రమముగ నామె కన్నులశ్రుజల పూరితములై పోయెను—కాని యామె నోటినుండి యొక్కమాటయైన వచ్చుటలేదు.

ప్రతీహారు లిరువురుచు నా విషాదవికల విగ్రహముంగాంచి స్తంభితులై పోయిరి—అకస్మికముగ నెవ్వరో వారిని జాతిబొమ్మలుగ జేసివైచిరి—అకస్మికముగ నెవ్వరో వారి హృదయములం బ్రవేశించి ప్రబలాఘాతములం గావించుచుండిరి—వారిక నొక యడుగైనఁ గదలఁ జాలకపోయిరి కాని కొంత సేపటికి వారికిఁ జైతన్యము కలిగినది—అప్పుడొకఁడు రెండవవానిని వెనుకకుఁ ద్రోసివైచి ముందటికి రాఁబోయెను. రెండవవాఁ డందులకుఁ గోపించి కఠినస్వరముతో 'నీవు పోవలదు' అని యదలించెను. మొదటివాడు మఱింత కోపముతో 'నీవును బోవలదు' అని ధిక్కరించెను. అప్పుడు రెండవవాడు "నీచేతఁ గాదా? నేను నీవంటి యాఁడుదానను గాను!"

అని గర్జించుచు బోయి సరళ యొడిలోని శిశువును బట్టుకొనియెను. సరళ తనబిడ్డ నొడిలో దాఁచుకొనుచు బలవంతముగ నా రాక్షసు నడ్డగించి యాకసము బ్రద్దలగునట్లు నొక వెఱ్ఱికేక వైచెను. అప్పటి యామె దుఃఖమయ భయంకరధ్వని యా దుర్గమునందలి ప్రతి గృహము నందును బ్రతిధ్వనించెను. ఆ దుఃఖస్వర ప్రతిధ్వని ప్రతివాయు తరంగమునను బ్రతిధ్వనించుచు బోయి ప్రపంచమునంతను శోకపూర్ణముగఁ జేసివైచెను.

అప్పుడు రెండవవాఁడు "నీవు రావా! ఈమెను బట్టుకొనవా? అట్లే యుండుము! మహారాజ్ఞితో నీసంగతి మనవిచేయకుండ విడిచి పెట్టనులే!" అనుటయుఁ జేయునదిలేక మొదటివాఁడుకూడ బోయి

యా శిశువును బట్టుకొనియెను. అప్పుడా యిరువురును గలసి తల్లియొడి లోని బిడ్డను దీసికొనుటకై పెనఁగులాడిరి. కాని సరళ శిశువును గట్టిగఁ బట్టుకొని విడువక "సఖీ! సఖీ! వకుళా! నా బిడ్డను దీసికొని పోవు చున్నారు. నీవు వచ్చి రక్షింపుము! అఁపుటకు నాకిక శక్తిలేదు— రక్షింపుము! రక్షింపుము!" అని కేకలు వైవసాగెను—ఎవ్వరును బ్రత్యుత్తర మీయలేదు—ఆ కఠినాత్ములగు పాషండుల హృదయములను గరఁగలేదు—ఉన్మత్తప్రాయులై యున్న యా దురాత్ముల కా మాటలు వినఁబడనేలేదు. వారింకను నట్లే పెనగులాడుచుండిరి. కాని సరళ తనకడుపున గన్న బిడ్డను జేతులార నెట్లు విడిచిపెట్టఁగలదు?—ఆమె శిశువును విడుచుటలేదు—

ఇఁక నామె యోపలేదు—ఆ దుష్టరాక్షసులతో నెంతసేపు పెనఁగు లాడఁగలదు?—అయిన నామె విడువలేదు. అప్పు డొకఁడు "కత్తితో బొడిచినఁ గాని విడిచిపెట్టదు" అనియెను.

రెండ—ఈమెను జంపుట యెందులకు? మనకట్టి యాజ్ఞలేదు. శిశువు కాతరస్వరముతో నేడువసాగెను. అప్పుడు సరళకూడ నేడ్చుచు "నాథా! నాధా! ఇఁక నాకు శక్తిలేదు. నీ యానందువి రక్షించుకొనుము!—అని తరుచ్యుత కుసుమమువలె —మూలచ్ఛిన్న రసాలమువలె—శరతాడితకురంగివలె సరళ యవసన్నయై భూమిపైఁ బడిపోయెను. ఆ రాక్షసులిరువురును శిశువును దీసికొని యొండొరులం జూచుకొనుచు నిలువఁబడిరి. అప్పుడొకడు "ఇక నాలస్యమెందులకు?" అనియెను.

రెండ—ఆలస్యము లేదు.

వారిరువురు శిశువును బట్టుకొని తమ వాడికత్తులతో నా నెత్తురు కందును ఖండించుటకు సిద్ధముగ నుండిరి.

## పదునెనిమిదవ ప్రకరణము

ఆ ఘాతుకులు తీవ్రవహృదయములతో నా బిడ్డను ఖండించుటకుఁ గత్తి నెత్తునంతలో నెచ్చటి నుండియో రివ్వు రివ్వున రెండు బాణములువచ్చి వారి మస్తకముల భేదించివైచెను—వికటధ్వనులు చేయుచు నా దురాత్ము లట్లే నిలువునఁ గూలబడిపోయిరి. అప్పుడు శిశువుకూడ వారిచేతులనుండి జాఱి క్రిందఁ బడిపోయెను. అంతలో నొక వీరపురుషుఁ డచ్చటికివచ్చి యా బాలకు నెత్తుకొనియెను. అతఁ డెవ్వరు ?—వనరాజు—

అతని బాణాఘాతములచే నా దురాత్ము లిరువురును నొక్కసారిగ మరణించిరి వనరాజు శిశువును నూరడించుచు సరళను లేవనెత్తుటకై సత్వరముగ నామె యొద్దకుఁ బోయెను—కాని—యిక నెక్కడ సరళ !—సరళ కుసుమము వృంతచ్యుతమై పడిపోయినది—ఒడిలో బిడ్డ నూడఁ బెఱికికొన్నంతనే యామె హృదయము వ్రీలిపోయినది !

వనరాజు కన్నుల నీరు నిండిపోయెను. అప్పు డాతఁ డా బిడ్డ నొడిలో నుంచుకొని బాలునివలె నేడువసాగెను. కాని యిక నచ్చట నాతఁడు చాలసేపుండుట మంచిదికాదు—అతఁ డొంటిగ నుండెను—నలువంకలను రాజభటులు కావలియున్నారు—ఇట్టి స్థితిలో నాతఁ డచ్చట నొంటిగ నుండగూడదు—కాని యాతఁ డా శిశువును దీసికొని పోయి యేమిచేయఁ గలఁడు ?—ఎక్కడనుండి సంరక్షింపఁ గలఁడు ? ఇచ్చటనే యెవ్వరికైన నొప్పగించినచో నా శిశువును మృత్యుముఖమునం దుంచినట్లే యైపోవును. ఇఁక బ్రదికించుట యెట్లు ?—

యేడ్చియేడ్చి యాబిడ్డ నిద్రించెను. వనరాజా నిద్రితశిశువు నెత్తుకొని యతి జాగరూకతతో గేతకీదుర్గమును విడిచి పోయెను. అతఁ డితరులకంటఁ బడకుండ నా దుర్గమునం దెట్లు ప్రవేశించెనో యట్లే వెడలిపోయెను. దుర్గముదాటి కొంత దూరమువరకును బోయి యాతడు

వంశీధ్వని గావించెను. అప్పు డియువురు కోయ లొక గుఱ్ఱముం దీసికొని యాతనియొద్దకు వచ్చిరి. అప్పు డాతఁ డా శిశువుతోఁగూడ నశ్వారోహణముం గావించి భద్రారణ్యాభిముఖుఁడై వెడలిపోయెను. అక్కడక్కడ బిడ్డకు బాలిప్పించుచు నెక్కడ నాఁగకుండ దేవీమందిరాభిముఖుఁడై పోయెను. మందిరమున శారదానందస్వామి దర్శనమయ్యెను. శారదానందుడు వనరాజు నొొడినున్న శిశువుంజూచి "వనరాజా! ఈ శిశువెవ్వరు?" అని యడిగెను.

వన—నిడుద్రోలు రాజ్యమునకు మహారాజు—

శార—నిడుద్రోలు మహారాజా?

వన. ఔను—సరళాదేవి తనయుడు—అనంతరాయలు.

శార—నీకీబిడ్డ యెట్లు లభించెను?

వనరాజు సమస్తవృత్తాంతమును స్వామికి నివేదించెను. అప్పుడు స్వామి "ఏయుద్దేశముతో నీవీతని నిచ్చటికిఁ దీసికొని వచ్చితివి?" అనియెను.

వన—ఇంకెవ్వరి కొప్పగింతును? ఈతని నిక నెవ్వరు రక్షింతురు?

శార—మంచిపనిచేసితివి—కాని యీతని బోషించుట యెట్లు?

వన—మీరీతని బోషింపగలరను నుద్దేశముతో దీసికొనివచ్చితిని.

శార—ఒక శిశువును బెంచుటకు నా యోగసాధనము లన్నియు జెడిపోయినవి—మరల నిప్పు డింకొక శిశువా?

వనఅది— శిశువుదోషము కాదు—

స్వామి కొంతసేపాలోచించి "నేనీబిడ్డను మరల నీ కెప్పుడొప్పగించిన నప్పుడు తీసికొనవలయును— అట్లంగీకరింతువేని నేనీ శిశువును బరిగ్రహింతును" అనియెను.

వనరా జిప్పు డా శిశువు నెట్లు పెంచగలడు—ఈ నిమిషమునందే యుద్ధమునకు బోవలసియుండెను—అందుచే గత్యంతరములేక వనరాజు స్వామిమాటల కంగీకరించి యా శిశువును సన్యాసి చేతులలోఁబెట్టి యప్పుడే నిడుద్రోలు పురాభిముఖుఁడై బయలుదేఱి పోయెను.

శారదానందస్వామి యా చిన్ని యానందరాయల నందుకొని దేవీమందిరమునఁ బ్రవేశించెను

## పందొమ్మిదవ ప్రకరణము

సరళయును వకుళయును మరణించివార్త కేతకీదుర్గ మంతటను వ్యాపించెను. అది యెట్లు జరగెనో దుర్గరక్షకున కెంతమాత్రమును దెలియదు. అతడు తనకుఁ దెలిసిన వృత్తాంతమును మహారాజునకు వార్తనంపించెను. నియమానుసారము సరళా వకుళ మృతకళేబరములకు సంస్కారములు జరగిపోయెను. రాజకుమారుఁడగు నానందరాయల కొఱకు దుర్గాధ్యక్షుఁడనేకవిధముల వెదకించెను. అతఁడుకూడ మరణించినచో మృతదేహము దొరకియే యుండును. అట్లు దొరకలేదు. మరల కన్నిసంగతులును దెలియవచ్చెను. క్రమముగ నీదారుణ వృత్తాంతము నగరమునందందఱును జెప్పుకొనసాగిరి. సరళ మరణించుటయు నామె కుమారుఁడగపడకుండుటయు భావించి యనేకు లనేక విధములుగఁ జెప్పుకొనుచుండిరి రాజబంధువులు చంచలహృదయు లైపోయిరి. ప్రజలు లోలోపలనే దుఃఖింపసాగిరి.

అప్పుడొక ప్రతీహారి పోయి ప్రమోదోద్యానమందున్న విజయరాయనితో "మహారాజా! కులవృద్ధుఁడగు సదాశివరాయలు రెండువేల యాశ్వికసైన్యముతోఁ బోయి శత్రుపక్షమునఁ జేరినాఁడు" అని మనవి చేసెను. మఱియొకఁడు "మహాప్రభూ! మంత్రికుమారుఁడగు విద్యాధరుఁడును, సామంతప్రభువగు నారాయణరాయలును గారాగృహము

నుండి పలాయితులై పోయినారు. కారాగృహాధికారియగు గోవింద రాయలు వారిని విడిచిపెట్టి వారలతోఁగలసి పాఱిపోయినాఁడు " అని చెప్పెను.

అప్పుడు మహారాజు మాటిమాటికి సురాపానము చేయుచు " అందఱును బోయినఁ బోనిమ్ము ! రాగము నాలాపింపుమనుము ! గానము నాపవలదు " అనియెను.

అప్పు డింకొక ప్రతీహారి " మహాప్రభూ ! ఏఁబదివేలకోయ సైన్యముతో రామరాయలు రాజధానిని ముట్టడింపవచ్చున్నాఁడు " అనియెను.

విజయరాయ లతికష్టముతో గన్నులనువిప్పి " ఎవరురా ! " అనియెను.

ప్రతి—రామరాయలు—

విజయరాయలు మఱియొకసారి మద్యపాత్రమును బూరించి త్రాగుచు " గానము సాగనిమ్ము ! " అనియెను.

ప్రతీహారి మరల విసితుఁడై " మహారాజా ! నగరరక్షణమున కెట్టి ప్రయత్నములను జేయనక్కఱలేదా ? " అనియెను.

విజయరాయలు విరక్తభావముతోఁ గనుబొమలు ముడిచివైచుచు " అన్నియును మహారాజ్ఞియే చేసికొనును—సంగీతము సాగనిమ్ము ! " అనియెను.

సంగీతములు చెలరేగిపోవుచుండెను. గాయికల మధురకంఠస్వర ములును, నర్తకీజనపదమంజీరని ధ్వనంబులును, వేణువీణామృదంగ మధుర ధ్వనులును నా ప్రమోదోద్యానమందిర మంతయును మాధురీ మయముగఁ జేసివైచుచుండెను. కాని యెవ్వరి హృదయములందును నానందములేదు. భయముచేతనే గాయిక గానము చేయుచుండెను.

నర్తకి నాట్యము చేయుచుండెను; వాదకుఁడు వాద్యము చేయుచుండెను. కాని యందర హృదయములును భయప్రకంపితములై యుండెను. అందర హృదయములయందును గోయళవృత్తాంతమును, రామరాయల యాగమన వార్తయును సంచారము సేయుచుండెను. అచిరకాలముననే రాజధాని యంతయు భయంకరముగ రక్తప్లావితమైపోవును. ఇట్టి యవస్థలో నీ మేళతాళములు, నీ సంగీతములు నెవ్వరికి రుచించును? కాని విజయ రాయనికి మాత్ర మా భావమే లేదు—ఆ యాందోళనమే లేదు! అతఁడు మద్యపాన నిమగ్నుడై పడియుండెను—మనోబలము తగ్గుచున్న కొలఁది నాతడు సురాపానమును గావించుచుండెను.

అకస్మికముగ మురళి యచ్చటికి వచ్చెను. నిమిషములో నాట పాటలును వాద్యములు నాగిపోయెను. అప్పుడు విజయరాయలు "సంగీతను సాగనిమ్ము" అనియెను. మురళి హస్తసంజ్ఞచే వారల నందరను బంపివైచి విజయరాయనిం జూచి క్రోధగద్గదస్వరముతో "ఇదియేమి! కన్నులు మూసికొనిపోయియున్నవి?" అనియెను. విజయరాయలు చకితుఁడై కన్నులువిప్పి "ఎవరు? మురళియా?" అనియెను.

ముర—ఔను. నేనే—ఇంకను నీకు దెలివిరాలేదా?

విజ—ఇంకేమి తెలివి; తెమ్ము! మద్యపాత్రము నిటుతెమ్ము.

ముర—ఏమీ! వృద్ధమహారాజు రక్త మీ విధముగ మద్యమై పోయినదా యేమి?

విజ—నోరు మూయుము.

ముర—నోరుమూయుట యెందులకు? త్రాగుము! ఇదిగో! పాత్ర-వృద్ధమహారాజును జంపుట కేవలము మద్యపానముచేయటకా?

విజ—ఊరకుండుము. మురళా! నన్ను క్షమింపుము. ఎవరైన వినియెదరు.

మురం—విన్నచో నీకేమి నష్టము? ఇంకను గొంచెము త్రాగుము.

విజ—నాకుఁ బిచ్చియెత్తి పోవుచున్నది.

మురం—నీవు క్రమముగఁ బశుప్రాయుఁడ వై పోవుచున్నావు.

విజ—మురళా! నీవు నన్ను నిందింపకుము. నేనికఁ ద్రాగను.

మురం—ఇది యెక్కడిమాట? నీవింతటి పిరుఁడవా? ఇంకను నాకుఁ దెలియనేలేదు!

విజ—నీవు రాక్షసివి.

మురం—నేను నా తండ్రిని జంపి కల్లుతోఁ గాలక్షేపము చేయుచున్నానా?

విజ—చాలింపుము! నీ కించుకంతయును దయలేదా?

మురం—ఎవ్వరిపై నుండవలయును?

విజ—ఉస్!—హృదయము — మనస్సు—ప్రాణము—సర్వశరీరమును మండిపోవుచున్నది—తెమ్ము! తెమ్ము! ఒకసారి త్రాగి మఱి చచ్చెదను.

మురం—లోకులందరును బశువుకంటె నధముఁడని యసహ్యించుకొనుచున్నారు—ఇంకను జావవలయునా?

విజ—మురళా! నన్నేమి చేయమనియెదవు!

మురం—మైకము వదలనిమ్ము మాటాడవచ్చును.

విజ—నీమాటలు విషబాణమువలెఁ దాఁకుచున్నప్పు డింకను మత్తెక్కడ?

మురం—ఇంకను నొకమాట యున్నది. సరళ కుమారుఁ డింకఁ లేఁడు.

విజయరాయ లొక్కయుదుటన లేచి నిలువఁబడియెను. ఒక్క నిమిషములో నాతని మైకము వదలిపోయె—ఆపాదమస్తకమును బ్రకంపితమైపోవుచుండెను. అది యంతయును జూచి మురళ వింధా గర్భితంబును గఠోరంబును హాలహలసంకీర్ణంబునగు చిరునవ్వు నవ్వుచు మత్తువదలిపోయినదా ? పోకున్నచో నిఁక వదలిపోవును అనియెను.

విజయరాయలు కాతరస్వరముతో "మురళా ! నీకు నామీఁదఁ గోపమేయున్నచో — నన్ను దండింపవలయునని నీకు గోరికయే యున్నచో--నీయిష్టము వచ్చినట్లు నన్ను శిక్షింపుము—కాని నీభయంకర విషవచనములను నేనిఁక విని సహింపఁజాలను—నన్ను శూలములచేఁ బొడిపింపుము—కుక్కలచేఁ దినిపింపుము—శ్మశానమునఁ జితాగ్నిచే భస్మము చేయింపుము-కాని యిట్టి నీ మాటలను విని సహింపజాలను" అనియెను.

ముర—ఇప్పటికి మైకము వదలినది. ఇఁకఁ గార్యాలోచనము కావచ్చును.

విజ—మరల నేమి ? కార్యాలోచన యనుమాట విన్నతోడనే నా హృదయము కంపించిపోవుచున్నది.

ముర—భయము లేదు—దుర్జయబలపరాక్రమ తేజోధురంధర విజయరాయ మహారాయా ! భయములేదు—

విజ—ఇంకనైనను నీకు జాలి కలుగుట లేదా ?

ముర—ఇంకఁ గార్యాలోచనమునకు రండు !

విజ—చెప్పుము ! నేను నీదాసానుదాసాధముఁడను ! చెప్పుము.

ముర—నా కిష్టము లేకపోయినను నిరంతరము మద్యపానా సక్తుఁడవై పోయినను నీవు నా స్వామివే—

విజ—ఏమి చేయవలయునో చెప్పుము !

ముర—కోయదళముతో రామరాయలు యుద్ధముచేయుటకు వచ్చుచున్నాడు—ఒక్కకోయలే యైనచో నంత భయములేదు. నరసింహ రాయలును సదాశివరాయలును గూడ నాతనితోగలసినారు. నారాయణ రాయలును నా సోదరుఁడును జెఱసాలనుండి విడివడి పారిపోయినారు. గోవిందరాయలు కూడ వారితో గలసినాడు. యింకను నెంతమందియో కలయుట కుద్యుక్తులగుచున్నారట! ఎవ్వరిని నమ్ముటకును వలను గాకున్నది.

విజ—ఇఁక నుపాయము! సేనానాయకు లేమనుచున్నారు?

ముర—వారినిగూడ విశ్వసింపరాదు.

విజ—ఇఁక నెట్లు?

ముర—ఏమియును మాటాడకుండ రామరాయల పాదములపై బడవలయును. ఇఁక మీకున్న నుపాయ మిది యొక్కటియే!

విజ—మురళా! విజయరాయలింకను మరణింపలేదు!

ముర—నేనుమాత్ర మట్లనుకొనుటలేదు.

విజ—మురళా! యుద్ధముచేయుదును—విజయరాయలు మరల మునుపటి విజయరాయలే యని లోక మెఱుంగునుగాక!

ముర—అట్లయినచో నిఁక లెమ్ము!

విజ—పద! ఎట్టి భయంకరకార్యము చేసి సింహాసనమును సంపాదింపగలిగితినో యంతకంటెను భయంకరకార్యముం గావించి యా సింహాసనమును రక్షించెదనని తెలిసికొనుము.

ముర—నాధా! ఇవి నా విజయరాయని మాటలే. నీ వొకసారి యస్త్రమును బట్టినచో విద్రోహిగణమంతయు వాత్యాప్రభంజితవాలుకా గణముంబోలి పంచబంగాళమైపోవును.

అప్పు డా యిరువురును గలసి ప్రమోదోద్యానమును విడిచి పోయిరి.

# ఇరువదియువ ప్రకరణము

మహాసభ గావించుట కాహ్వానము లంపఁబడియెను. మహారాజు ప్రమోదోద్యానమును బరిత్యజించి వచ్చెదనని నగరప్రజల కందఱకును దెలియవచ్చెను. రెండు సంవత్సరములకుఁ దరువాత నిప్పు డాతఁడు కొలువుకూటమునకు వచ్చుచుండెను. కొందఱు భయముతోడను, గొంద ఱాశతోడను, గొందఱు వేడుకతోడను దర్బారునకు వచ్చుచుండిరి. పూర్వ మొకప్పు డొకనాఁడు విడుబ్రోలురాజ సభామంటప మీ విధముగనే జనసంకులమై యుండెను. మహారాజాజ్ఞచే సమస్తసైనికులును సభాప్రాంగణమునఁ బ్రవేశించియుండిరి. సామంతరాజులుకూడ భయముచే సేనాసమన్వితులై వచ్చియుండిరి. అప్పుడు రాజధానియం దంతట నీమాటలే చెప్పుకొను చుండిరి.

మహారాజగు విజయరాయలు యోధవేషాలంకృతుఁడై కొలువు కూటమునకువచ్చి సింహాసనముపై కూరుచుండెను. కాని మునుపటి జయధ్వనులులేవు. కొంతమంది జయధ్వనులను గావించిరి. గాని యా ధ్వనులలో జీవకళలేదు—ఉత్సాహకళలేదు-విజయరాయ లా సంగతి గ్రహించి హృదయభావమును గోపనమును చేసికొని యెప్పటివలె వచ్చియున్న రాజోద్యోగులతోడను సామంతులతోడను సమాదర పూర్వకముగ సంభాషించెను. పిమ్మట రాజకార్యము లారంభమయ్యెను. అప్పుడు విజయరాయలు సభాసదులంజూచి "మహారాజును హత్య గావించిన రామరాయలు విద్రోహియై యుద్ధమునకు వచ్చుచున్నాఁడు. మనమాలస్యము చేయకుండ నాపాపాత్మునకు దగినదండనముం గావింప

వలయును. రాజద్రోహులై యాబాలకునితో జేరిపోయినవారి కందరకును మరనము తగినశిక్ష గావింపవలయును. అసభ్యులగు నారణ్యకుల కందఱకును దగినశాస్తి చేయవలయును. మీరు భయపడవలసిన పనిలేదు. సేనాసహితుఁడనై యుదయముననేపోయి వారిని బాఱద్రోలివచ్చెదను. దేశాభిమానులందఱు నీసమయమున నాకు సహాయులై యుండి విడుఁబోలు రాజ్య గౌరవమును గాపాడెదరని విశ్వసించుచున్నాఁడను" అనియెను

ఇప్పుడు జయధ్వనులులేవు. విజయరాయని వదన మప్పుడు విషాదచ్ఛాయావృత మైపోయెను. క్రోధాతిరేకముచే సర్వాంగములును గంపించిపోవుచుండెను. అతఁ డతికష్టముతో హృదయభావమును బయలు పడనీయక "ఇఁక మీరు మీయిండ్లకుఁ బోవచ్చును. నేను సేనలఁ బరామర్శించెదను" అనియెను. అందఱు నిశ్శబ్దముగ సభ వదలిపోయిరి. మహారాజుకూడ నిశ్శబ్దముగ వెలుపలనున్న సేనలయొద్దకుఁ బోయెను. కాని యచ్చటను జయధ్వనులులేవు—ఎవ్వ రాతని దైవముగ భావించు కొనుచుండిరో, యెవ్వ రాతని నామశ్రవణ మాత్రమున జయజయ ధ్వనులం గావించుచుండిరో యట్టివా రిప్పు డాతనిం జూచి నిశ్శబ్దముగ నూరకుండిరి. అందఱు నవనతమస్తకులై నిలిచియుండిరి. ఇఁక విజయ రాయని హృదయ మెట్లుండెనో వేఱుగఁ జెప్పవలయునా ?

ఆతఁడు సైనికులం జూచి "మీరు మీ సేనానాధుని గుర్తింపలేదా" ఇప్పుడు మీరందఱు నిట్లుంటిరేమి ?" అనియెను. అప్పుడొక వృద్ధ సైనికుడు ముందఱికివచ్చి "మహారాజా ! ఇది మా యపరాధము కాదు—ఎనిమిది మాసములనుండి మాకు వేతనములు లేవు. పూర్వము మా కెంతయో గౌరవమున్నది—ఆదరమున్నది—అభిమానమున్నది. ఇఁక నిప్పుడో కఠినశాసనములును, గష్టజీవనములును వచ్చినవి" అనియెను.

విజయరాయలు కొంతసేపటివఱకు మాటాడఁజాలక నిలవఁబడి పోయెను. ఏమి చెప్పవలయునో యాతనికిఁ దోచినదికాదు—పిమ్మట నాతడు "యుద్ధము సిద్ధమైయున్నది. ఇట్టిస్థితిలో నిదుర్బోలురాజ్య గౌరవమును గాపాడు భారము మీతలపై నున్నది. మీరీ సమయమునఁ దోడుపడకుండినచో నిఁక రాజ్యరక్షణమున కుపాయములేదు. విజయ రాయని యాశయును లేదు. మీ కష్టములనన్నిటిని మఱచిపొండు! మీలోపముల నిప్పుడే తీర్చివైచెదను. మీకు నాయెడల నసంతుష్టి యేమైన నున్నచో స్పష్టముగఁ జెప్పుడు—నేనిప్పుడే యీ రాజకిరీటము దీసివైచి మీహస్తసంపుటములఁ బ్రతిష్టించెదను. మీయిష్టము వచ్చిన వారికీ కిరీటము నర్పింపవచ్చును. ఇష్టమున్నచో రాజద్రోహియు, నరహంతకుడును, బాపాత్ముడునగు రామరాయలకైన నీయవచ్చును. నాయాటంకమేమియునులేదు" అనిచెప్పి మహారాజు కిరీటమును దీయుట కుద్యుక్తుఁడయ్యెను. అంతలో నాకాశము బ్రద్దలగునట్లు సైనికుల జయజయధ్వనులు చెలరేఁగెను. చాలకాలమునకు వారందరును మరలఁ దమ విజయరాయనిం గాంచి యాతని గంభీరమధురాలాపముల నాలకించి సకలదుఃఖములను, సకలకష్టములను, సకలావమానములను నొక్కసారిగ మఱచిపోయిరి. జయజయధ్వనులతో నగరమంతయు నిండిపోయెను.

విజయరాయని హృదయ మానంద ప్రపూర్ణమయ్యెను. అప్పు డాతఁడు సైనికుల సంబోధించి "మనము రేపటి ప్రాతఃకాలముననే దండయాత్ర గావింపవలయును. ఇఁక మీరందఱును మీ నివాసములకుం బోవచ్చును" అని యాజ్ఞాపించెను.

సైనికులందఱును మరల జయజయధ్వనులం గావించుచు దుర్గాభిముఖులై వెడలిపోయిరి. మహారా జంతఃపురమునకు వచ్చెను మురళి యుత్కంఠయై యాతనికొఱ కెదురు చూచుచు డెను. అప్పుడామె భర్తనుజూచి సంభ్రమముతో "ఏమైనది?" అని ప్రశ్నించెను.

విజ—అంత బాగుగలేదు. రాజకోశమున ద్రవ్యమున్నదా?

ముర—ఒక చిల్లిగవ్వయైన లేదు.

విజ—అయినచో నిఁక నాశలేదు. సైనికులకు వేతనము లీయ వలయును.

ముర—నాయలంకారములున్నవి. వానిని విక్రయింపవచ్చును.

విజ—బాగుగఁ జెప్పితివి—ఏమి చేసియైనను సింహాసనమును గాపాడుకొనవలయును.

ముర—అట్లే కానిచో నింతకష్టమును—ఇంత పరిశ్రమమును—సర్వమును నిరర్థకమైపోవును.

విజ—ఔను. ఇప్పుడే యలంకారములను విక్రయించి ద్రవ్యమును గూర్పవలయును.

ముర—ఆ పనియంతయు నేను చేయుదును.

## ఇరువదియొకటవ ప్రకరణము

నిడుప్రోలు రాజధానిని సమీపించి కోయలు శిబిరములను స్థాపించిరి. వారి శిబిరములు నిత్యోత్సాహముతో నిండియుండెను. వారందఱును యుద్ధమునకై వచ్చియుండిరి—అందఱు రణరంగమున విజయలక్ష్మికిఁ దమప్రాణముల నర్పించుటకై వచ్చియుండిరి—అందఱును జగజ్జననియగు భూదేవి హృదయతాపమును దమ క్రొన్నెత్తుటి వెల్లువచేఁ బ్రశమింపఁజేయుటకై వచ్చియుండిరి. ఆ యుత్సాహములో వారి కేమియును దెలియుటలేదు.

ఆడుచుండిరి – పాడుచుండిరి. వాద్యముల ప్రయోగించుచుండిరి – సురాపానములఁ జేయుచుండిరి. మహాదేవిం బూజించుచుండిరి. అందఱు నీవిధముగ నక్కడక్కడ గుంపులుగఁజేరి వినోదవిలాసములచే ప్రొద్దులు గడుపుచుండిరి.

వారితోఁ గలసి వనరాజుకూడ నానందవిమగ్నుఁడై యుండెను. ఎల్లప్పుడు నాతఁడు వేణుగానము చేయుచుండెను. ఆ మధురమోహన స్వరమున సమస్తకాననమును మాధురీమయమగుచుండెను. శిబిరముల యందలి కోయలందరు నాతని మురళీధ్వనులఁ దదేకధ్యానముతో నాలకించి యానందించుచుండిరి. అందఱు నా యానందముచే మైమఱచి పోవుచుండిరి. అందరు నావేణుగానానందరాజ్యమున కధీశ్వరులై యుండిరి. ఒకప్పుడు వనరాజు వీణాగానముకూడఁ గావించుచుండెను. అట్టివీణ యీ ప్రపంచమునం దెవ్వరు నెప్పుడు ప్రయోయించి యుండరు. ఆ వీణా తంతువులనుండి మధురామృతవాహినులు పొంగి పొరలుచుండెను. ఆ యమృతవాహినులలోఁ బ్రేమతరంగములు నాట్యము చేయుచుండెను. అంతయు నమృతమయమై మాధురీమయమై ప్రేమమయమై యానందమయమైయుండెను—ఆ యానందములో యుద్ధమును దమ్ము సమస్తమును మఱచి కోయలందఱును దన్మయులై యుండిరి.

ఒక్కొక్కప్పుడు వనరాజు వేణువునుమించి వీణ నతిక్రమించి కలకంఠస్వరమున గానము చేయుచుండెను. ఆ మధురస్వరములు సకల తరుపల్లవములతోడను సమ్మిశ్రితములై సంగీతరసతరంగిణుల దిగంత వ్యాప్తములుగఁ జేసివైచుచుండెను. ఆ మధురమోహన సంగీతస్వరములు మధురవాయుమండలమునఁ బ్రచారముచేయుచు ననంతమధురాకాశమున విలీనములై పోవుచుండెను-ఆ కోమలకలస్వన మనంతమూర్తియై యనంత

ప్రతిస్వరములతో ననంత ప్రకృతి నానంద రూపమున నారాధించు చుండెను. అంతయు నానందవిలాస క్రీడామయమైయుండెను. వనరాజు నానందమునకుఁ బరిమితిలేదు.

ఇట్టివారు యుద్ధమునకై వచ్చిరని యెవ్వరనుకొందురు—ఇట్టివారు రక్తధారాప్రవాహముల నీదులాడవచ్చిరని యెవ్వరు భావింతురు? ఇట్టివారు కొలఁదికాలములో సమరరంగమున సమసిపోవుటకై వచ్చిరని యెవ్వరూహింతురు?—అందఱు నట్టి యానందమున మునిఁగియుండిరి.

కాని యందొక్కఁడు మాత్ర మట్లులేఁడు. వనరా జెంత ప్రయత్నించినను రామరాయల కానందముం గూర్పఁజాలక పోయెను. ఏ వేణుగానమునకు వనజంతువులుకూడ మోహించుచున్నవో, యే వీణా మధుర స్వరములకు వృక్షములయందలి పక్షులుకూడ నిశ్చేష్టములై పోవుచున్నవో యేమధురసంగీత రసప్రవాహమున నీ భూమండలమంతయు నమృత సాగర నిమగ్న మగుచున్నదో యట్టి మధురమురళీగానము—అట్టి మధురమోహన వీణాగానము—అట్టి యమృత మధురమోహన కలకంఠ గానము—రామరాయల కానందము గూర్పఁజాలక పోయెను. రామరాయల కది సుఖకరముగ లేకుండుటయే గాక దుస్సహ క్లేశదాయకము కూడ నయ్యెను.

అతఁ డెప్పుడు నొంటిగ నుండుటకే కోరుచుండెను. అవకాశమైనప్పుడు నిర్జనస్థలమునం దొంటిగఁ గూర్చుండి బిగ్గరగ నేడ్చుచుండును. అతని కిప్పు డానందింపవలసిన సమయము. అతని కిప్పుడు సుఖదినములు సమీపించియున్నవి—అతఁడు శీఘ్రముగ విద్యుబోలు సింహాసనము నధిష్ఠింపగలడు—అతని పక్షమున నరసింహరాయలు వచ్చిచేరెను. ప్రియబంధుడగు విద్యాధరుఁడును, గురువృద్ధుఁడగు సదాశివరాయలును, సామంతుండగు నారాయణరాయలును గోవిందరాయలును గూడ

నాతవిపక్షమునఁ జేరియుండిరి. ఇంకను గొందఱు రాజబంధువులు రానై యుండిరి. ఇవి యన్నియు నాతని కానందకారణములేగదా! కాని యాతని హృదయమున కేదియు నానందజనకముగ లేక యుండెను—

సరళ యింకలేదు. ఆ సంగతి వనరాజతనితోఁ జెప్పకపోయినను నాతఁడు తెలిసికొనియెను. ఈవృత్తాంత మంతటను వ్యాపించినది. సరళ యింక లేదు—అగతిక యగు నామె పతివియోగమును సహింపఁ జాలక యీ ప్రపంచమును వీడిపోయినది. ఆమె యెంతకష్టపడియెనో యెవ్వరికిఁ దెలియును?—ఎట్టి యాతనను సహింపజాలక మరణించినదో యెవ్వరికిఁ దెలియును? రామరాయని హృదయము విదీర్ణమై పోవుచుండెను—ఏమయిన నింక నేమిచేయఁగలఁడు—లోకముకొఱకు హృదయావేగము నడంచుకొని యాతఁడు గట్టిగ నేడువఁజాలకుండెను—గట్టిగ నేడ్చినచో నాతని హృదయపరితాప మించుక యుపశమించియే యుండును. లోక మేమనుకొనునో యని యాతఁ డట్లు చేయఁజాల కుండెను.

అతఁడు సమయము దొరికినచో నొంటిగఁ గూరుచుండి బిగ్గరగ నేడ్చియుండును. కాని వనరాజాతని కట్టి యవకాశము లేకుండఁ జేసెను. ఎల్లప్పుడును వనరాజాతని కన్నులయెదుటనే తిరుగుచుండెను. వనరాజుతోఁ గలసి మెలసి తిరుగుచుండుటచే రామరాయని కించుక శాంతి లాభమగుచుండెను. కాని యెల్లప్పుడును వనరాజాతనియొద్దనే యుండుట కవకాశము లేకుండెను. వనరాజు నిరంతరమును గోయలతో నుండవలయును. వారికి యుద్ధవిద్య నేర్పుచుండవలయును. వారి కానందముగ గానము చేయుచుండవలయును.

రామరాయని హృదయమునందలి పరితాప మితరుల కెట్లు తెలియును? శిబిరములకు దూరమునందున్న యొక నిర్జనారణ్యమున రామరాయ లొంటిగఁ గూర్చుండి యేడ్చుచుండెను. అతని నయన ద్వయమునుండి యశ్రుధారలు ప్రవహించుచుండెను. కన్నీటిచే నాతని వక్షము తడిసిపోవుచుండెను. అప్పు డాకస్మికముగ నెవ్వరోవచ్చి యాతని వీఁపుపై జేయివైచిరి. అప్పుడు రామరాయ లదరిపడి వెనుదిరిగి చూచెను—అతఁడు వనరాజు!

వన—మరల దుఃఖించుచుంటివేమి?

రామరాయలింక దుఃఖము నాఁపుకొనఁజాలక వనరాజుమెడ పట్టుకొని యాతనిహృదయముపై మొగము నానుకొని "మిత్రమా! నే నింక నీదుఃఖమును సహింపజాలను. ఆమె నన్నెంతగఁ బ్రేమించు చుండెడిదో నీ వెఱుంగ జాలవు" అనియెను.

వనరాజునకుఁ గన్నీరు మున్నీరయ్యెను. అతఁ డతికష్టముతోఁ గన్నీటి నాపుకొనఁ బ్రయత్నించెను. అప్పు డాతని కోమలవదనమండల మెఱ్ఱగఁ గందిపోయెను. అయిన నాతఁడు కన్నీటి నడఁగింపఁ జాలక పోయెను. కొన్ని వేఁడి కన్నీటిబిందువు లాతని కన్నులనుండి రామ రాయని మెడపైఁ బడియెను. అప్పుడు రామరాయ లుష్ణాశ్రుస్పర్శ నముచేఁ జకితుఁడై మొగమెత్తిచూచెను. కాని నిమిషములో వనరాజు కన్నీటిని దుడుచుకొనియెను. రామరాయల కాసంగతి తెలియలేదు. చాలవేపటివఱకు రామరాయలు వనరాజు మొగమువంకనే చూచుచు నిలువఁబడియెను.

# ఇరువదిరెండవ ప్రకరణము

వనరాజు రామరాయలం జూచి "రాజకుమారా! నీ విట్లున్నచో యుద్ధముచేయువా రెవరు?" అనియెను.

రామ—చెలికాఁడా! నీయెదుట దాఁచుట యెందులకు? నాకు యుద్ధము చేయవలెనని లేదు. అప్పుడప్పుడు శిబిరమును విడిచి రాత్రి వేళఁ బాఱిపోవలయునని తోఁచుచుండును. కేవలము లోకులు నవ్వుదురని యట్లు చేయంజాలకుంటిని. నేను సింహాసనముకొఱకు యుద్ధము చేయవలయునని యెప్పుడు నిశ్చయింపలేదు. నా కెప్పుడును రాజు కావలయునను కోరిక కలుగనేలేదు. ఇంతప్రయత్నమును నరళకొఱకై చేసియుంటిని. చాలఁగాలము ఘోరారణ్యములలో నందుకొఱకే చాలఁ గష్టపడితిని. అందుకొఱకే కష్టపడి నీ స్నేహలాభమును సంపాదించితిని. వనరాజా! ఇఁక యుద్ధ మెవ్వరికొఱకు?—నా సరళ లేదు.

ఇట్లు చెప్పి రామరాయలు బాలకునివలె నేడ్చెను. వనరాజునకుఁ గూడ గన్నీరు వించెను. కాని యాతఁడు హృదయభావమును హృదయమునందే యడంచుకొని "రాజకుమారా! విదుబ్రోలురాజ్య ప్రజలకొఱకు—దుష్టశాసన పీడితులగు దీనులకొఱకు—నీయాప్తమిత్ర బంధు పరివారముకొఱకు—నీవు యుద్ధము చేసితీరవలయును" అనియెను.

రామ—వనరాజా! అందుకొఱకే యింతకాలమువఱకును మిమ్ములను విడిచిపోఁజాలనైతిని. అట్లే కానిచో నేదినమున నా సరళ యీ లోకమున లేదని వినియుంటినో యానాఁడే గైరికవసనధారినై పోయియుందును.

వన—సరళవంటి భాగ్యవతి యీ ప్రపంచమునం దెక్కడ నున్నది ?

రామ—నీవామె నెప్పుడును జూడలేదు. ఆమె ప్రేమ వర్ణనాతీతమైనది. ఆ ప్రేమకు సాటిలేదు.

వన—రాజకుమారా ! నీప్రేమకుమాత్రము సాటి యెక్కడ నున్నది ?

రామ—నేనెంతటి కష్టముతోఁ గాలము గడపుచుంటినో యెవ్వ రెఱుంగుదురు ? నీవు నాకెంతయో యుపకారము చేసితివి. ఇంకెందులకు ? నన్ను విడిచిపెట్టుము ! ఇంత రక్తపాతము వింకెవ్వరికొఱకు ? నా నిమిత్త మిఁక నట్టిపని చేయవలదు. ఇంటికిఁబొమ్మ ! కోయలకందఱకును సెలవిచ్చి పంపుము ! నాకుఁగూడ సెలవొసంగుము ! నేను ప్రతిశ్మశానమునందును సరళను ధ్యానించుచు జీవితమును గడపివైచెదను.

వన—నీ వెవ్వరికొఱకు యుద్ధము చేయకపోయినను నీ కుమారుడు—సరళ చిన్నికుమారుఁడు—ఆనందరాయల కొఱకైన యుద్ధముచేయుట నీకుఁ గర్తవ్యము !

రామ—ఆనంద—ఆనందుఁడిక లేఁడు !

అని రామరాయలు మరల దుఃఖింపసాగెను. అప్పు డత్యాదరముతో వనరాజు రామరాయల కన్నీరు తుడుచుచు "ఆనందుఁడు జీవించియున్నాడు" అనిచెప్పి తానా చిన్నిబిడ్డను రక్షించిన వృత్తాంతమంతయును నాతనికిఁ దెలియఁజేసెను. ఆనందుఁడు బ్రదికియున్నమాట వినుటతోడనే రామరాయల దుఃఖహృదయాంతరాళమునఁగూడ నానందరేఖ యగపడియెను.

రామ—వనరాజా! యుద్ధం చేయుదును—సరళకొరకు యుద్ధము చేయుదును-ఆనందుని సింహాసనాసీనుం జేయుటకై యుద్ధముచేయుదును. ఇట్లు చేయకపోయినచో సరళ నాపై గోపగించదా? చెలికాడా! నేను యుద్ధము చేయుదును.

వన—పద! ఇఁక విట్లొంటిగఁ గూర్చుండి యెన్నఁడును విచారింపవలదు.

ఇరువురును శిబిరాభిముఖులై బయలుదేఱిరి. వచ్చుచుండఁగా విద్యాధరుఁడు వారి కెదురుగవచ్చి "కుమారా! నలువురు సామంత రాజులు పదివేలక్షత్రియ వీరులతో మన పక్షమున యుద్ధముచేయుటకై వచ్చియున్నారు" అని చెప్పెను. ఆ సమయమునకు సరిగ నలువంకలను జయజయధ్వనులు చెలరేఁగెను. అప్పు డందఱు నానందహృదయములతో శిబిరమునఁ బ్రవేశించిరి. యువరాజుం గాంచి సైనికులందఱును మరల మరల జయజయధ్వనులం గావించుచుండిరి. వా రందఱు నానందముతో జేయుచుండు నా జయధ్వనులు రాజధానియందలి యంతఃపురమున నున్న మురళకర్ణములలోఁ బ్రతిధ్వనించుచుండెను.

## ఇరువదిమూఁడవ ప్రకరణము

విదుఁబ్రోలు రాజధాని యిప్పుడు యుద్ధక్షేత్రముగఁ బరిణమించినది. నగరమునకు నలువంకలను దండనాయకులు సేనాసహితులై మిగుల జాగరూకతతోఁ గాచుకొనియుండిరి. నగరరాజమార్గములం దెల్లెడల రాజసైనికులాయుధహస్తులై తిరుగుచుండిరి. గజబృంహితములు, హయహేషలు, సైనికుల జయజయ శబ్దములు, జనసమూహ కోలాహలధ్వనులు మొదలగు

వారితో రాజధానియంతయు నిండిపోయెను. అంగడులు మూసివేయఁ బడియెను. కృషికులు స్వకార్యముల నుజ్జగించిరి. శిల్పిగణము శిల్పకార్యములఁ బరిత్యజించెను. రాజపథమున సైనికులుదక్క మఱి యెవ్వరును దిరుగుటలేదు. బాలికాబాలకులును స్త్రీలును మందిరముల విడిచి వెలుపలకు వచ్చుటలేదు. అంతటను యుద్ధప్రయత్నములే—అంతటను భయంకరభావములే—ఆకసమున గ్రద్దలాడుచుండెను.

విజయరాయలు జాగరూకుఁడై మెలంగుచుండెను. రెండేండ్లకుఁ బూర్వ మాతఁ డెట్టి దుర్జయ సేనాధ్యక్షుఁడై యుండెనో యిప్పుడు సరిగ నాతఁ డట్లే యుండెను. రెండేండ్లనుండి యుద్ధకార్యములను మఱచి విశృంఖులులై యున్న సైనికుల నాతఁ డిప్పుడు మరలఁ బరిశ్రమచేసి నియమబద్ధులుగాఁ జేయుచుండెను. అతఁడు విడువకుండ నశ్వారోహియై తిరుగుచు నగరరక్షణమునకుఁ గావలసిన కార్యములను యుద్ధమున కావశ్యకంబులగు ప్రయత్నములను జేయుచు రేయుంబవలు శ్రమపడి యన్నియు నాయత్తపఱచుచుండెను. సైనికులందఱు నాతనియెడల మిగుల సంతుష్టులై యుండిరి. మురళ యమూల్యాలంకారములను విక్రయించి విశేషద్రవ్యమును సంపాదించి విజయరాయలప్పుడు సైనికుల వేతనముల నొసంగుటయే గాక విశేష బహుమానములను గూడఁ గావించెను. ఇంతేకాక విజయరాయలు కోటీశ్వరులగు వర్తకుల యొద్ద విశేషధనమును తీసికొనియెను. భయముచే వారేమియును మాఱు మాట చెప్పక ధనము నిచ్చివైచిరి. ఆ ద్రవ్యమంతయును సైనికుల విషయమున నాతఁడు తృణప్రాయముగ వ్యయపెట్టుచుండెను. ఇఁక నాతనికి సేనలవలన భయములేదు. పదివేలమంది క్షత్రియవీరు లాతని కొఱకుఁ బ్రాణముల నర్పించుటకు సిద్ధముగ నుండిరి.

అందఱును ధైర్యముతో నుండిరి. అన్నియును సంసిద్ధము లయ్యెను. ఇఁక యుద్ధము జరుపవచ్చును. ఉభయపక్షీయులును సముత్కంఠులై యుద్ధమున కెదురుచూచుచుండిరి. కాని ముందుగ నెవ్వరాక్రమింతురో యెవ్వరికిని దెలియుటలేదు. అప్పుడు విజయరాయలు తనలో "రామరాయ లిప్పుడు యుద్ధముచేయుటకు వచ్చియున్నాడు. అతఁడే ముందుగ దుర్గము నాక్రమించును. అందువలన నేను దుర్గరక్షణముం గావించుకొనవలయును" అని యాలోచించుకొనుచుండెను. కాని రామరాయ లట్లాక్రమించునను చిహ్నము లేవియు నగపడుటలేదు. రామరాయల శిబిరములఁ గేవల మానందవిలాసములు నాటపాటలును జెలరేఁగుచుండెను. కోయలు నగరము నాక్రమించుటకు భయపడుచుండిరనియు, నందువలన రామరాయ లధీరుఁడై యుండెననియు విజయరాయనికి దెలియవచ్చెను. అందుచే నాతడే ససైన్యముగఁ బోయి శత్రుసేనలం దలపడి పీల్చి చెండాడవలయునని విజయరాయలు నిశ్చయించు కొనియెను.

సంధ్యాకాల మైనతరువాత విజయరాయలు తన సైనికుల కందఱను దెల్లవాఱకముందే శత్రుశిబిరముల నాక్రమింపవలయును. అందరు నిందుకొఱకు సంసిద్ధులై యుండవలయును అని యాజ్ఞాపించెను. నిమిషములో నాతని యాజ్ఞ సైనికులకందరకును దెలిసిపోయెను. దండనాయకులు సైనికులను యుద్ధసన్నద్ధులం జేయుచుండిరి. అన్ని కార్యములు నతిరహస్యముగ నతిజాగరూకతతోఁ గావింపఁబడుచుండెను. ఆరాత్రి సైనికు లెవ్వరును నిద్రింపలేదు. అందరును జాగరూకులై యుండిరి. రెండుజాములైన తరువాత విజయరాయలు సైనికులందరను యథోచిత కార్యములయందు నియోగించి విశ్రాంమార్థమై తన ప్రాసాదమునకుఁ దిరిగివచ్చెను. ఆతఁడు తిన్నగ శయనగృహమునకుఁ బోయెను. దాసదాసీజను లెవ్వరు నా సమయమునం దాతనితో నెట్టి ప్రశంస చేయుటకును భయపడిపోయిరి.

## ఇరువదినాలుగవ ప్రకరణము

గభీరతమంబగు నయ్యర్థరాత్రమున మహారాజ్ఞి యగు మురళ స్వామి శయనమందిరమునం బ్రవేశించెను. విజయరాయలు శయనింపలేదు; గృహమధ్యమునం బ్రచారము చేయుచుండెను. అతఁడు తలవంచుకొని దీర్ఘనిశ్వాసముల విడుచుచుండెను. అతడు దీర్ఘచింతానిమగ్న మానసుఁడై యుండుటచే మురళ పదశబ్దములను వినలేదు. మెల్లమెల్లగ—నిశ్శబ్దముగ మురళవచ్చి స్వామివీఁపుపైఁ జేయివైచెను. అదరిపడి విజయరాయలు తిరిగిచూచి “ మరల నాకాస్వప్నమే వచ్చినది ! ” అనియెను.

మురళ వికటముగ నవ్వుచు “ ప్రతిరాత్రియు నంధకారమున మీకుఁ బిశాచదర్శన మగుచువేయున్నది ” అనియెను.

విజ—నవ్వెదవేమి ? నేను నిశ్చయముగఁ జూచుచున్నాను. యుద్ధమునుండి నేనిఁకఁ దిరిగిరాను.

ముర—ఈభవిష్యత్‌జ్ఞానము మీకెట్లు కలిగినది ?

విజ—కానిచో నా భయంకరస్వప్న మీరాత్రియే వచ్చుట యెందులకు ? రేపు యుద్ధము కాఁగలదు.

ముర—మీకాస్వప్నము ప్రతిదినమును వచ్చుచున్నది ? ఛీ ! ఇంతభయ మెందులకు ?

విజ—మురళా ! ఒక్కమాట వినియెదవా ? రమ్ము ! నన్నుఁ బట్టుకొనుము ! రమ్ము ! మనము పాఱిపోవుదము ! ఇరువురము నేయరణ్యమునకైనఁ బోయి జీవింతము ! నా ప్రాణములపై నాకంతటి యాశకలుగుచున్నది—ఇంత శీఘ్రముగ మరణింపఁ జాలను—నేను మహాపాపాత్ముఁడను—చచ్చినచో నాకు గతులులేవు—శరణ్యములేదు—

అందువలనఁ జచ్చుటకు నాకు సాహసము కలుగుటలేదు—చచ్చినచో నేను భయంకరనరకానలజ్వాలలోఁ బడిపోవుదును!—అందుచేత—ఆభయముచేత—నేను మరణింపఁజాలను! మురళా! నన్నుఁ గొన్నాళ్లు బ్రదుకనిమ్ము!

మురళ చిఱునవ్వునవ్వుచు "నిన్నుఁ జంపువారెవ్వరు! మహా వీరుఁడవగు నిన్నును, నీవీరసైన్యమును మూఢులగు నాకోయలే జయించినచో దూర్పున నుదయించు సూర్యుఁడు పశ్చిమమున నుద యింపఁడా? నీమాటలు వినిన నవ్వువచ్చుచున్నది" అనియెను.

విజయరాయలు కాతరస్వరముతో "యుద్ధమున నాకు జయ మైనను కావచ్చును. కాని యుద్ధమునఁ జావుబ్రదుకులంగూర్చి యెవ్వరు నిర్ణయింపగలరు? యుద్ధమునకుఁ బోవునప్పుడే జీవితాశ వదలుకొన వలయును. దూరమునుండి యొకబాణము తగిలినఁ జాలదా? చావనఁగా నెంత? చచ్చుటకు నాకు సాహసములేదు" అనియెను.

ముర—ఈవిధముగ బ్రదికి యున్నందువలన నేమిలాభము? నిన్ను వన్యమృగమువలె బోనున బంధించి లోకులందఱకును "ఈపితృ హంతకుని జూడుఁడు!" అని ప్రదర్శింపఁదలయునా యేమి?

విజ—ఛీ! ఛీ! ఊరకుండుము!

ముర—ఏమి! ఊరకుండుటయేమి? ఇష్టమున్నచో నీవు పాఱి పొమ్ము!—నేనుమాత్ర మట్లు చేయఁజాలను!—నీస్థానమున నీమారుగ నేనేనిలిచి యుద్ధముచేసెదను. అపజయము తటస్థించినను రణరంగము నుండి వెనుదిరిగిరాను! అప్పుడు లోకులందరును మురళ వీరపురుషునివలె మరణించినదని ప్రశంసింతురు!

విజయరాయ లేమియును మాటాడలేదు. మౌనముతో నటు నిటుఁ దిరుగుచుండెను. కొంతసేపైన తరువాత మురళను సమీపించి

" నీవా భయంకరాగ్ని జ్వాలను జూచియుండలేదు-ఏయగ్ని జ్వాల నన్నుఁ జిరకాలమునుండి దహించివై చుచున్నదో యాయగ్ని జ్వాలను నీవు చూడలేదు—అందుచేతనే నీకుఁ జావనిన భయములేదు—ఆ ధారుణా నలమును జూచినచో నీవును మరణింపఁజాలవు—మురళా ! నేను నీపాదములఁ బట్టుకొనియెదను—నన్నింకను గొన్నాళ్ళు బ్రదుకనిమ్ము ! నిశ్చయముగ నేనెఱుంగుదును—యుద్ధమునకుఁ బోయినచో నిఁక మరలిరాను ! " అనియెను.

ముర—ఏమియీ వెఱ్ఱి ! నిన్నుఁ జంపువారెవ్వరు ? గ్రహగణ నముచేసి సన్యాసి చెప్పినమాట లప్పుడే మఱచిపోయితివా ?

విజయరాయ లటునిటుఁ దిరుగసాగెను. అప్పుడు మురళ " పితృ హంతకుఁడు, నరరూపరాక్షసుఁడు ననిపించుకొనుచు నసహ్యకర పదార్థమువలెఁ బ్రత్యక్ష హాలాహలమువలె లోకులందఱకు నగపడుచు నీవిధముగ జీవించి యుండుటకంటె మరణించుటయే మేలు ! " అనియెను.

విజ—నేను పాఱిపోయినచో నన్నెవ్వరు పట్టుకొనగలుగుదురు ?

అప్పుడతి గంభీరభావముతో—అతిభయావహస్వరముతో మురళ " విజయరాయా ! నీవు యుద్ధమున కంగీకరింపక పాఱిపోఁదలఁచినచో నితరు లెందులకు ?—పితృహంతకుఁడని యందఱకుఁజెప్పి నేనే నిన్నుఁ బట్టి యొప్పగించెదను " అనియెను.

విజయరాయని సర్వాంగకములును బ్రకంపితములై పోవు చుండెను. అతఁడు విస్ఫారితనయనములలో మురళఁ జూచి " ఛీఛీ ! నోరుమూయుము ! " అనియెను.

ముర—" విజయరాయా ! నీవు సమరముచేసి తీరవలయును— కాకున్నఁ జచ్చితీరవలయును—అట్లు కానిచో నేను మరణించెదను. అంతియకాని నేను జీవించియుండఁగా నీవిదుబ్రోలు రాజ్య మహారాజ్ఞి

పదమును మఱియొకరి కీయఁజాలను " అని మురళ క్రోధావేశముతో నటనుండి వెడలిపోయెను. చాలసేపటివఱకును విజయరాయ లట్లే యా గృహమునఁ బ్రచారముచేయుచుండెను. అంతలో నాతఁ డాకస్మిక ముగ నులికిపడి నలువంకల దిలకించుచు వెలుపలఁ బ్రవేశించెను. తోడనే యశ్వారోహియై సైన్యములయొద్దకు బయలుదేఱిపోయెను. సైనికులందఱును జాగరూకతతో యుద్ధసన్నద్ధులై నిలిచియుండిరి. నిమిషములో మహారాజునాజ్ఞ యంతటను వ్యాపించెను. తత్క్షణమె సేనలన్నియు శత్రుశిబిరముల నాక్రమించుటకై దాడివెడలెను.

## ఇరువదియొదవ ప్రకరణము

రామరాయని శిబిరమునం దందఱును రణవేష ములతోడనే నిద్రించుచుండిరి. వనరాజు నాజ్ఞచే వారందఱును విశ్రమించియుండిరి. ఉదయముననే నిశ్చయముగ యుద్ధము జరగునని వనరాజెఱుఁగును. అందుచేతనే యారాత్రి విశ్రమించుట కాతఁ డాజ్ఞయొసంగెను. కాని వనరాజుమాత్రము నిద్రింప లేదు. రామరాయలును నిద్రింపలేదు. మురళ విజయరాయని యుద్ధ మునకుఁ బురికొల్పుచున్న సమయమునకు సరిగ నిక్కడ వనరాజును రామరాయలును గూర్చుండి మాటాడుకొనుచుండిరి.

వన—రాజకుమారా ! నీవు నాకొకవరము నీయవలయును—

రామ—చెలికాఁడా ! ఈ ప్రపంచమున సరళతరువాత నాకుఁ బ్రేమింపదగినవాఁడవు నీవొక్కఁడవే—ఇంతేకాక నేను నీకు విశేషించి యనేకవిధముల ఋణపడియుంటివి నీవు నన్నుఁ గోరుటయననేమి ? చెప్పుము ! నీవు చెప్పినట్లే చేసెదను.

వన—నీవు రేపటిదినమున రణరంగమునకుఁ బోవలదు—ఇది నాయాజ్ఞ—ఇది నాయాలోచన—

ఆ మాటల నాలకించి రామరాయలు విస్మితుఁడయ్యెను. చాల సేపటివఱకు వనరాజువంకఁ జూచుచు "అదియేమి వనరాజా? నీవే నన్ను యుద్ధమునకుఁ బురికొల్పితివి-మరల నీవే యుద్ధమునకు రావలదని విషేధించుచున్నావు!" అనియెను.

వన—నీమాఱుగ నేనే యుద్ధము చేయుదును—నీవు రణరంగమునకు రావలదు—ఈనాయాజ్ఞను నీవు పాలింపఁజాలవా?

రామ—నెచ్చెలీ! అట్లు చేసినచో లోకులేమనుకొందురు? ఇది యెట్లు సాధ్యమగును? యుద్ధసమయమున నేనగపడకున్నచో మన పక్షముఁజేరిన క్షత్రియవీరు లెవ్వరును యుద్ధముచేయఁజాలరు—అందుచే సుశిక్షితులగు రాజసైనికుల చేతులలోఁబడి కోయలందఱును నిర్మూలమై పోవుదురు. నేనేమొగము పెట్టుకొని యట్లుండగలను? నీయాజ్ఞను బాలింపజాలను.

అప్పుడు వనరాజు చకితుఁడై "రాజకుమారా! శత్రుసైన్యము వచ్చుచున్నది. సైనికుల పదశబ్దములు వినవచ్చుచున్నవి" అని చెప్పి వనరాజు మురళీధ్వని నారంభించెను. ఆ మధుర మురళీధ్వని యంత రాళమున మధురతరంగాయితమగుచుండెను. కోయలందఱు నామోహన ధ్వనుల నాలకించిరి. మంత్రబలముచేతనుం బోలె వారందరును లేచి యుద్ధసన్నద్ధులై నిలువఁబడిరి. నిమిషములో గోయలందరును జాగరూకులైరి; అందఱును యుద్ధసన్నద్ధులైరి.

అప్పుడు వనరాజు మురళీగానమునాఁపి సంభ్రమమముతో రామ రాయల హస్తములం బట్టుకొని కాతరస్వరముతో "రాజకుమారా! నాయాజ్ఞను బాలింపుము! నీవు యుద్ధము చేయవలదు" అనియెను.

అప్పుడు రామరాయలు నవ్వుచు "మిత్రమా! నీవు నన్ను మిగులఁ బ్రేమించుచున్నందులకు నేనానందించుచున్నాను. భయము లేదు—నేను మరణింపను" అనియెను.

ఇంతలో విజయరాయని సేనలు కోయశిబిరములను సమీపించి జయధ్వనులం గావించుచుండెను. తోడనే రామరాయని సేనలును గగనవిదీర్ణంబులగు జయధ్వనులం గావించుచుండిరి. ఇఁక మాటాడుచుఁ గూర్చుండుట కవకాశములేదు. రామరాయలును వనరాజును గూడ నొక్కయుదుటున నశ్వముల నధిరోహించిరి. ఆయంధకారములో నా యిరువురి వాఁడికత్తులును మిలమిలమెఱసెను. మరల మరల జయధ్వనులు భూనభోంతరాళముల నిండిపోవుచుండెను.

## ఇరువదియేడవ ప్రకరణము

భయంకరయుద్ధ మారంభమయ్యెను. సైనికుల ధిక్కారములును. శస్త్రాస్త్రముల ఝణఝణ ధ్వనులును, ధనుష్టంకార స్వనంబులును, గజబృంహితగభీరనిస్వనంబులును, అశ్వహేషారవంబులును, దండనాయకుల యుత్సాహవాక్యములును సాహసుల యార్తనాదములును దిక్కుల నిండిపోవుచుండెను. కోయ సైన్యము నలువంకలను ముట్టడింపఁబడి యుండెను. ప్రత్యేక మొక ప్రక్కను బదివేలమంది క్షత్రియవీరులతో విజయరాయలు కోయల

నుఱు యోమకునకు సంసిద్ధుఁడై యుండెను. కాని సుస్థిరపర్వతమాలికంబోలి చెక్కుచెదరక రామరాయని క్షత్రియ వీరగణంబును, కోయగణంబును నిలిచి శత్రుమూలతోఁ బోరాడుచుండెను. విజయరాయని యశ్వసైన్యము వారిని ముట్టడించుచు మరలఁ బెదరిపోవుచుండెను. రామరాయనిసైన్య మొక్కయడుగైనఁ జలింపక శత్రువుల నెదిరించుచుండెను.

వనరాజు ప్రౌఢవ్యూహ రచనాప్రభావము శాత్రవులకు దుర్భే ధ్యముగ నుండెను. అప్పుడు వనరాజే సర్వసేనాధ్యక్షుఁడు. కౌరవసేనా వ్యూహమును భేదించుటకై యగ్రవర్తియగుచున్న యభిమన్యు కుమారునింబోలి వనరాజు శత్రుభయంకరుఁడై యుండెను. ఆతనిసైన్య మాతని యద్భుతవ్యూహరచనచే నొక్కయడుగైనఁ గదలుటలేదు— అంగుళమైనఁ జరుగుటలేదు—నిమిషమైనఁ జలించుటలేదు. గాలివానకు సముద్ర ముప్పొంగివచ్చునట్లు విజయరాయని సైన్యము మాటిమాటికి నాతనిసైన్యముం దాఁకుచుండెను—కాని యెంతమాత్రమును గదల్పఁ జాలకుండెను. వనరాజునాజ్ఞకెవ్వరు నడుగుదాటుటలేదు. రామరాయని పక్షమునంజేరిన క్షత్రియవీరులుకూడ నాతని యాజ్ఞను బాలించుచుండిరి. అంతయు నియమబద్ధముగ నుండెను. కౌశలమయమై యుండెను— అంతయు సుందరమైయుండెను.

కోయసేన యర్ధచంద్రాకారముగ నిలిచియుండెను — ఎదుట అంతటను బార్శ్వములను వెనుకనుగూడఁ గోయలు మహాసంరంభముతో నిలిచియుండిరి. వెనుకనొక యర్ధచంద్రవ్యూహమునకు మధ్యస్థలమున సేనాపతియై సదాశివరాయలును, నాల్గుకవీరులతో నాతని పార్శ్వముల నరసింహరాయలును, త్రివిక్రమరాయలును నిలిచియుండిరి. ఆపై పునఁ

గేతకీదుర్గాధ్యక్షుఁడు ప్రబలసైన్యముతో వారి నెదిరించి యాక్రమించుచు వెనుకకుఁ దగ్గుచు మహాసంరంభముతో యుద్ధముచేయుచుండెను.

ముందఱనున్న యర్ధచంద్రవ్యూహమున రామరాయలును నాతని పార్శ్వమున నశ్వారోహియై వనరాజును నిలిచియుండిరి. విద్యాధరుఁడును—నారాయణరాయలును గజారూఢులై యువరాజున కిరుగెలంకులనుండి రాజచ్ఛత్రమును బట్టియుండిరి. అయిదువేలమంది క్షత్రియవీరు లశ్వారూఢులై యాతని యుభయపార్శ్వముల నిలిచి రక్షించుచుండిరి.

రెండుజాముల వఱకును మహారణము జరగినది. కాని విజయరాయలు శత్రుసైన్యము నించుకంతయును భేదింపఁజాలకపోయెను; కోయసేన నొక్కయడుగైనఁ గదలింపఁజాలకపోయెను. రాజకులకళంకుఁడగు నా విజయరాయనిపై నొక్కసారిగఁబడి యాతని దండింపవలయునని యువరా జెన్నియోసారులు విజృంభించెను. గాని వనరాజునాజ్ఞ లేకపోయెను. కేవలము రామరాయలకు మాత్రమే యిట్టి యావేగము కలుగలేదు — ఆ పక్షమునందలి యెల్లక్షత్రియవీరులకును గోయలకునుగూడ నిట్టి యుద్రేకమే కలుగుచుండెను—వారు మాటిమాటికి వనరాజు మొగమువంకఁ జూచుచు నాజ్ఞకొఱకు నిరీక్షించుచుండిరి. కాని వనరాజు చలించుటలేదు—

విజయరాయలు మిగుల నధీరుఁడై పోయెను. రెండుజాములు యుద్ధముచేసినను గోయసైన్యము చెక్కుచెదరలేదు. మాటిమాటికి నాతని హృదయమునఁ గ్రోధానలము వర్ధిల్లిపోవుచుండెను. తన సైన్యము మిగుల నలసిపోవుచున్నట్లు కూడ నాతనికిఁదోఁచెను. ఇంకను

నిక్లే కొంత సేపు యుద్ధమైనచో దనకుఁ బరాజయము తటస్థించుననికూడ భయము కలిగెను. ఒక్కసారిగా కడసారి ప్రయత్నము చేయవలయునని యాతడు సైన్యసమేతుఁడై మహాసంరంభముతో శత్రుసైన్యముపై బడియెను. మేరుపర్వతము స్థానచ్యుతమై యాకస్మికముగ నా కోయలపై బడినట్లయ్యెను—ఈసారి యా సైన్యము చెదరిపోయెను.

ఆసంకుల సమరమునం దొకటిరెండు బాణములు వచ్చి విద్యాధరుని యేనుగు శరీరమునం గ్రుచ్చుకొనియెను. ఆ బాధచే నావారణము ఘీంకరించుచు మావంతుఁ డెంతయాఁపిన నాఁగక శరవేగముతో శత్రుసైన్యమధ్యమునం బ్రవేశించి చెల్లాచెదరు చేయుచుండెను. ఆ పదాఘాతములచే ననేకశత్రుసైనికులు పడిపోవుచుండిరి. అప్పుడు విజయరాయని సైనికులు జయధ్వనులం జేయుచుఁ జాలమంది యా విద్యాధరునిం జుట్టుముట్టిరి.

ప్రియబంధుఁడగు విద్యాధరుఁడు ప్రాణములపై నాశ వదలుకొని శత్రువులతో యుద్ధము చేయుచుండుటను దూరమునుండి రామరాయలు కనుఁగొనియెను. అప్పుడు విధ్యాధరుఁ డాత్మసంరక్షణమునకై చేయవలసినంత యుద్ధము చేయుచు నడుమ నడుమ వ్యాకులభావముతో రామరాయల వైపునకుఁ జూచుచుండెను—రామరాయ లిఁక నూరకుండఁజాలకపోయెను. అతఁడు వనరాజువైపునకుఁ జూచి "చెలికాడా! ఇఁక నీయాజ్ఞను బాలించుట కవకాశము లేదు—ప్రాణము నిచ్చియైన బంధువును రక్షించుకొనియెదను. కానిచో మరణింతును" అనియెను.

ఇట్లు చెప్పుచుండఁగానే రామరాయని యశ్వము శరవేగమునం బోయి శత్రుసేనామధ్యమునఁ బ్రవేశించెను. అప్పుడు వనరాజు

భయప్రకంపితుఁడై "రాజకుమారా! ఇదియేమి! ఇదియేమి!" అనియెను. ఆ మాటలు రామరాయల చెవులఁ బడుటకు బూర్వమే యాతఁడు బంధురక్షణమునకై శత్రుసైన్యమునఁ బ్రవేశించెను. అందు వలన నాతనికి వనరాజు మాటయే వినబడలేదు.

## ఇరువదియేఁడవ ప్రకరణము

వనరా జొక్కసారి వెనుకకు దిరిగి తన సేనావ్యూహముం దిలకించి యొక్క దీర్ఘ నిశ్వాసమును విడిచి మొగముపై జెమ్మటలం దుడుచుకొనుచు "సైనిక సోదరులారా! రాజకుమారుని రక్షించుకొనుఁడు!" అని బిగ్గరగఁ బలుకుచు నాతఁడు తన యశ్వమును దాఁటించుచు శత్రుసేనారంగ మధ్యమునఁ బ్రవేశించెను. పదివేలమంది కోయసైనికు లాతని వెను వెంటనే త్రోసుకొని వచ్చుచుండిరి. రెండువేలమంది యశ్వసైనికులతో నారాయణరాయలు కూడ వనరాజు ననుసరించి వచ్చెను.

నిమిషములోఁ గోయలవ్యూహ మంతయుఁ జెదరిపోయెను. ఉభయవ్యూహములును మొదట నెట్టిరూపమున నిలిచియుండెనో యిప్పు డట్లు లేవు. ఎవరి యిచ్చమువచ్చినట్లుగ వారు మహారణరంగమునంబడి విజృంభించుచుండిరి. సంకులసమరము జరగిపోవుచుండెను. కేకలు, గర్జనములు, హేషారావములు మొదలగు ధ్వనులన్నియు నేకీకృతము లైపోయెను. శత్రుమిత్రనిర్ణయమున కుపాయమగుపడుటలేదు. ఎదుటఁ బడిన వారితోనెల్ల యుద్ధము గావించుచుండిరి. రణరంగమంతయు రక్తసిక్తమైపోయెను.

రామరాయలు విద్యాధరుని రక్షింపఁజాలకపోయెను. చాలమంది క్షత్రియవీరులచే ముట్టడింపఁబడి విద్యాధరుఁడు రణభూమిం బడిపోవుటకు సిద్ధముగనుండెను. అతని చేతియందలి కృపాణము క్రిందఁబడిపోయెను. శత్రువు లాతని యేనుఁగను జుట్టుముట్టియుండిరి రామరాయ లాతని సమీపముసందే యుండెను. బంధు విపత్తుం జూచి యాతడు తన్నే మఱచిపోయెను. ఒక్కయుదుటున వారిపైబడి నురుమాగవలయునని శరవేగమునఁ బోవుచుండెను. విద్యాధరుఁ డాతనిం జూచి "కుమారా! తొందరపడకుము! లాభములేదు. ఆత్మరక్షణముం గావించుకొనుము! నేను మరణించినచో లోపమురాదు; నీవు లేకున్నచో సర్వనాశనమైపోవును" అని కేకవైచుచు నేనుఁగుపైనుండి క్రిందఁబడిపోయెను.

అప్పుడు విజయరాయని సైన్యమున జయధ్వనులు చెలరేఁగెను. రామరాయలు తనకును విపత్తు కలుగనున్నదని తెలిసికొనియెను. అతనిచుట్టును శత్రువులు ముట్టడించి యుండిరి. వారింతవఱకును విద్యాధరునితో రణముచేయుచు రామరాయనిఁ జూడలేదు. ఇప్పుడు యువరా జొంటిగఁ దమ కగ్గమైయుండుటం గాంచి వారందరును దెసలు బ్రద్దలగునట్లు సింహనాదములఁ గావించుచుండిరి. విజయరాయలు దూరమునందుండి రామరాయలంగాంచి సింహమువలె గర్జించుచు నాతనిపైఁ బడుటకు వచ్చుచుండెను. రామరాయ లప్పటి తనయవస్థం గాంచి భయపడలేదు. ఆతనికి ప్రాణములపై నాశలేదు. అతఁడు యుద్ధమునుండి వెనుదీయువాఁడు కాఁడు; అందుచే నాతఁడు తెగించి శత్రుసైన్యముల నుఱుమాడుచు నొకసారి వెనుకకుఁ దిరిగి చూచెను. వనరాజును గోయలును మహాసంరంభముతో శత్రుసైన్యములఁ

జెండాడుచు భేదించుకొని తనవైపునకే వచ్చుచుండిరి. రామరాయని రక్షించుకొనుటకై వనరాజా వేశముతో వచ్చుచుండెను. అప్పటి యాతని యంతటి సౌందర్యము రామరాయ లెప్పుడును జూచియుండలేదు.

వనరా జశ్వారూఢుఁడై వచ్చుచుండెను. ఆతని వినీల కుంతలములు విడివడి వెన్నునను, వక్షోభాగములను జీరాడుచుండెను. ఆతని దక్షిణహస్తమునందలి శాణితకృపాణము రక్తమై రౌద్రకిరణ ప్రతిభాసితమగుచుండెను. ఆతని దుస్తులన్నియు జెదరియుండెను. ఆతని మోహన వీణ ఎచ్చటనో పడిపోయినది—ఆతని రుద్రాక్ష మాలికయును కృష్ణాజినమును నిప్పుడులేవు—కాని వనరాజు తన మధురమోహన మురళిని మాత్రము విడువలేదు—ఆతని వామహస్తమునందిప్పటికిని నా చిరపరిచితంబగు వేణువు విరాజిల్లుచున్నది।

విజయరాయని సైనికులు ప్రాణములనైన లక్ష్యముచేయక యాతని నడ్డగించుచుండిరి. కాని యెవ్వరు నాతని నిశితకృపాణము నెదుట నిలువఁజాలకుండిరి. పర్వతమును భేదించి వేగవతియగు సరస్వతి యెట్లు ప్రవహించునో యట్లే వనరాజు శత్రుసైన్యమును భేదించుకొని రామరాయని సమీపించుచుండెను. రామరాయలు వనరాజును దదేక ధ్యానముతోఁ జూచుచు ముగ్ధుడైపోయెను. అంతలో నొకశత్రువీరుఁ డాతని శిరమును దెగనఱకుటకై తనకరవాలమును బైకెత్తెను. అప్పుడు వనరాజు "రాజకుమారా। సావధానుఁడ వగుము।" అని హెచ్చరించెను. ఆ ప్రళయకోలాహల మధ్యమునఁ గూడ నా మధురస్వరము యువరాజునకుఁ గర్ణగోచరమయ్యెను. ఆతఁడు చటాలునఁ దిరిగి యాత్మసంరక్షణముం గావించుకొనియెను.

కాని యాతఁ డేకాకియై యట్లెంత సేపటివఱకు నాత్మసంరక్షణము చేసికొనఁగలఁడు ! ఒకటి రెండు నిమిషములు గడపఁగలిగినచో వనరా జెంతయో దూరమునలేఁడు—కాని యట్లు జరగినదికాదు—ఆకస్మికముగ నప్పుడు విజయరాయలే ససైన్యముగ వచ్చి యువరాజు నాక్రమించెను. అతనిఁజూచి రామరాయలు క్రోధావేశవివశుఁడై యున్మత్తునివలె యుద్ధము చేయనారంభించెను. అతని యాసన్నమృత్యువుం జూచి వనరాజు రాక్షసునివలెఁ దన యిరుగెలంకులం గల శత్రువీరుల మస్తకములను నిశితఖడ్గమున కెరసేయుచు మహామారణ క్రీడోన్మత్తుఁడై ముందటికి సత్వరముగ వచ్చిపడుచుండెను.

అంతలో నచ్చట భయంకర కోలాహలము బయలుదేరెను. ఉత్తరక్షణముననే రక్తాక్తకళేబరుఁడై యున్న యొక యోధుడు వనరాజు పార్శ్వమునకు వచ్చుచుండెను. ఆతని వెనుకనే విజయరాయలును సేనాసహితుఁడై త్రోసికొని వచ్చుచుండెను. వనరా జొక్కసారి మాత్రము చూచెను—తన పార్శ్వమున నున్న యాతఁడు యువరాజు— అంతలో రామరాయలు గుఱ్ఱముపైనుండి క్రిందఁ బడిపోయెను. తత్క్షణమే వనరాజు గుఱ్ఱమునుండి క్రింది కుఱికి యాతని బట్టుకొనుటకై ప్రయత్నించెను—కాని సమీపముననే త్రోసికొనివచ్చుచున్న విజయ రాయనిం జూచి చేయునదిలేక వెనుకకుఁ దిరిగి కోయల సంబోధించి "సోదరులారా ! మీరు నన్నుఁ బ్రేమించుమాట సత్యమేయైనయెడల నీ రాజకుమారుఁ డశ్వపదాఘాతములం బడిపోకుండ వచ్చి రక్షించు కొనుఁడు !" అని కేకవైచెను.

నిమిషములో నైదువేలమంది కోయలువచ్చి యువరాజును బరివేష్టించి చుట్టును బర్వతప్రాకారముం బోలి నిశ్చలులై నిలిచి యుండిరి. అంతలో మెఱపుమెరసినట్లుగ గుఱ్ఱమును బరుగెత్తించి వనరాజు విజయరాయనిపై బడియెను.

# ఇరువదియెనిమిదవ ప్రకరణము

వనరాజుం జూచి విజయరాయలు తప్పించు
కొని పోవుచుండెను. నిమిషములో వనరా
జాతని నెదిరించి యుద్ధగించి "రాక్షసా! క్రూరరాక్షసా! ఇప్పుడు నేనే నీకుఁదగిన శిక్షగావించెదను" అని గర్జించుచు విజృంభించెను. విజయరాయలు గుఱ్ఱమునాపి క్రోధముతో "ఓ యరణ్యబాలకా! నీవు విజయరాయల నేమియో యెఱుంగవు" అనియెను. వనరాజు ధిక్కరించుచు "ఎఱుఁగకేమి? నీవు విదుఁ బ్రోలు రాక్షసుఁడవు" అనియెను. విజయరాయ లిఁక సాహసింపఁజాలక క్రోధముతో "ఓ బాలకా! నిన్నుం జంపి నాహస్తమును గళంకితముగఁ జేసికొనజాలను. ఇంకను మించిపోలేదు—ప్రాణముల నఱచేత నుంచుకొని పాఱిపొమ్ము! ఇఁక నెవరికొఱకు యుద్ధముచేసెదవు? రామరాయ లిఁకలేఁడు!" అనియెను.

వనరాజు మఱి మాటాడకుండ విజయరాయనిపైఁ బడియెను. అతని యుద్ధకౌశలముం గాంచి విజయరాయలు నవ్వుచు "బాలకా! నీవు యుద్ధవిద్యాపారంగతుఁడవని నేను మెచ్చుకొనుచున్నాను. నీవు నన్నేమియును జేయఁజాలవు—నేనెట్టి పురుషుని మూలముననుమరణించువాఁడను గాను" అనియెను. వనరాజు క్రోధోద్రేకముతో నవ్వుచు పితృహంతకుఁడా! నరరూపరాక్షసుఁడా! నేను పురుషుఁడను గాను—కోయల శ్యామలను!" అనియెను.

"శ్యామలయా?" అని పలుకుచు విజయరాయలు కొన్ని యడుగులు వెనుకకువైచెను. నిమిషములో నాతని కన్నులయెదుట నా భయంకర స్వప్నము ప్రదర్శితమయ్యెను. అతని కృపాణము

చేతినుండి జాఱిపోవుచుండెను. కాని యాతఁ డతికష్టముతో ధైర్యము తెచ్చుకొని "నీవు నిజముగ శ్యామలవే కావచ్చును. అయినను నీచేతులలో నేను మరణింపను. స్త్రీహస్తములయందుఁగూడ నాకు మరణములేదు" అనియెను.

వన—నన్నింతవఱ కెవ్వరును స్త్రీయని యెరుంగరు.

ఆమాటల నాలకించినంతనే విజయరాయని కన్నులు చీకటులు గ్రమ్మెను. కాని యింతలో నాతనికి మరల రాక్షసబలము వచ్చెను. అతఁడు గుఱ్ఱమును దాటించి వనరాజు విశీర్ణకుంతలముల వామహస్తములతోఁ బట్టుకొని బలవంతముగ నాతవితలవంచి కంఠమునకు గుఱిచూచి నరకుటకై కరవాలమును బైకెత్తెను—ఇఁకనొక నిమిషము—

ఆకస్మికముగ విజయరాయలే వికటధ్వనిచేయుచు గుఱ్ఱము నుండి క్రిందికిఁ బడిపోయెను. విజయరాయలు శ్యామలను నఱకుట కుద్యుక్తుడై యున్న నిమిషములోనే శ్యామల తన మొలనున్న శాణితచ్ఛురికం దీసి విజయరాయని వక్షమునఁ బిడివఱకు దూసికొని పోవునంతటి బలముగఁ బొడిచెను. తోడనే యాతఁడు పడిపోయెను. ఆకస్మికముగ మహారాజు పడిపోవుటం జూచి క్షత్రియవీరు లందఱును బలాయితులైరి.

అప్పుడు శ్యామల గుఱ్ఱమునుండి క్రింది కురికెను. కోయలామెకుఁ ద్రోవయొసంగిరి. అప్పుడామె యున్మాదినివలె రామరాయల యొద్దకుఁ బరుగెత్తుకొనిపోయి యాతని మస్తకమును దన యంకమునం జేర్చుకొని కూర్చుండెను. అప్పు డామెకుఁ గన్నీరు మున్నీరై పోవుచుండెను. ఆమె యేడ్చుచు నేడ్చుచు "నాథా! ప్రాణేశ్వరా! ఒక్కమాట మాటాడుము! నిన్నాదరించుటకు నా కెప్పుడు నవకాశము దొరకలేదు" అనియెను.

రామరాయలు మూర్ఛితుఁ డయ్యెనేగాని యింకను మరణించి యుండలేదు — ఆతని కర్ణకుహరములయం దస్పష్టముగ శ్యామల మధుర కంఠస్వరము ప్రవేశించెను. ఆ మధురస్వరామృతలహరిమూల మూలముల నాతని ప్రతిరక్తనాళమునందును సంజీవనీసుధ ప్రవహించెను. ఒక్కనిమిషములో నాతనికిఁ దెలివివచ్చెను. ఆతఁడు మెల్లమెల్లఁగఁ గన్నులను విచ్చి శ్యామలవంకఁ జూచుచు మెల్లమెల్లఁగ "వ—న—రా—జా!" అనియెను.

శ్యామల వికలహృదయయై యేడ్చుచు "నాథా! నేను నీదాసిని —శ్యామలను—" అనియెను

రామరాయలు మరల "శ్యామ—లా?" అనియెను. అంతలో నాతఁడు కన్నులు మూయుటం జూచి శ్యామల యేడ్చుచు "స్వామీ! ఒక్కసారి పలుకరింపుము! నాథా! ఒక్కసారిమాత్రము—నిన్ను నేను పొందియు నీయిహజీవనమున నీ సేవాభాగ్యమును బొందఁజాలకపోయితిని" అనియెను.

రామరాయలు మరలఁ గన్నులు విచ్చి యతికష్టముతో మెల్ల మెల్లఁగ "వనరాజును శ్యామలయు నొక్కరే యని నేనెన్నియోసారు లనుకొంటిని — కాని నిశ్చయించుకొనఁజాలకపోయితిని! శ్యామలా! ముందుగనే యీమాట చెప్పినచో నేను చావకుండఁగనే యుందునే!— ఆనంద—" ఇఁక నాతనికి వాక్యస్ఫురణ మగుటలేదు—ఇఁక గంఠస్వర మెలుకుట లేదు. రామరాయలు కన్నులు మూసికొనియెను— తోడనే యాతని ప్రాణవాయువులు ప్రేమవాయు తరంగములఁ గలసిపోయెను.

అప్పుడు శ్యామల బాలికవలె—అజ్ఞానశిశువువలె—అధీరయగు నబలవలె స్వామివక్షమునం బడి దొరలుచు నేడువసాగెను—

ఇంక నా వనరాజు లేఁడు—ఇంక నా కోయల సేనానాయకుఁడు లేఁడు—ఇంక నా రక్తమయియగు శైలాసేశ్వరియును లేదు—శ్యామల యిప్పుడు పతివిహీనయు—కాతరయు—విహ్వలయునై ప్రాణేశ్వరుని వక్షముపైఁబడి యేడ్చుచుండెను. ఎంతటి శిక్షాలాభముం బడసిననేమి? నారీహృదయమునందలి నారీత్వ మెక్కడకుఁ బోవును? సమీపము నందున్న కోయలందఱు నిదియంతయుం గాంచి స్తంభితులై నిలువఁబడి పోయిరి. ఎవ్వరేమనుటకును సాహసింపఁజాలకుండిరి.

రామరాయ లగపడకుండుటచే నీ పక్షమునందలి క్షత్రియవీరు లందఱును నిరుత్సాహులై యుద్ధమును మానివైచిరి. విజయరాయనిం గానక యా పక్షమునందలి సైనికులందఱును యుద్ధమును విరమించిరి. వనరాజుం గానక కోయలందఱును బలాయితులై పోవుచుండిరి.

## ఇరువదితొమ్మిదవ ప్రకరణము

మహారణరంగమధ్యమున, రక్తతరంగ మధ్యమున, హతాహతా సైనికజన మధ్యమున శ్యామల భర్తకొఱకు దుఃఖించుచుండెను రామరాయని మృత కళేబర మురమునం జేర్చుకొని యామె యేడ్చుచుండెను. ఆ సమయమునం దెవ్వరోవచ్చి యామెను "వనరాజా!" అని పిలిచిరి. శ్యామల యామాట నాలకింపలేదు. మరల నావ్యక్తి "శ్యామలా!" అని పిలిచెను. ఈసారి శ్యామల తలయెత్తి చూచెను. ఎదుట నొక వీరపురుషుఁడు నిలువఁబడియెను. శ్యామల యాతఁ డెవ్వరో తెలిసికొనఁ జాలకపోయెను.

పుర—నేను నీతండ్రియగు శూరసేనుని మంత్రిని—శారదా నందుఁడను.

శ్యామల—"తండ్రీ! నాయవస్థ జూచితివా? నాస్వామి యిఁక లేఁడు—" అని యేడువసాగెను.

శార—శ్యామలా! ఎందులకు దుఃఖించెదవు! విధివిధాన మట్లున్నది. నాకు మాత్రము సర్వనాశనము కాలేదా? అయినను నేను బాలకునివలె నాఁడుదానివలె నేడ్చుటమాత్రము లేదు. నీదుఃఖము నాదుఃఖముకాదా? ఇన్నాళ్ళు నిన్నుఁబెంచుట యిందుకొఱకే కాఁబోలును!

శ్యామల యేడ్చుచు "తండ్రీ! నేనాఁడుదాననుగాక మఱి యేమగుదును? మీరు నన్నుఁ బురుషునిగాఁ జేసితిరి. మీయాజ్ఞాను సారముగఁ బురుషునివలె యుద్ధముచేసితిని—మీరు చెప్పినట్లు ద్వంద్వ యుద్ధముచేసి విజయరాయలను సంహరించి పితృఋణమును దీర్చు కొంటిని—ఇంకను నన్నేమి చేయమనియెదరు? నా స్వామికొఱ కించుకసేపు నేనేడువఁగూడదా?" అనియెను.

శార—నీవు పితృఋణమును దీర్చుకొన్నమాట నిజమే—కాని స్వామికొఱ కేడ్చుట కిది సమయము కాదుతల్లీ!

శ్యామల—తండ్రీ! మీపాదములఁ బట్టెదను—నన్నించుకసే పేడువనిండు! ఇట్లు కానిచో నేను పిచ్చిదాననైపోయెదను. నా హృద యము పగిలిపోవుచున్నది ఈస్థానముననే నాస్వామి పాదముల చెంతనే నన్ను మరణింపనిమ్ము!—హా! నాథా! నాతో నొకసారి మాటాడవేమి?

శార—శ్యామలా! ఆనందరాయకుమారుని నేనొప్పగించినప్పుడు తీసికొందునని నీవు నాకు మాటయిచ్చిన సంగతి మఱచిపోయితివా!

ఇదిగో తీసుకొనుము! ఈ కుమారు నీకొప్పగించుటకే యిచ్చటికి వచ్చితిని.

అనిచెప్పి యుయ్యెలవంటి సంచిలోఁ బరుండియున్న బిడ్డను బైకిఁదీసి శ్యామలయొడిలో నుంచి "శ్యామలా! సుక్షత్రియవంశ సంభూతుండును, సర్వారణ్యాధీశ్వరుండును, కోయల కందఱకును బ్రత్యక్ష దైవస్వరూపుఁడును, గిరిదుర్గప్రభుండునునగు మీతండ్రి శూరసేన మహారాజు సబంధుమిత్రముగ విజయరాయనిచే రణరంగ విహతుఁడైన యానాఁటిరాత్రి స్వామివియోగమున గుండెలుపగిలి మరణించిన నీతల్లి వక్షముపై నేడ్చుచున్న రెండేండ్ల చిన్నబిడ్డయగు నిన్నుఁ దీసికొనివచ్చి యిన్నాళ్ళవరకుఁ బెంచితిని. ఉత్తమక్షత్రియ వీరబాలికవగు నీవు నాయాజ్ఞను బాలించి విజయరాయని సంహరించి పితృఋణముం దీర్చుకొంటివి—నిన్నుఁ బెంచి నీమూలమున నేనును నాస్వామి ఋణమునఁ దీర్చుకొంటిని. తల్లీ! నీతండ్రిని సింహాసన భ్రష్టునిం జేసిన యాతని సింహాసనముపై నిన్నధిష్ఠింపఁజేసితిని! పౌరుషము ఫలించినది—కాని దైవము సంపూర్ణముగఁ దోడుపడలేదు—ఇఁక నేనీ ప్రాపంచిక పరిణామములం జిక్కి కష్టసుఖముల ననుభవింపఁ జాలను—నా ఋణము తీరిపోయినది. కాని బిడ్డా! నీకు నీస్వామి ఋణముమాత్రము మిగిలియున్నది. నీవు సర్వవిద్యల నభ్యసించితివి—సమస్తధర్మముల నెఱింగితివి—ఇఁక నీకు నేను చెప్పవలసిన దేమియును లేదు. తల్లీ! నీవిఁక నన్నుఁ జూడఁజాలవు—నేనిఁక నీప్రపంచమును మమత్వముతో జూడఁజాలను" అని చెప్పి శారదానందుఁ డదృశ్యుఁడై పోయెను.

శ్యామల నిశ్చేష్టయై యొకసారి యొడిలోని యానందుని మొగమువంకను మరియొకసారి స్వామివదనము వంకను సజల నయనములతోఁజూచుచు నిట్టూర్పులు విడుచుచుండెను. పిమ్మట శ్యామల

యా బిడ్డనెత్తుకొని రణరంగము నలువంకలను బరికించెను—దూరము నుండి యేనుఁగుపై నున్న నారాయణరాయలు శ్యామల కెదురుగ వచ్చుచుండెను. శ్యామల సత్వరముగబోయి యాతని యేనుఁగుపై నెక్కి కూరుచుండి "నారాయణరాయా! రాజచ్ఛత్రమును బట్టుము. ఇదిగో! విదుబ్రోలు మహారాజు! నాయొడిలో నున్నాఁడు! అనియెను.

నారాయణరాయలు శ్యామలం జూచి యామె యొడిలోని కుమారునిం జూచి విస్మితుడై పోయెను. అప్పుడు శ్యామల వనరాజ వేషముం దీసివైచి "నారాయణరాయా! చూచుటలేదా యీచిన్ని యానందరాయులను!" అనియెను. నారాయణరాయలకు సంపూర్ణముగ నేసంగతియుఁ దెలియదు. అయిన నాతఁడు సత్వరముగలేచి నిలువఁబడి శ్యామలపై రాజచ్ఛత్రమును బట్టెను. అకస్మికముగ నా భద్రగజముపై రాజచ్ఛత్రముం గాంచి యుభయసైనికులును సత్వరముగ నాచోటికివచ్చి మూగిరి.

అప్పుడు శ్యామల యేనుఁగుపై నిలువఁబడి యానందరాయల నందరకుం జూపుచు "రాజబంధువులారా! సామంతప్రభువులారా! సైనికులారా! కోయనాయకులారా! ఈ కుమారుఁడు మీ మహారాజు! పితృహంతకుడగు విజయరాయని మూలమున విదుబ్రోలురాజ్యమునకుఁ దుదకిట్టి యవస్థవచ్చినది. ఈ యానందరాయలు నా స్వామియగు రామరాయల కుమారుఁడు—సరళాదేవి చిన్నికుమారుడు! కేతకీదుర్గమున ఘాతుకుల చేతులఁ బడకుండ నీతనిం గాపాడితిని. మీ రాజవంశమును మీ విదుబ్రోలురాజ్య సింహాసనమును వెలయింపఁగల యీ చిన్ని కుమారుడే మీ మహారాజు!" అని హెచ్చరించెను.

అప్పు డందఱు నేకగ్రీవముగ "చిన్ని యానందరాయ మహారాయలకు జయ! శ్యామలా మహారాజ్ఞికి జయ!" అని యుత్సాహసూచకముగ జయజయధ్వనులం గావించిరి.

# పరిశిష్టము

శ్యామలాదేవి కరుణచే విడుఁ(బ్రోలు మహారాజ్యమునకును, సమస్తారణ్య రాజ్యమునకును జిన్నియానందరాయలే మహారాజయ్యెను. రాజబంధువుఁడును సామంతప్రభువు నగు నారాయణరాయ లాతనికి సంరక్షకుఁడుగ నుండి రాజకార్యముల నిర్వర్తించుచుండెను. ఆనంద రాయని మహారాజుగఁ బడసిన ప్రజల కందఱకును మరల నెప్పటి యానందము కలిగెను.

జగదేకసుందరి యగు శ్యామల యిఁక లేదు—విడుఁ(బ్రోలు రాజ్యసింహాసనోద్ధారిణి యగు శ్యామల యిఁక లేదు—కోయలకనక ప్రతిమామూర్తియగు శ్యామల యిఁక లేదు—మధుర మురళీగాన మోహిని యగు శ్యామల—ప్రేమానందైకస్వరూపిణి యగు శ్యామల స్వామి మృతకళేబరముతోఁ జితారోహణముంజేసి ప్రజ్వలితపవిత్రాగ్ని జ్వాలాసాన్నిధ్యమున స్వామిశరీరముతోఁ దనశరీరమును సమ్మిళితముగ జేసివైచినది—స్వామిప్రాణములలోఁ దన ప్రాణముల నైక్యముగఁ జేసివైచినది—స్వామియవిందిత ప్రేమసాగరమునఁ దన యనంతప్రేమ ప్రవాహమును విలీనముగఁ జేసివైచినది!!

మురళి చావలేదు. ఆమె యున్మాదినియై వీధులవెంటఁ దిరుగు చుండెను. ప్రజలందఱు నామెనుజూచి భయపడి యొసరిల్లిపోవుచుండిరి. అర్ధరాత్రివేళ నామె గుండెలు బాదుకొని యేడ్చుచుండెడిది. చిరకాల మట్లే యామె తన పాపఫలము ననుభవించుచుఁ బిశాచమువలె సంచరించుచుండెను. బ్రదికియుండియే పిశాచమైయున్న యీ మురళి చచ్చినతరువాత నేమగునో యని ప్రజలందఱును భయపడుచుండిరి.

శ్యామలాదేవి సహగమనముం గావించిన పవిత్రస్థలమున శ్యామల విగ్రహమును, వీరపురుషుల విగ్రహములను బ్రతిష్ఠించి ప్రజలందఱును పూజించుచుండిరి. కొంతకాలమున కాపవిత్రక్షేత్రమునం దొక తింత్రిణీవృక్షము బయలుదేరెను. నిరుద్రోలు ప్రజలందఱును దానిని వీరులచింతయని పూజించుచుండిరి. ఆ వీరులచింతయును, ఆ వీర యోధ విగ్రహములునుగూడ నిప్పటికిని బ్రజలచేఁ బూజింపబడుచున్నవి. చాలకాలమువఱకు నాదివ్యస్థలమున నిశ్శబ్దనిశీధరాత్రులయం దీక్రింది దివ్యగానము కోమలకలస్వరముతో వినవచ్చుచుండెను.

"నెత్తుటివసంతమునఁ దోగి • నెనరుఁదీగ
జీవమోహన కరమైన • చిగురుదొడుగఁ
జిన్నిచిగురాకుపీటపై • వన్నెగులుకఁ
గోరకము రాజసంబునఁ • గొలువుదీర్చె"

స మా ప్త ము.



రాజేశ్వరి ప్రెస్, రాజమంద్రి.